# ఆ ము ఖ ము

లౌకిక సంస్కృత వాఙ్మయంలో అత్యున్నత వ్యక్తియైన బాణభట్టును గూర్చి సంస్కృత సాహిత్యాధ్యయనం చేసేవారికి, సామాన్యంగా సాహిత్యాభిరుచి కలవారందరికీ కూడా పరిచయం చేయడమే ఈ ఏకవిషయక గ్రంథం (Monograph) వ్రాయడంలోని ప్రధానోద్దేశ్యము. తరువాత వచ్చిన సంస్కృత కవులమీదనే కాకుండా, ప్రాకృత కవులమీదా, ఇతర దేశభాషా కవులమీదా కూడా ప్రసరించిన బాణభట్టు ప్రభావం అనిర్వచనీయము. గద్య రచయితగా ఈతడు చూపిన ప్రతిభను, నాటక రచయితగానూ, కవిగానూ కాళిదాసు చూపిన ప్రతిభతో పోల్చవచ్చును.

ప్రారంభంలో బాణుని జీవితాన్నీ, గంధ్రాలనూ గూర్చి సంక్షిప్తంగా చెప్పి, ఆంగ్లానువాద రూపంలో కొన్ని భాగాలను ఉదాహరణగా చూపడం ద్వారా బాణుని కళానిర్మాణ చాతురికి సంబంధించిన కొన్ని ప్రధానమైన అంశాలను విశదీకరించడం జరిగింది. బాణుని ప్రతి గ్రంధాన్నీ తీసుకొని గుణదోష విమర్శనా ప్రయత్నం చేయబడింది. భారతీయ సాహిత్య శాస్త్రాన్ని దృష్టిలో ఉంచుకొని పరిశీలించగా బాణుని ద్వారా సంస్కృత సాహిత్యానికి ఎంతటి గొప్ప లాభం కలిగిందో నిరూపింపబడింది. భారతీయ భాషలలో ఉన్న వివిధప్రక్రియలపై ప్రసరించిన బాణుని ప్రభావం కూడా పరిశీలింపబడింది. సంస్కృత మూలభాగాలను ఉదాహరించకుండా వాటి స్థానంలో ఆంగ్లానువాదాలు ఇవ్వబడినాయి. కొన్ని చోట్ల 19 వ శతాబ్దానికి చెందిన రచయితల ప్రామాణిక - అనువాదాలు ఇవ్వబడినాయి. కాదంబరి ఉదాహరణల్లో శ్రీమతి C. M. రిడ్డింగ్ (1896) అనువాదాలూ, హర్షచరితం ఉదాహరణాల్లో E. W. కోవెల్, F. W. థామస్ అనే రచయితల అనువాదాలూ ఇవ్వబడ్డాయి. చిన్న అనువాదాలూ, పద్యరూపానువాదాలూ మాత్రం నావే.

ఇంకా విశేషంగా చదువుకోవాలని అనుకొనేవారికోసం ఒక చిన్న గ్రంథ సూచిక కూడా చేర్చబడింది.

అత్యుత్తమ సంస్కృత మహాకవులలో ఒకడైన బాణభట్టును గూర్చి వ్రాయడానికి నాకు అవకాశం ఇచ్చిన సాహిత్య అకాదెమీవారికి నేను కృతజ్ఞత తెలుపవలసి ఉన్నది.

ప్రూఫులు చదవడంద్వారా సహకరించిన డా. ఆర్, ఏ. మలగీ
భాషా శాఖ) చాలా కృతజ్ఞుడను.

కె. కృష్ణమూర్తి

# విషయ సూచిక

# 1

## బాణుడు: ఆతని జీవితము, రచనలు:

నేటి సాహిత్య ప్రక్రియల్లో నవల అత్యుత్తమమైన స్థానం సంపాదించుకున్నది. అందుచేత ఉత్తమమైన నవల రచించినవాడు కళాత్మకసృష్టిచేసే శిల్పి అని చెప్పడం ఎంతైనా సమంజసంగా ఉంటుంది. జీవిత చరిత్రలకూ, స్వీయ చరిత్రలకూ కూడా సాహిత్యంలో ఉత్తమ స్థానం ఉంది. ఐతే బాణుడు ఉదయించి, శాశ్వతంగా నిలిచే శక్తి గల రెండు గద్య కావ్యాలు వ్రాసేవరకూ (కనీసం రెండువేల సంవత్సరాలనుంచి అవిచ్ఛిన్నంగా సాగుతూ వస్తూన్న సంస్కృత వాఙ్మయంలో), నవలా ప్రక్రియ కాని, జీవితచరిత్ర – స్వీయచరిత్రల ప్రక్రియ కాని తెలియదనే చెప్పాలి బాణుని గద్య కావ్యాలు నాటినుండి నేటివరకూ, ఒక మహాప్రతిభాశాలి రచించిన రచనలనీ, అనుకరణ యోగ్యాలైన ఉత్తమ కావ్యాలనీ, మన్ననలు పొందుతూ వస్తున్నాయి. సంస్కృత గద్యానికి ఇలాంటి క్రొత్త రూపు రేఖలు దిద్దిన బాణుడు హిమాలయ శిఖరంవలె అత్యున్నతంగా నిలిచి ఉన్నాడు. ఈ సాహిత్య ప్రక్రియలో అనన్యసాధారణమైన స్థానం సంపాదించుకొన్న బాణుణ్ణి అనుకరించాలని చూసే ప్రతి ఒక్కడూ హతాశుడు కాక తప్పడం లేదు. బాణుడు రచించిన కాదంబరి, సంస్కృత గద్యకావ్యాల్లో అన్నింటి కంటె ఎక్కువ ఆదరపాత్రం అవడమే కాకుండా, అత్యుత్తమ రచనగా పేరుకూడా సంపాదించుకుంది. ఈతని హర్షచరితంతో పోల్చడానికికూడా

మరొక గ్రంథం ఏదీ ప్రస్తుతం లభించడంలేదు. బాణుడికి ఆశ్రయం ఇచ్చిన హర్షవర్ధనుని జీవితచరిత్ర, బాణుని స్వీయచరిత్రకూడా ఇందులో కలిసి ఉన్నాయి. ఇది ఐతిహాసిక జీవితచరిత్ర రచన విషయంలో, భారతదేశంలో జరిగిన ప్రథమ ప్రయత్నం. అయితే, ఇందులోని ఐతిహాసికాంశాలుకూడా యథార్థాలే అవడం గమనించతగిన విషయం.

బాణుని తరువాతి తరాలవారు, అతన్ని సరస్వతీదేవి అపరావతారంగా భావించడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. వారందరూ అతని ప్రతిభని ఎన్నివిధాల ప్రశంసించాలో అన్ని విధాలా ప్రశంసించారు. బాణుడు సాహితీ సామ్రాజ్యానికి సార్వభౌముడని కొందరు ప్రశంస చేస్తే, మరి కొందరు "బాణోచ్ఛిష్ట మిదం జగత్" అని అంటూ — "బాణుడు తన వర్ణనా చాతుర్యంచేత ఈ జగత్తునంతా ఎంగిలిచేసి విడిచిపెట్టాడు; ఇంక ఇతరులకి మిగిల్చినవల్లా కొద్దిపాటి మెతుకులే" అని పొగిడారు. ఎందరో మహాకవులుకూడా, బాణుని రీతినైపుణ్యాన్నీ, అర్థగాంభీర్యాన్నీ, మానవ భావావిష్కరణ విషయంలో ఆతనికి ఉన్న అనుపమ సామర్థ్యాన్నీ అనేక విధాల ప్రశంసించారు. ఈ విధంగా బాణుడు, తన కావ్యాల్లో చూపించిన ప్రతిభా ప్రభావంచేత అనతికాలంలోనే ఒక లోకోత్తర వ్యక్తిగా మన్ననలు పొందాడు. మహారాజు ద్వారా ఏ మహాకవికీ లభించని సన్మానాలు అందుకున్నాడు. దేవిని స్తుతిస్తూ ఇతడు రచించిన చండీశతకం స్తోత్ర కవుల్లో కూడా ఈతనికి ఒక ఉత్తమస్థానం సంపాదించి పెట్టింది.

సాధారణంగా సంస్కృతకవు లెవరూ, తమను గూర్చిగాని, తమ సమకాలిక విషయాలను గూర్చిగాని, సూచనా మాత్రంగానైనా, తమ కావ్యాల్లో చెప్పడం అలవాటు లేదు. చివరికి కాళిదాసుకూడా తనను గూర్చిగాని, తన ఆశ్రయదాతలైన రాజును గూర్చిగాని, ఒక్క వాక్యమైనా వ్రాయ లేదు. దీనితో ఆతని కాలాదుల విషయంలో, అధునిక విమర్శకుల్లో ఏర్పడిన ఎన్నో అభిప్రాయభేదాలు చూస్తూనే ఉన్నాం. సంస్కృత కవుల్లోఉన్న ఈ అలవాటుకు భిన్నంగా, బాణుడు, తననుగూర్చీ, తన వంశీయులు, తన సమానకాలికులు మొదలైన వారినిగూర్చీ విస్తృతంగా చెప్పడమే కాకుండా తన ఆశ్రయదాతయైన హర్షవర్ధన చక్రవర్తిని గూర్చిన అద్భుత వర్ణనకూడా

హర్షచరితంలో చేసినందుకు అతన్ని చాలా అభినందించాలి. ఈ దృష్టితో చూస్తే బాణుడు, భారతదేశంలో ఆవిర్భవించిన మొట్టమొదటి చారిత్రక కావ్యరచయిత; మొట్ట మొదటి స్వీయచరిత - నిర్మాత. ఈతని రచనల్లో ఆనాటి రాజాస్థానాల్లోని అత్యున్నతమైన సంస్కృతి స్పష్టంగా గోచరిస్తుంది.

హర్షవర్ధనుని ఆస్థానంలో బాణుడు ఆస్థానకవిగా అనితరసాధారణమైన గౌరవం పొందాడు. రాజ్యవైశాల్యాన్ని పట్టి చూసినా, విద్యా కళాదుల్ని పోషించడంలో ఉన్న అభిరుచిని పట్టి చూసినా, స్వయంగా కవిత్వం చెప్పే ప్రతిభావిశేషాన్ని పట్టి చూసినా, చంద్రగుప్త విక్రమాదిత్యుడితో పోల్చ గినవాడు హర్షవర్ధనుడు. ఈతడు దాదాపు నలభై సంవత్సరాల సుదీర్ఘకాలం (క్రీ. శ. 606 నుండి 64' వరకు) రాజ్యం చేశాడు. ఈతని పరిపాలనా కాలంలోనే చైనా యాత్రికుడైన హ్యూయన్‌త్సాంగ్ భారతదేశం అంతా పర్యటించి, తన అనుభవాలు పొందుపరుస్తూ, ఎన్నో చారిత్రిక విషయాలు తెలిపే గ్రంథాలు వ్రాశాడు. క్రీ. శ. 671 నుంచి 681 వరకు నలందా విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేసిన ఇత్సింగ్ అనే మరో చైనా యాత్రికుడు, తన యాత్రాగంథంలో, జీమూతవాహనుడనే బోధిసత్త్వుని కథ ఆధారంగా తీసుకుని, హర్షచక్రవర్తి 'నాగానందం' అనే నాటకం వ్రాసినట్లూ దానిని రంగంమీద ప్రయోగించినట్లూ వ్రాశాడు. నాగానందమే కాకుండా హర్షవర్ధన చక్రవర్తి వ్రాసిన 'రత్నావళి', 'ప్రియదర్శిక' అనే మరి రెండు నాటికలుకూడా ప్రాచీనాలంకారికుల మన్ననలు అందుకొన్నాయి.

బాణుడు తన రెండు కావ్యాల్లోనూ, తననుగూర్చి, తన వంశీయులను గూర్చి కొన్ని విషయాలు చెప్పి ఉన్నాడు. పూర్తిగా పౌరాణిక పద్ధతి అనుసరిస్తూ, ఇతడు, సృష్టికర్తయైన బ్రహ్మ మొదలు తన వంశం ఏ విధంగా విస్తృతి చెందిందీ తెలిపి, తన గోత్రమైన వత్స గోత్రానికి చెందిన వారి నందరినీ అత్యధికంగా ప్రశంసించాడు. బాణుడు, కాన్యకుబ్జదేశంలో, శోణానదీ తీరాన ఉన్న 'ప్రీతికూటం' అనే ఒక గ్రామంలో జనించాడు. ఈ కథను బట్టి బాణునికి తన పూర్వపురుషుల విషయంలో ఎంత గౌరవం ఉందో స్పష్టం అవుతుంది. ఈతని దగ్గరగా ఉన్న పూర్వపురుషుల క్రమం ఈ విధంగా ఉంది:—




ప్రీతికూటం, ధర్మనిష్ఠాగరిష్ఠులూ, సకల విద్యా పారంగతులూ ఐన బ్రాహ్మణుల నివాసస్థానమైన అగ్రహారం. బాణుని తల్లిపేరు రాజదేవి. ఈతని చిరుతప్రాయంలోనే ఆమె స్వర్గస్థురాలైంది. అందుచేత ఇతడు తండ్రి చేతుల్లోనే పెరిగాడు. ఐతే, ఇతడు, ఈ అదృష్టానికి కూడా చాలాకాలం నోచుకోలేదు. పద్నాల్గు సంవత్సరాల వయస్సులోనే పితృవియోగం కూడా కలిగింది. తండ్రి కూడా అకాలమరణం చెందడంతో బాణుడు అపార దుఃఖాక్రాంతుడై, ఈ దుఃఖం మరచిపోవడం కోసం దేశసంచారం ప్రారంభించాడు. ఈతనికి చంద్రసేనుడు, మాతృసేనుడు అనే ఇద్దరు సవతి అన్నలూ, గణపతి, అధిపతి, తారాపతి, శ్యామలుడు అనే పితృవ్య పుత్రులూ ఉండేవారు.

బాణుడు గొప్ప సంపన్న కుటుంబంలో జన్మించడమే కాకుండా, వైదికములూ, లౌకికములూ అయిన వివిధ విద్యల్లో ప్రగాఢ పాండిత్యం సంపాదించాడు. ఈతని గురువైన భర్చు అనే పండితుడు మౌఖరీవంశ సామ్రాట్టులనుండికూడా పూజలు అందుకున్నాడట. ప్రీతికూట గ్రామం ఈ మౌఖరీ వంశీయుల సామ్రాజ్యంలోనే ఉండేది. బాణుడు దేశసంచారం చేసినప్పుడు ఆతని వెంట, ఒక యువరాజు వెంట ఉండవలసినంత పరివారం ఉండేది. ఆ పరివారంలో ఆతని సవతి అన్నలు, ఇంకా ఎందరో ఇతర మిత్రులూకూడా ఉన్నారు. సర్పవైద్యుడు, కంసాలి, చిత్రకారుడు, గాయకుడు, నాట్యకర్త, జూదగాడు మొదలైన అనేకరకాల మనుష్యులుకూడా ఈ

పరివారంలో ఉండడం చాలా ఆశ్చర్యకరంగా ఉంటుంది. ఈ పరివారంలో మొత్తం నలభై నలుగురు ఉన్నారు. వీళ్ళల్లో ఒక్కొక్కడు, ఏదో ఒక కళలోనో శిల్పంలోనో ప్రత్యేకంగా ప్రావీణ్యం సంపాదించినవాడే. కొందరు వివిధ దేశభాషల్లో కవులైతే కొందరు తత్త్వశాస్త్రవేత్తలు. చాలామంది వివిధ కలాశిల్పాది నిష్ణాతులు. ఈ యాత్రికులందరికీ తాంబూలాలు ఏర్పాటు చేయడానికి కొందరు సేవకులూ, వినోదం కలిగించడానికి కొందరు ఐంద్రజాలికులూ, గానవినోదం కోసం కొందరు గాయకులూ కూడా ఆ పరివారంలో ఉన్నారు. ఆటలాడేవాళ్ళూ, జూదరులూ, నటులూ, వ్రాయసగాళ్ళూ, వీళ్ళే కాకుండా బౌద్ధ సన్యాసులూ, సంన్యాసినులూ, రత్నపరీక్షకులూ, వైద్యులూ, వేరువేరు మతాలకి చెందిన సంన్యాసులూ, కథాకథకులూ, కుమ్మరులూ, సంవాహకులూ (ఒళ్లు పట్టే వాళ్లు) కూడా ఆ పరివారంలో ఉన్నారు. ఈ విధంగా సంఘంలో వేరువేరు తరహాలకి చెంది, వేరువేరు అభిరుచులతో ఉండే శిల్పుల్నీ, కళాకారుల్నీ, విద్యావేత్తల్నీ ఒకచోటికి చేర్చి ఇంత సుదీర్ఘ దేశసంచారం చేశాడంటే బాణుడు గొప్ప ధనవంతుడే కాకుండా అతి విశాల హృదయుడు కూడా అయి ఉండాలి. ఈ మిత్రబృందంతో కలిసి ఇతడు, జీవితంలోని ఆనందాలన్నీ అనుభవిస్తూ, పవిత్ర క్షేత్రాలూ, రాజాస్థానాలూ, విద్యాకేంద్రాలూ సందర్శిస్తూ, కవిపండితామల పరిచయం చేసుకుంటూ, నిర్విచారమైన జీవితం గడపి ఉండాలి. ఇలా దేశసంచారం చేయడంతో ఇతనికి విభిన్న స్వభావాలుగల మానవులతోటీ, ప్రకృతితోటీ కూడా ఘనిష్ఠమైన సంబంధం ఏర్పడి గొప్ప లోకానుభవం లభించింది. మనుష్యుల్నీ, వారి పద్ధతుల్నీ చక్కగా అర్థం చేసుకో కలిగాడు. ఒకమాటలో చెప్పాలంటే — అతని సహజప్రతిభకు మెరుగులు దిద్దడానికి అతని విద్యాభ్యాసం ఎంత ఉపకరించిందో, అతని దేశసంచారం కూడా అంత ఉపయోగపడింది. కొంతకాలానికి ఈ దేశసంచారంతో విసుగుచెంది అతడు తన జన్మభూమి ఐన ప్రీతికూట గ్రామం చేరుకున్నాడు. బంధువులూ, మిత్రులూ ఎంతో ఆప్యాయంతో స్వాగతం ఇచ్చారు. కొంతకాలంపాటు ఆ గ్రామంలో సుఖంగా నివసించాడు.

స్వగ్రామానికి తిరిగి వచ్చిన బాణుడు చాలా స్వల్పకాలం మాత్రమే అక్కడ ప్రశాంత గ్రామీణ జీవనం గడపగలిగాడు. అది గ్రీష్మ ఋతువు. ఒకనాటి అపరాహ్ణసమయంలో, బాణుడు, మధ్యాహ్న భోజనానంతరం

విశ్రాంతి తీసుకుంటూ ఉంటాడు. ఇంతలో హర్షవర్ధన చక్రవర్తికి సపత్ని సోదరుడైన కృష్ణరాజు పంపిన మేఖలుకుడనే వార్తావహుడు వచ్చి ఒక లేఖ అందచేశాడు. ఏ మాత్రమూ ఆలస్యం చేయకుండా, అజిరవతీ నదీతీరాన మణిపురంలో విడిసి ఉన్న హర్షచక్రవర్తి దర్శనం చేయవలసిందని ఆ లేఖ ద్వారా బాణునికి ఆహ్వానం వచ్చింది. ఆ గ్రామంనుంచి మణిపురంలో ఉన్న హర్షవర్ధనుని తాత్కాలిక నివాసం చేరాలంటే రెండు రోజుల ప్రయాణం పడుతుంది. తన విద్యైశ్వర్యాదుల్ని గూర్చి అసూయపడే కొందరు రాజాస్థానంలోని వాళ్లు తన విషయంలో హర్షచక్రవర్తికి కొంత దురభిప్రాయం కలిగించారనీ, దాన్ని తొలగించడానికై రాజాస్థానంలో ఉన్నతోద్యోగిగా ఉన్న కృష్ణరాజు ఎంతో ప్రయత్నం చేస్తున్నాడనీకూడా బాణునికి ఆమేఖలు కుని మాటలద్వారా తెలిసింది. బాణుని శీలస్వభావాలు చాలా పరిశుద్ధమైన వనీ, అతని ప్రతిభా పాండిత్యాలు రాజాదరణకు తగిన వనీ, దృఢమైన నమ్మకం కృష్ణరాజుకు ఉంది. అయినా, బాణుడే స్వయంగా చక్రవర్తి దర్శనం చేసి ఆతనికి నచ్చచెప్పినప్పుడుగాని ఆతని మనస్సులో నాటుకు పోయిన దురభిప్రాయం తొలగదని కృష్ణరాజు భావించాడు. బాణుడు చాలా విశృంఖలమైన జీవితాన్ని గడిపేవాడని అసూయాపరులు చెప్పిన మాటలన్నీ చక్రవర్తి నమ్మి ఉండడంచేత, ఆయన మనస్సు త్రిప్పాలంటే బాణునికి తప్ప మరెవ్వరికీ సాధ్యం కాదు.

రాజాస్థానంలోని వాళ్లు, రాజుదగ్గర తననుగూర్చి చేసిన దుష్ప్రచారానికి బాణుడు మనస్సులో చాలా బాధపడ్డాడు. స్వయంగా వెళ్ళి తన పవిత్రచరిత్రనీ, నీతి పారిశుద్ధ్యాన్నీ కూడా చక్రవర్తి ముందు ఋజువు చేసుకోవడానికి ఇక ఏ మాత్రమూ ఆలస్యం చేయకూడదనుకున్నాడు. మార్గం ప్రక్క ఉన్న గ్రామాలలోని మిత్రుల అతిథిగా రాత్రులు గడుపుతూ, నిబిడారణ్యాలమీదుగా ప్రయాణం చేస్తూ మూడవ రోజు మణిపురం చేరుకున్నాడు. ముందు జరగబోయే రాజసందర్శనం విషయంలో ఆతని మనస్సులో కొన్ని సందేహాలు లేకపోలేదు. సేవ అనేది కొన్ని కష్టాలతో కూడి ఉంటుందనీ, చక్రవర్తికి కూడా ప్రభువుల కుండే కొన్ని విచిత్రాభిప్రాయాలు ఉండవచ్చుననీ బాణునికి తెలుసు. అవసరం వచ్చినప్పుడు సహాయం చేయాలంటే, తన బుద్ధిచాతుర్యం తప్ప, ఆ రాజాస్థానంలో తనకు తెలిసిన, ప్రాభవంగల, అధికారి గాని మిత్రుడు కాని లేడు. ఏమైనా పరిస్థితిని ధైర్యంగా ఎదుర్కో

వాలని మనస్సు నిబ్బరం చేసుకున్నాడు. దేవతా ప్రార్థనలు చేశాడు, పెద్దల ఆశీర్వాదాలు పొందాడు. ఇవన్నీ ఆతనిలో కొంత ఆత్మవిశ్వాసం పెంపొందించాయి అక్కడ ఉన్న అశ్వశాలలు, గజశాలలు, విశిష్ట వస్త్రాభరణాలు ధరించిన ద్వారపాలకులు, సేవకులు, చక్రవర్తికి కప్పాలు చెల్లించడానికై సుదూర దేశాలనుంచి వచ్చిన ఎందరో సామంత రాజులు — ఈ విశేష దృశ్యాలన్నీ పరిశీలిస్తూ బాణుడు మెల్లగా చక్రవర్తి నివాసంలోనికి ప్రవేశించాడు.

రాజాస్థానంలో ప్రవేశించిన బాణునికి, కృష్ణరాజు సహాయంతో అచిరకాలంలోనే రాజదర్శనం లభించింది. ఐతే, మొదట్లో రాజు—"ఈతడు నీతినియమాదులు ఉల్లంఘించిన భుజంగుడట కదా!" అని అంటూ, చాలా చిన్నచూపు చూశాడు తన విషయంలో రాజు చూపించిన ఈ అనాదర భావానికి ఏమాత్రమూ జంకూ కొంకూ లేకుండా బాణుడు సమాధానం చెప్పాడు. దానితో రాజు ఇతని విషయంలో తనకున్న అభిప్రాయం మార్చుకోవలసి వచ్చింది తనపై రాజు ఆరోపించిన సదాచారహీనుడనే నిందకు సమాధానం చెపుతూ బాణుడు అకుంఠిత తీవ్రవాక్ప్రవాహంతో ఈ విధంగా అన్నాడు:—

"మహారాజా! సత్యం తెలియని వాడివివలె, ప్రతివాళ్ళనీ సందేహించే స్వభావం కలవాడివివలె, చాడీలు చెప్పేవాళ్ళ చేతుల్లో కీలుబొమ్మవలె, లోకుల పోకడ తెలియనివాడివి వలె, ఎందుకు నన్నీ విధంగా నిరాదరం చేస్తావు? లోకులు కాకులవంటి వారనీ, చపలచిత్తులనీ తెలియని వారెవరున్నారు? వాళ్ళు ఇష్టం వచ్చినట్లుగా నీలాపనిందలు వేస్తూ ఉంటారు. ఐతే అందులోని సత్యాసత్యాలు బాగా పరిశీలించడం పెద్దవాళ్ళ లక్షణం. నేనేదో ఎందుకూ పనికిరాని సామాన్యజనుణ్ణి అన్నట్టుగా నీవు భావించడం అన్యాయం. ఎన్నో సోమయాగాలు చేసిన ప్రసిద్ధ వాత్స్యాయన వంశంలో జనించిన బ్రాహ్మణుణ్ణి నేను. వేద వేదాంగాల అధ్యయనం చేసి సహధర్మచారిణితో గార్హస్థ్య

జీవితం గడుపుతున్నాను. నన్ను భుజంగుడు (విటుడు) అనడానికి కారణం ఏమిటి? చిన్నతనంలో నేనేమైనా కొంచెం స్వతంత్రంగా ప్రవర్తించానేమో! ఐతే నేనెన్నడూ ధర్మవిరుద్ధంగా నడవ లేదే! చిన్నతనంలోని ఆ కించిచ్చపల ప్రవృత్తికికూడా నేనిప్పుడు పశ్చాత్తాపపడుతున్నాను.''

బాణుడు ఆస్థానంలో ప్రవేశించిన కొద్దికాలంలోనే హర్షచక్రవర్తికి అతనిమీద అపారమైన గౌరవం ఏర్పడింది. అతని ప్రతిభకు ముగ్ధుడై తనకు ఆప్తమిత్రుణ్ణిగా చేసుకున్నాడు. అతనికి రాజమర్యాద నిస్తూ ఎన్నో బహు మతులు అంకజేశాడు. ఇలాంటి బహుమానాలు వర్ణించే కొన్ని అజ్ఞాతకర్తృకా లైన శ్లోకాలని పట్టి చూస్తే హర్షవర్ధనుడు బాణభట్టుకు మణుగులకొలదీ బంగారం ఎక్కించి ఎన్నో ఏనుగుల్ని బహూకరించినట్లు తెలుస్తూంది. అందు చేతనే బాణభట్టు, ఒక ఐతిహాసిక చక్రవర్తియొక్క ప్రప్రథమ జీవితచరిత్రగా హర్షచరితం అనే ఆఖ్యాయికను అత్యద్భుత శైలిలో వ్రాసి తన ఆశ్రయదాత యొక్క ఋణం తీర్చుకున్నాడు. బాణుడు ఈ ఆఖ్యాయికను మొట్టమొదట తన గ్రామంలో ఉన్న బంధువులికీ మిత్రులికీ చదివి వినిపించాడట వాళ్ళం దరూ దీన్ని తమకు అభిమానాస్పదమైన వాయుపురాణం వంటి ఉత్తమ గ్రంథంగానూ, పవిత్రకృతిగానూ మెచ్చుకుంటూ వేనోళ్ళ కొనియాడారట.

హర్షచరిత్ర వ్రాయడంవల్ల బాణునికి కీర్తీ, ఐశ్వర్యమూ, రాజాను గ్రహమూ లభిస్తే, గద్యకావ్యాల్లో అత్యుత్తమమైన కాదంబరి వ్రాయడంవల్ల అతనికి సంస్కృత గద్యకావ్య రచయితల్లో కిరీటంలేని రాజుగా, సహృద యుల హృదయాల్లో స్థానం లభించింది కథానాయికయొక్క పేరును పట్టి కాదంబరికి ఆ పేరు వచ్చింది. బాణుడు కాదంబరిలో సగం భాగం మాత్రమే పూర్తిచేశాడు. మిగిలిన భాగాన్ని భూషణుడు లేదా పులిందుడు అనే పేరుగల అతని కుమారుడు పూర్తి చేశాడు. హర్షచరిత్రంలోని కథ, హర్షవర్ధనుడు రాజ్యశ్రీని రక్షించి స్థానేశ్వరంతోపాటు కనౌజుకుకూడా రాజు అయిన ఘట్టంలో ఆగిపోయింది. నిజానికి, భారత చక్రవర్తియైన హర్షవర్ధనుని జీవి తానికి సంబంధించిన ఇంకా ఎన్నో ప్రధానఘట్టాలు ఇక్కడినుండే ప్రారంభం

అవుతాయి. అందుచేత కాదంబరివలె హర్షచరితంకూడా మధ్యలో ఆగి పోయి ఉండాలని కొందరు పండితుల అభిప్రాయం.

బాణుడు వ్రాసుకున్న స్వీయచరిత్రనుండికూడా, నిజానికి, ఆయనకి సంబంధించిన వైయక్తిక విషయాలేవీ మనకు తెలియడం లేదు. అతని భార్య పేరేమిటో తెలియదు. ఆతని కుమారుని పేరుకూడా నిశ్చితంగా తెలియదు. ఆతనికి ఎందరు పుత్రులో, వారు ఏ ఏ విద్యలు అభ్యసించారో – ఇలాంటి విషయాలుకూడా తెలియడం లేదు.

బాణునికి మయూరకవితోటీ, మాతంగ దివాకరునితోటీ సంబంధం ఉన్నట్లు తరువాతి శైవకవుల ద్వారానూ, జైనేతిహాస రచయితలద్వారానూ మనకు తెలుస్తూన్నది. బాణుణ్ణి గొప్ప శివభక్తుణ్ణిగా ప్రశంసిస్తూ ఉంటారు. హర్షచరిత ప్రారంభంలో ఉన్న శివప్రార్థనా శ్లోకాన్ని[1] సుదూర దక్షిణా పథంలోకూడా శాసనాల ప్రారంభంలో వ్రాయడం ఒక సంప్రదాయం అయి పోయింది. ''బాణ గద్యం'' అనే పేరుతో యమకాను ప్రాసాది భూయిష్ఠ గద్యరూపంలో ఒక శివస్తోత్రం కూడా ఉంది.

బాణుని సమకాలికులైన కవుల రచనల్లో సూర్యశతకం అనే శబ్దా లంకార భూయిష్ఠమైన ఒక స్తోత్రకావ్యమూ, ఆతడే రచించిన, శృంగార రసాప్లుతాలైన ఏడు శ్లోకాలూ లభిస్తున్నాయి మయూరకవి బాణునికి శ్వశు రుడు లేదా శ్యాలకుడు అనీ, వారిద్దరూ ఒకరితో ఒకరు పోటీపడి వ్రాసిన స్తోత్రాలద్వారా దేవతానుగ్రహం సంపాదించుకున్నారనీ, ఈ దేవతాను గ్రహంచేత మయూరుడు కుష్ఠరోగాన్నీ, బాణుడు ఏదో మరొకరోగాన్నీ పోగొట్టుకున్నారనీ కథలు ప్రచారంలో ఉన్నాయి. శృంగారరసభరితమైన ఒక పద్యపాదం రచించడంద్వారా మయూరుడు తన పుత్రిక లేదా సోదరి యైన బాణపత్నికి రహస్యక్రీడల్లో అంతరాయం కలిగించడంచేత ఆమె శపించగా ఆతనికి కుష్ఠరోగం వచ్చిందట. ఖండించిన అవయవాలు మళ్ళీ మొలిచేటట్లు చేసే ప్రభావం తన స్తోత్రానికి ఉందని ఋజువుచేయడం కోసం బాణుడు తానే తన అవయవాలు ఖండించుకొన్నాడట. మయూరుని

1. నమస్తుఙ్గ శిరశ్చుమ్బి చన్ద్రచామర చారవే
త్రైలోక్య నగరారమ్భ మూలస్తమ్భాయ శమ్భవే. హర్షచ.

శాపకథకు సంబంధించిన శ్లోకం కూడా రసవత్తరమైనది. ప్రణయకుపిత ఐన భార్యను సుప్రతిమాలుతూ బాణుడు ఇలా అన్నాడట:—

"గతప్రాయా రాత్రిః కృశతను శశీ శీర్యత ఇవ
ప్రదీపోఽయం నిద్రావశముపగతో ఘూర్ణత ఇవ.
ప్రణామాన్తో మాన స్త్యజసి న తథాపి క్రుధమహో!"

**"తెల తెలవార వచ్చె నిదె తీయని రేతిరి చంద్రబింబమున్
వెల వెలఁబారె దీప మట నిద్దుర వైఁగొన జోగుచుండె పే
రలుకయుఁగాదె పావపతనావధి? మానమదేల వీడవో".**

సరిగా అదే సమయానికి అవైపు వెళ్ళడం తటస్థించిన మయూరుని నోట్లోంచి అచింతితంగా—

"కుచప్రత్యాసత్త్యా హృదయమపి తే చండి కఠినమ్."
**"యలఘుకుచాభిషక్తి హృదయంబును చండి! కఠోరమాయెనే."**1

అని నాల్గవపాదం వచ్చేసిందట.

మనం పైన చూచిన విధంగా బాణుడు గొప్ప శివభక్తుడే అయినా, మతావేశం ఉన్నవాడు కాడు. ఇతని గ్రంథాల్లో వైదిక దేవతల స్తోత్రాలూ, పౌరాణిక దేవతల స్తోత్రాలూ మాత్రమే కాకుండా, జైన బౌద్ధ మతాలకి సంబంధించిన దేవతల స్తోత్రాలుకూడా కనబడుతున్నాయి. దీన్నిపట్టి మతాల విషయంలో ఈతని హృదయం ఎంత విశాలమైనదో స్పష్టం అవుతుంది. హర్షచక్రవర్తికి వలె బాణునికికూడా బుద్ధుని విషయంలోనూ, బౌద్ధ జీవిత విధానం విషయంలోనూ అదరాభిమానాలు ఉన్నాయి. రాజ్యశ్రీని రక్షించిన దివాకర మిత్రుడనే బౌద్ధాచార్యుణ్ణీ, వివిధ మతాలవారికి ఆశ్రయం ఇచ్చే ఆయన ఆశ్రమాన్నీ, బాణుడు హర్షచరితంలో సుదీర్ఘంగా వర్ణించిన తీరును పట్టి ఈ విషయం స్పష్టం అవుతుంది.

బాణుని బుద్ధివైభవమూ, హృదయ వైశాల్యమూకూడా ఆతని రచనల్లో అడుగడుగునా కనిపిస్తూ ఉంటాయి. ప్రతీ శ్లోకంలోను, ప్రతీ వాక్యంలోను బాణుడు చూపించిన అద్భుతశైలీ, రచనా చాతుర్యమూ మనల్ని ముగ్ధుల్ని

1. పద్యానువాదాలన్నీ పు. శ్రీ. రా. రచించినవి.

చేస్తాయి. అతడు వివిధ విద్యల్లో ఎంతో పరిశ్రమచేసి, ప్రధానంగా కావ్యరచనాభ్యాసంలో నిర్విరామంగా కృషిచేసి, రచనలో ఇంత పరినిష్ఠితత్వాన్ని సంపాదించుకొని ఉండాలి. ఐతే, తానుసాధించిన ఈ సకలకలా చాతుర్యానికి అతని కేమాత్రమూ గర్వం ఉన్నట్లు కనబడదు. వ్యాసుడూ, సాతవాహనుడూ, భాసుడూ, కాళిదాసూ, గుణాఢ్యుడూ మొదలైన ఎందరో సంస్కృత ప్రాకృతభాషా కవుల్ని, పురాణాది రచయితల్ని కూడా అతడు ఎంతో ఆదరంతో స్తుతించాడు. అతడు పేర్కొన్న కొందరు మహాకవుల కావ్యాలు మనకిపుడు లభించకపోవడం మన దురదృష్టం. భారతదేశంలో ఉన్న ఐతిహాసిక సంప్రదాయమూ, పురాణేతిహాసాదుల్లో నిక్షిప్తమై ఉన్న పౌరాణిక సంప్రదాయమూకూడా బాణునికి బాగా తెలుసు. అతనికున్న సాహిత్యశాస్త్ర ప్రావీణ్యం సాటిలేనిది. విరోధాభాస, శ్లేష, అనుప్రాస, యమకము, అతిశయోక్తి, ఉత్ప్రేక్ష మొదలైన, అతిక్లిష్టమైన అలంకారాలు కూడా అతడు అనాయాసంగానూ, అతి సహజంగానూ ప్రయోగించకలడు. ఇదంతా, సాధారణంగా, సాహిత్యశాస్త్రంలో మంచి ప్రవేశం కలవాళ్లు చేయగలిగిన పని. ఇంతేకాదు. తత్త్వశాస్త్రానికి సంబంధించిన అన్ని విభాగాల్లోనూ, ఆ రోజుల్లో ప్రచారంలో ఉన్న వివిధ కళల్లోనూ, వైజ్ఞానిక విషయాల్లోనూ కూడా బాణునికి మంచి పాండిత్యం ఉంది. వ్యాకరణమూ, ఛందఃశాస్త్రమూ, కామశాస్త్రమూ, షడ్దర్శనాలూ, జైన బౌద్ధ మతాలూ, వీటి అన్నింటిలోనూకూడా ఈతనికి నిర్దుష్టమైన పాండిత్యం ఉంది. ఈ విధంగా ఈతనికి సహజంగా ఉన్న ప్రతిభకు అత్యుత్తమ పాండిత్య సహాయం కూడా లభించింది. ఇలాంటి ప్రతిభా పాండిత్యాల కలయిక ఎక్కడోకాని మనకు కనబడదు. అందుచేతనే ఇతడు పదమూడు శతాబ్దాలుగా సంస్కృత వాఙ్మయ తారాపథంలో అత్యున్నత స్థానాన్ని అలంకరించి గొప్ప కాంతితో వెలుగుతున్నాడు.

బాణుడు సకలైశ్వర్యాలతో తులతూగే ధనిక కుటుంబంలో జనించడమే కాకుండా, అనన్య సాధారణమైన రాజాదరణంకూడా పొందగలిగాడు. ఈ రెండింటినీ పట్టి చూస్తే, తరువాతి తరాలవారికి ఇతడు అందచేసిన సాహిత్య సంపద తక్కువేమో అనిపిస్తుంది. వెనుక సూచించినట్లు బాణుడు అకాలమరణానికి గురియైనట్లు కనిపిస్తుంది. అలా కాకపోతే, ఇతడు తన

అత్యుత్తమ రచనయైన కాదంబరిని ఆవిధంగా అసంపూర్ణంగా విడిచిపెట్టే వాడు కాడు.

పైన చెప్పిన కావ్యాలే కాకుండా బాణుడు రెండు మూడు రూపకాలు కూడా రచించినట్లు ప్రసిద్ధి ఉంది వాటిలో ఒకటి లభ్యం ఔతున్నది, రెండవది లభ్యంకాదు. తరువాతి రచయితల ఉద్ధరణల ద్వారా మాత్రమే మనకు తెలియవస్తూన్న 'ముకుట తాడితకం' అనే రూపకం ప్రస్తుతం అలభ్యం. ఇందులోని కథావస్తువు భీముడు దుర్యోధనునిమీద పగతీర్చుకోవడం అయి ఉంటుంది.

"ఆశాః ప్రోషితదిగ్గజా ఇవ, గుహాః ప్రధ్వస్తసింహా ఇవ
ద్రోణ్యః కృత్త మహాద్రుమా ఇవ, భువః ప్రోత్ఖాతశైలా ఇవ.
బిభ్రాణాః క్షయకాల రిక్త సకల త్రైలోక్య కష్టాం దశాం
జాతాః క్షీణమహారథాః కురుపతేః దేవస్య శూన్యాః సభాః."

"అపగత దిగ్గజంబులగు నాశల కైవడి, ఛిన్న సర్వ పా
దపములు లోయ లట్లు పరిధావితసింహ గుహాళియున్ వలెన్
క్షపిత నగంబు భూమివలె శామితలోక యుగాన్తమున్ వలెన్
వ్యపరత తన్మహారథ కురూద్వహ సత్సభ లందె శూన్యతన్."

నిజానికి మూలంలో ఉన్న ప్రగాఢకరుణరసాన్ని అనువాదంలోనికి తీసుకురావడం చాలా కష్టమైన పని.

భోజుని శృంగార ప్రకాశికలోని ఉద్ధరణల ద్వారా ఈ రూపకానికి సంబంధించిన మరో రెండు శ్లోకాలుకూడా వెలుగులోనికి వచ్చాయి.

"ధ్వస్తాః క్షుద్రా ధార్తరాష్ట్రాః సమస్తాః
పీతం రక్తం స్వాదు దుఃశాసనస్య.
పూర్ణా కృష్ణా కేశబన్ధప్రతిజ్ఞా
తిష్ఠత్యేకః కౌరవస్యోరు భఙ్గః."

"కూలం జేసితి ధార్తరాష్ట్రుల నతిక్షుద్రాత్మ దుఃశాసన
స్థూలోరః ఫలకంబుఁ జీల్చి బలిమిన్ శూరుల్ భయంబందగాఁ

**జాలన్ ద్రావితి నా కవోష్ణ రుధిరాస్రావంబు, పాంచాలికే**
**శాలిన్ గట్టితిఁ గౌరవోరుదలన వ్యాపారమొండే యికన్."**

"ఊరూ నిపీడ్య గదయా యది నాస్య తస్య
పాదేన రత్నముకుటం శకలీ కరోమి
దేహం నిపీతనిజధూమవిజృంభమాణ
జ్వాలాజటాలవపుషి జ్వలనే జుహోమి."

"**చంచచ్చండ గదాభిఘాతమున నా సౌయోధనోరుద్వయిన్**
**సంచూర్ణం బొనరించి, పాదనిహతిన్ నానా మణీరాజితో**
**దంచత్కాంతిఁ గిరీటమున్ శకలితం బొనట్లు నేఁ జేతు న**
**ట్లొంచన్ జేయనిచో మదీయతను వగ్నిధ్మంబుగాఁ జేసెదన్."**

ఈ ఉదాహరణాల్ని పట్టి మాస్తే భట్టనారాయణుని వేణీసంహారంలో వలెనే ఈ రూపకంలో కూడా కథావస్తువు భీముడు తన ప్రతిజ్ఞ చెల్లించు కోవడం అయి ఉంటుందని తోస్తుంది.

కాళిదాసుని కుమారసంభవంలోని కథను కథావస్తువుగా తీసుకొని వ్రాసిన పార్వతీ పరిణయం అనే నాటకం ఈతని రెండవ రూపకం. నిజానికి ఇది బాణుడు రచించినది కాదు. చాలా అర్వాచీనుడైన వామనభట్ట బాణుడనే ఒక దాక్షిణాత్య కవి 15 వ శతాబ్దంలో రచించిన రూపకం ఇది. అందుచేత దీన్ని గూర్చి పరిశీలించవలసిన పనిలేదు.

# 2

## బాణుడు - సాహిత్యకళ

అద్భుతాఖ్యాయికలూ (Romantic fictions) వీరగాథలూ (Heroic biographies) వ్రాసే అలవాటు సంస్కృతభాషలో పతంజలి కాలం (క్రీ పూ. రెండవ శతాబ్దం) నాటికే ప్రచారంలో ఉన్నట్లు నవీన విమర్శకుల అభిప్రాయం అలాంటి రచనల్లో కొన్నింటిని పతంజలి, ప్రసంగ వశంచేత, మహాభాష్యంలో పేర్కోవడం జరిగింది. వర్ణనాభూయిష్ఠమైన (లౌకిక) గద్యరచనారీతి క్రీ శ. 150 వ సంవత్సర ప్రాంతానికి, 355 వ సంవత్సరం ప్రాంతానికీ చెందిన ప్రాచీన శిలాశాసనాల్లోకూడా కనబడు తుంది. ఐతే ప్రాచీన రచన లేవీ మనకిపుడు లభించక పోవడంచేత ఈలాంటి రచనావిధానంలో పేరెన్నికగన్నవాడు బాణుడే అని చెప్పవలసి వస్తూన్నది. అంతకుముందు అంతగా ప్రచారంలోలేని రీతిలో వ్రాసిన ఈ గద్యకావ్యాల్ని సరిగా పరిశీలించాలంటే బాణుడే స్వయంగా చెప్పిన కొన్ని సాహిత్య పద్ధతుల్నీ, అత డంగీకరించిన కథా సంప్రదాయాల్నీ దృష్టిలో ఉంచుకోవడం ఎంతైనా అవసరం. కాదంబరిని, ఈనాడు ప్రచారంలో ఉన్న అద్భుత గాథల్ని (Romantic novel) చదివినట్లుగా చదువుతే సరిపోదు. ఇందులో ఉన్న సాహిత్య విశేషాన్ని సరిగా వెలకట్టాలంటే బాణుని కాలంలో ప్రచారంలో ఉండి, అతడు అనుసరించిన సాహిత్య నియమాల్నీ, పద్ధతుల్నీ బాగా ఆకళించుకోవాలి. అందుచేత ఆనాటి సాహిత్య నియమాలూ, పద్ధతులూ మొదలైన విషయాన్ని గూర్చి, శక్యమైనంతవరకూ, అతని మాటల్లోనే తెలుసుకోవడం అవసరం.

ఇది బాణునికి పూర్వం వ్రాసినది — అని నిశ్చింతగా చెప్పకలిగిన సాహిత్యశాస్త్ర గ్రంథం ఏదీ మన కిపుడు లభించడం లేదు. అందుచేత అతని కాలంలో ప్రచారంలో ఉన్న సాహిత్య శాస్త్రీయ పద్ధతులు ఏ విధంగా ఉండేవో తెలుసుకోవడానికి అతని గ్రంథాల్లోనే అన్వేషించవలసిన పని

ఏర్పడింది. మనకు లభించే సాహిత్య శాస్త్రగ్రంథాల్లో అతిప్రాచీనమైనవని చెప్పుకునే గ్రంథాలు రచించిన భామహుడు, దండీకూడా, బాణుని గద్య కావ్యాలు రెండూ చూసిన తరవాతనే, గద్యకావ్యాల విభజన చేసినట్లు కన బడుతుంది. భరతుని నాట్యశాస్త్రం అతిప్రాచీనమే అయినా, అది ప్రధానంగా నాట్యరూపకాలను గూర్చి వ్రాసిన గ్రంథం అవడంచేత గద్యకావ్యాలకి సంబంధించిన విషయాలేవీ అందులో ముచ్చటించడం జరగలేదు. అందుచేత మనం, చాలావరకు, గద్యకావ్యాలనుగూర్చి బాణుడు వెలువరించిన అభి ప్రాయాలమీదనే ఆధారపడవలసి ఉంటుంది. పోనీ, బాణుడు పేర్కొన్న ఇతర గ్రంథాలనుంచి ఏదైనా సహాయం లభిస్తుందేమో అని అనుకున్నా, అవికూడా ఇపుడు లభ్యం అవడం లేదు. బాణుడు తన గద్యకావ్యాల ప్రారంభంలో సాహిత్యానికి సంబంధించిన సామాన్య విషయాల్ని గూర్చి, ప్రధానంగా గద్యకావ్యాల స్వరూప స్వభావాదులకు సంబంధించిన విషయా లను గూర్చి తనకున్న అభిప్రాయాలను సవిస్తరంగా విశదీకరించటం మన అదృష్టం. ఈ విషయాలికి సంబంధించిన ఆతని అభిప్రాయాలు కొన్ని శ్లోకాల్లో నిక్షిప్తమై ఉన్నాయి. ఇవన్నీ కంఠస్థం చేయవలసిన శ్లోకాలు. కావ్యాల మధ్యలోకూడా, బాణుడు, అవకాశం లభించినప్పుడల్లా ఆనాటి రాజాస్థానాల్లో జరిగే సాహిత్య వ్యాసంగాలూ, గోష్ఠులో ఏవిధంగా ఉండేవో విశదీకరించాడు.

రాజకుమారుడైన చంద్రాపీడుడు, విద్యాభ్యాసం పూర్తియైన తరవాత రాజభవనంలోకి ప్రవేశిస్తూ చూచిన దృశ్యాలవర్ణనన్లు, బాణుడు అవలం బించిన రెండవ పద్ధతికి ఉదాహరణగా చూపించవచ్చు. ద్వారకవాటాదుల మీద నగిషీలు చెక్కిన దారుఫలకాలూ, చిత్రరచనలూ, నియమిత వస్త్రా దులు ధరించిన అధికారులూ, సేవకులూ, అశ్వరక్షకులూ, గజపాలకులూ, వీరి నందరినీ అతిసహజమైన పద్ధతిలో వర్ణించాడు కవి. వీటి అన్నింటి కన్నా మనకు ఎక్కువ కుతూహలం కలిగించేది — అక్కడ ఒక అందమైన హాలులో జరుగుతూన్న సాహిత్య గోష్ఠుల వర్ణన :—

''ఆ రాజభవనంలో చేరిన సామంతరాజులు అనేక వినో దాలతో కాలక్షేపం చేస్తూన్నారు. కొందరు కావ్యగోష్ఠి జరుపు తూన్నారు. కొందరు పరిహాసకథల్లో మగ్నులై ఉన్నారు.

కొందరు బిందుమతులు పూరిస్తున్నారు. కొందరు, మిత్రులిచ్చిన ప్రహేళికలను గూర్చి ఆలోచిస్తున్నారు. కొందరు రాజు రచించిన కావ్యాలు పఠిస్తున్నారు. కొందరు నాట్య రూపకాది ప్రయోగాల్లో పాల్గొంటున్నారు. మరికొందరు కావ్యాలలో ఉన్న గుణ గణాల్ని మెచ్చుకొంటున్నారు...

వివిధ వర్ణాలకు చెందిన శ్రేణులు తీసికొని వచ్చి సమర్పిస్తూన్న నూతనార్థ (ధన) సంచయంతో రాజభవనం, అనేక విధాలైన వర్ణాల పంక్తులు బోధిస్తూన్న నూతనార్థాలు కల మహాకవి రచిత గద్యకావ్యంవలె ఉన్నదట.

(ఇది శబ్దమాత్రసాధర్మ్యంచేత ప్రయోగించిన ఉపమ. ఇక్కడ ప్రయోగించిన "వర్ణ" 'శ్రేణి' 'అర్థ' పదాలకు 'బ్రాహ్మణాది వర్ణాలు, అక్షరాలు', 'సాలెవారు మొదలైన వృత్తి జీవుల శ్రేణులు (guilds), పంక్తులు' 'ధనము – అర్థము' అని రెండేసి అర్థాలున్నాయి. ఈ అర్థ ద్వయాన్ని బట్టి, రాజభవన - గద్య కావ్యాలు రెండింటికీ అన్వయించే విశేషణం ప్రయోగించి "ఉత్కృష్టకవిగద్యమివ వివిధవర్ణశ్రేణిప్రతిపాద్యమానానేకాభినవార్థసఞ్చయమ్" అని వ్రాశాడు బాణుడు.)

దీనిని బట్టి, ఒక మహాకవి రచించిన ఉత్తమమైన గద్యకావ్యాన్ని చదివి ఏ విధంగా ఆనందించేవారో మనకు స్థూలంగా తెలుస్తూన్నది. గద్య కావ్యంలో రీతియే (style) అన్నింటికంటె ప్రధానం. శ్రోతలు ఆశ్చర్య చకితు లయేటట్లుగా, చెవులకు ఇంపుగా ఉండేటట్లుగా, ప్రతి అక్షరమూ తూచి తూచి వాడుతూ అడుగడుగునా క్రొత్త క్రొత్త అర్థాలు గుబాళింపచేయాలి. భాష విషయంలో ఇంతటి అద్భుతమైన దంతపు నగిషీ పని ప్రపంచంలోని మరి ఏ వాఙ్మయంలోనూ కనీ వినీ ఎరుగనిది. దీన్ని సాధించాలంటే కేవలం సమాసాలూ, అనుప్రాసలూ, శ్లేషలూ విరోధాభాసాలూ, అతిశయోక్తులూ రూపకాలూ, వీటిని మాత్రమే ఉపయోగిస్తే చాలదు. కవితా

సౌందర్యం పెల్లుబికే వివిధ కల్పనలుకూడా ఉండాలి. అప్పుడే కావ్యంలో మొదటినుంచి చివరిదాకా వ్యాపించి ఉన్న అద్భుతరసాన్ని పోషించడం జరుగుతుంది. సమానార్థక పదాలూ, నానార్థక పదాలూ ఒకటి రెండు పంక్తుల దీర్ఘసమాసాలు వ్రాయడానికి అనువైన వాక్యరచనారీతీ, ఇవన్నీ సంస్కృతభాషకు మాత్రమే ఉన్న విశిష్ట లక్షణాలు. ఈ విశిష్ట లక్షణాలన్నీ బాణుడు తన రచనల్లో అతినైపుణ్యంతో ఉపయోగించుకున్నాడు. వీటిని ఈ విధంగా ఉపయోగించుకున్న మరొక కవి ఎవరూ, నేటివరకూ, సంస్కృత వాఙ్మయ చరిత్రలో లేడనే చెప్పాలి. శబ్ద ప్రయోగ వైచిత్ర్యంతోపాటు కవితనుకూడా కళాదృష్టితో అభ్యసించడానికి అనువైన వాతావరణం ఆనాటి రాజాస్థానాల్లో ఉండేది. బాణుడుకూడా అలాంటి కవితాగోష్ఠుల్లో పాల్గొంటూ అసాధారణమైన శబ్దప్రయోగ చాతుర్యం సంపాదించుకున్నట్లు అతని రచనలద్వారా తెలుస్తుంది. ఐతే, రాజప్రాసాదాలలో జరిగే ఈ వినోదాల్లో కేవలం విద్యావంతులు మాత్రమే పాల్గొని ఆనందించే వారనే విషయం మనం మరవకూడదు. అందుచేత ఎంతో సంస్కృతీ, సంస్కారమూ ఉంటేనేకాని శక్యం కాని గద్యకావ్యరచన ఉత్తమ వర్గీయులకు మాత్రమే ఉపయోగించే ఒక కళ అని బాణుడు భావించడం సహజమే. ఇలాంటి గద్యకావ్యాలు సామాన్యులు చదివి ఆనందించేవి కావు. బాణునికంటె ప్రాచీనుడు కాకపోయినా బాణునితో సముడని చెప్పడానికి తగిన సుబంధుడనే మరొక గద్యకావ్య రచయిత – ఏ ప్రాచీనకవికీ లేని, 'ప్రత్యక్షరశ్లేష నిష్ణాతుడు' అనే బిరుదు తనకు ఉన్నట్లు సగర్వంగా చెప్పుకున్నాడు. నేటి సాహిత్యాభిరుచులు మారిపోవడంతో, ఆనాడు గుణాలుగా పరిగణించినవన్నీ నేడు దోషాలు కావచ్చు. ఐతే, ఆనాటి సాహిత్యాభిరుచి ప్రకారం ఆడంబరాన్ని 'ఓజస్సు' అనే పేరుతో కొనియాడుతూ గద్యకావ్యానికి ఓజస్సే జీవితం ("ఓజః సమాస భూయస్త్వ మేతద్గద్యస్య జీవితమ్") అని నిర్ధారణ చేశారు. అప్పటి సాహిత్య విమర్శకులు, ఇలాంటి గద్య, కావ్యరచనయే మహాకవుల ప్రతిభకు గీటురాయి అన్నారు. ("గద్యం కవీనాం నికషం వదన్తి" వామన కావ్యాలంకార సూత్రము. I. III. 21.) గద్య కావ్యాన్ని కూర్చిన ఈ భావం క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దం నాటికే భారతీయాలంకార శాస్త్రంలో స్థిరంగా ఏర్పడి ఉంది,

మనం గుర్తించవలసిన మరొక విషయం—హర్షచరితము, కాదంబరి, ఈ రెండూ గద్యకావ్యాలే అయినా, బాణుడు, మొదటిది ఆఖ్యాయిక అనీ, రెండవది కథ అనీ చెప్పుకున్నాడు. ఆఖ్యాయిక అనే పదం చాలా ప్రాచీనమైనది. 'ఆఖ్యాన' శబ్దంతోపాటు ఈ పదం వైదిక వాఙ్మయం లోనూ, రామాయణ, మహాభారతాల్లోనూ, కౌటిల్యుని అర్థశాస్త్రంలోనూ (I. 5) పాతంజల మహాభాష్యంలోనూ (IV. 2-60) కనబడుతూంది. వీటి అన్నింటిలోనూ 'ఆఖ్యాయిక' అనే పదానికి అర్థం భారతీయ సంప్రదాయంలో ఉన్న ఇతిహాసప్రక్రియతో మేళవించి ఉంది. అంటే, ఆఖ్యాయికలో కాల్పనిక విషయాలు ఎన్ని ఉన్నా మూలకథ మాత్రం ఐతిహాసికం అయి ఉండాలి. ఇందులో అక్కడక్కడ నీతిబోధకాలైన వాక్యాలు కూడా ఉంటాయి. సాధారణంగా కథానాయకుడు తాను చేసిన ఘనకార్యాలన్నీ ఉత్తమ పురుషలో చెప్పుకుపోతూ ఉంటాడు. అవాంతర విభాగాలకి 'ఉచ్ఛ్వాసం' అనే పేరు ఉంటుంది. సార్వకాలిక సత్యాలు తెలిపే కొన్ని సంగ్రహోక్తులు, వక్త్రము, అపరవక్త్రము మొదలైన నిర్దిష్ట వృత్తాల్లో ఉంటాయి. ఇవి, బాణుడు స్పష్టంగా పేర్కొన్న కొన్ని ఆఖ్యాయికా లక్షణాలు. ఐతే కథా లక్షణాన్ని గూర్చి బాణుడు ఇంకా విస్తృతంగా చెప్పాడు:

''స్ఫురత్కలాలాప విలాసకోమలా
కరోతి రాగం హృది కౌతుకాధికమ్.
రసేన శయ్యాం స్వయమభ్యుపాగతా
కథా జనస్యాభినవా వధూరివ.''

''మధురాలాపవిలాసల
నధికరసస్ఫూర్తిఁదా స్వయంబుగ శయ్యన్
వధువువలె చేరి కథయ
త్యధిక హృదయరాగ కౌతుకాదులఁ గూర్చున్.''

''హరన్తి కం నోజ్జ్వలదీపకోపమై
ర్నవైః పదార్థై రుపపాదితాః కథాః
నిరన్తర శ్లేష ఘనాః సుజాతయో
మహాస్రజశ్చమ్పకకుడ్మలైరివ.''

"సునిబిడ శ్లేష ఘనములు శుద్ధ జాతు
లలఘు సద్దీపకోపమా ప్రాప్తి నొప్పు
నవ పదార్థాల సత్కథల్ చవులఁబెంచు
చంపకంబుల ముకుళాల స్రజము లట్లు."

క్రీ. శ. ఆరవ శతాబ్దానికి చెందిన ప్రథమాలంకారికుడు, భామహుడు కూడా 'కథ' 'ఆఖ్యాయిక' అనే రెండు విధాల గద్యకావ్యాల విషయంలో ఈ అభిప్రాయాలే ప్రకటించాడు. ఐతే, ఈతని సమనంతర కాలికుడైన దఁడి ఈ విధమైన విభజన నిరర్థకమని అంటాడు. ఆతని అభిప్రాయం ప్రకారం—వీర—శృంగార—అద్భుతరసాలూ, రీతికి సంబం ధించిన ఓజోగుణం, అలంకారాలూ, ఇవన్నీ కొద్దిగానో, గొప్పగానో, ఈ రెండు విధాలైన రచనల్లోనూ కూడా ఉంటాయి. ఒకదానిలో ఐతిహాసిక వృత్తాంతాన్ని అలౌకిక కథతో మేళవిస్తే, మరొక దానిలో అలౌకిక కథనే స్వాభావిక కథను చిత్రించినట్లుగా చిత్రించడం జరుగుతుంది. ఇదే, ఈ రెండింటికీ ఉండే స్వల్పభేదం. అందుచేత దండి కృతమైన కావ్యాదర్శానికి వ్యాఖ్యరచించిన కొందరు పండితులు (క్రీ. శ. 700) హర్షచరితంవలె కాదంబరి కూడా ఆఖ్యాయికే అని అన్నారు. (కృష్ణమాచారి: సంస్కృత వాఙ్మయ చరిత్ర. 1937 పే. 457.)

కథా-ఆఖ్యాయికల లక్షణాలే కాకుండా, బాణుడు సామాన్యంగా అన్ని సాహిత్య ప్రక్రియలకీ అన్వయించే విస్తృతమైన లక్షణం కూడా చెప్పాడు. హర్షచరిత ప్రారంభంలో ఉన్న ఈ కావ్యసామాన్య లక్షణాన్ని అలఁకారికులందరూ అంగీకరించి ఉన్నారు:

1. రచయితలకేం—కోకొల్లలు. నిజమైన ప్రతిభ ఉన్న వాళ్ళు మాత్రం చాలా అరుదు.

"సన్తి శ్వాన ఇవాసంఖ్యా జాతిభాజో గృహే గృహే
ఉత్పాదకా న బహవః కవయః శరభా ఇవ.

హ. చ. I. 5.

"జాతి మాత్రైక భాజనుల్ శ్వగణరీతి
నెందరెందరో కవులుందు రింట నింట
చూడ నుత్పాదకత్వ సంశోభితాత్మ
లరుదుగాదకొ సత్కవుల్ శరభరీతి."

2. రచనల్లో నాలుగు రీతులు (styles) ఉన్నాయి. ఒక్కొక్కదాన్లో ఒక్కొక్క వైలక్షణ్యం వుంది.

"శ్లేషప్రాయ ముదీచ్యేషు ప్రతీచ్యేష్వర్థ మాత్రకమ్
ఉత్ప్రేక్షా దాక్షిణాత్యేషు గౌడేష్వక్షరడమ్బరమ్.
హ. చ. I. 7

"తీర్చి శ్లేషను కూర్తురుదీచ్యులర్థ
దీప్తి వైశిష్ట్యమలరు ప్రతీచ్యకృతుల
దాక్షిణాత్యులలోన నుత్ప్రేక్ష మెండు
గౌడు లక్షర డంబర ప్రౌఢులరయ."

3. ఒక ఉత్తమ రచనకి ప్రధానంగా ఐదు లక్షణా లుండాలి. ఐతే ఇవన్నీ ఒక చోట కలిసి ఉండడం చాలా అరుదు.

"నవోర్థో జాతి రగ్రామ్యా శ్లేషోఽక్లిష్టః స్ఫుటో రసః
వికటాక్షర బన్ధశ్చ కృత్స్న మేకత్ర దుష్కరమ్."
హ. చ. I. 8

రమ్య నవ్యార్థ చయము నగ్రామ్య జాతి
శ్లేషమక్లిష్ట మతి సుఖాసేవ్య రసము
బంధురాక్షర వికట సద్బంధ మరయ
నిన్ని గుణములు నొకట సంపన్న మౌనె."

4. ఒక మంచి అఖ్యాయిక మనఃశాంతి చేకూర్చి పాఠ కుణ్ణి ఆనందడోలికల్లో ఓలలాడిస్తుంది. మంచి ఉపదేశం కూడా చేస్తుంది.

"సుఖ ప్రబోధ లలితా సువర్ణ ఘటనోజ్జ్వలైః
శబ్దై రాఖ్యాయికా భాతి శయ్యేవ ప్రతిపాదకైః

హ. చ. I. 20

**"పటుతరంబులును సువర్ణఘటితము లగు**
**కాంత శబ్దాల ప్రతిపాదకముల వోలె**
**మోదదంబు సుఖప్రబోధ లలిత**
**మిలను నాఖ్యాయిక యు శయ్యవలెనె యొప్పు."**

ఈ విధంగా పద్యకావ్యాలవలె గద్యకావ్యాలుకూడా ఆనంద సంధాయకంగాను, ఉపదేశదాయకంగానూ కూడా ఉండాలి. వీటిలో వర్ణనా పద్ధతులూ, కథా సంవిధానాలూ కూడా తుల్యంగానే ఉంటాయి. ఇంక ఉన్న భేదం అల్లా రీతిలో మాత్రమే. గద్యకావ్యరచయితకి కూడా, అత్యుత్తమ పద్యకావ్యరచయితతో సమానమైన గౌరవం ఇచ్చారు సంస్కృత వాఙ్మయంలో. ఇది ప్రపంచకంలో, ఏ ఇతర వాఙ్మయంలోనూ లేదనే చెప్పాలి. ఐతే ఇది యాదృచ్ఛికంగా గాని, భ్రాంతి మూలకంగాని ఇచ్చిన గౌరవం కాదు. గద్యరచయిత ఎంతో ప్రయత్నంచేసి వివిధాలంకరణాలద్వారా తీర్చి దిద్దిన పద్ధతిలో తన రీతికి ఒక వైశిష్ట్యం సమకూర్చుకుని, సంపాదించుకొన్న గౌరవం ఇది. దీనితో, రీతికి సంబంధించినంతవరకు పద్య మహాకావ్య రచయిత కంటె కూడా ఉత్తమగద్య రచయితయే సహృదయ హృదయావర్జనం చేయకలడనే విషయాన్ని పండితులు కూడా అంగీకరించవలసి వచ్చింది. ఇది పదాలతో చేసే నగిషీ పని. దీన్ని భారతీయ స్థాపత్యంతో (మూర్తి నిర్మాణ కళతో) పోల్చవచ్చు. పద్యకావ్య రచయిత సాధారణంగా ఉపమ, రూపకము వంటి అలంకారాలే ఉపయోగిస్తాడు. వాటిని కూడా సకృత్తుగానే ఉపయోగిస్తాడు. శ్లేష, విరోధాభాస వంటి వాటి జోలికి ఎక్కువగా వెళ్ళడు. కాని బాణుని వంటి ఉత్తమగద్య రచయితలు శ్లేష

విరోధాభాసాదుల్నే అతినైపుణ్యంతో ఎక్కువగా ప్రయోగిస్తారు. ఇలాంటి పదాల నగిషీమీద ఆధారపడిన రచనల్లో ఉండే ప్రమాదం ఏమిటంటే, ఇందులో అర్థావిష్కరణా, రసభావ వ్యంజనమూ కుంటుపడతాయి. అందు చేతనే బాణుని కోవకి చెందిన సుబంధువు, ఎంత పదగుంభనాశక్తీ, పాండిత్యమూ ఉన్నా పై రెండు విషయాల్లోనూ బాగా దెబ్బతిన్నాడు. అప్పుడప్పుడు బాణుడు కూడా ఈ ప్రమాదానికి లోనైన ఘట్టాలు లేక పోలేదు. ఐతే, కథా గమనాన్ని చక్కగా సాగించడంలోనే కాకుండా, పాత్రలన్నీ సజీవంగా మన ఎదుట నిలిచేటట్లుగా వివిధ భావాల్ని అభివ్యక్తం చేయడంలో కూడా చాలావరకు చరితార్థుడైన గౌరవం ఇతని కొక్కనికే దక్కింది.

ప్రాచీన కవుల్లో వ్యాస-ప్రవరసేన-భాస-కాళిదాసాదుల విషయంలో బాణభట్టు ఆదరాతిశయాన్ని ప్రకటించాడు. ఎందుచేతనంటే— వీరరసపరిప్లుతాలైన ఎన్నో మహాకావ్యాలు రచించిన ఉత్తమ భారతీయ కవులు వీరు. ఐతే, అద్భుతరసానికి ఆకరం ఐన ఒక క్రొత్త కథా కథన విధానానికి దారి చూపించిన గుణాఢ్యుని బృహత్కథను బాణుడు ప్రత్యేకంగా ప్రశంసించాడు. అద్భుతగాథయొక్క ప్రధాన లక్ష్యం మనోవినోదం. ఇందులో అతిప్రాచీన కాలానికి చెందిన రాజుల కథలూ, రాణుల కథలూ ఉంటాయి. ఇది పాఠకుణ్ణి పరిచిత జీవనావధులు దాటించి, ఒక ఊహా ప్రపంచంలో విహరింప చేస్తుంది. వాస్తవానికి అది ఒక పరిపూర్ణ ప్రపంచం అని చెప్పడానికి అవకాశం లేదు. "మానవ ప్రవృత్తిలో ఉన్న కొన్ని అంశాల్ని తీవ్రతరంగానూ, అతిశయోక్తి భరితంగానూ చిత్రించి, ఇది ఒక విధమైన నూతన మానవ వ్యక్తుల్ని సృజిస్తుంది. ఇందులో మామూలుగా ఉండే కొన్ని అనుభవాల్ని పూర్తిగా విదిలేసి మానవునికి సంబంధించిన కొన్ని విషయాలమీద మాత్రమే దృష్టి కేంద్రీకరించడంతో, ఆ విషయాలే మానవ జీవితానికి సంబంధించిన ప్రధాన విషయాలన్నట్లుగానూ, నిజానికి జీవితం అంటే ఇదే అన్నట్లుగానూ అనిపిస్తుంది." (చూ. గిల్లియన్‌బీర్ రచించిన 'ది రొమాన్స్', మెథుయన్-లండన్ 1970 పే. 3) ఒక విధంగా చూస్తే నేటి నవలకి దారి చూపించింది ఇదే అయినా, దీనికీ, నవలకీ చాలా భేదం కూడా ఉంది. ఇందులో చిత్రించే జీవిత విధానానికీ మామూలుగా వివిధ సమాజాల్లో కనబడే జీవిత విధానానికీ ఏమీ సంబంధం ఉండదు

ఇందులో చిత్రించేదంతా ఊహాచిత్రం. ఇందులోని జీవిత విధానం అంతా కవి కల్పించిన దేవతలకూ, రాజులకూ, రాణులకూ మాత్రమే సంబంధించి ఉంటుంది. ఈ దృష్టితో చూస్తే బాణుని గద్యకావ్యాలు రెండూ కృత్రిమ వాతావరణంతో నిండిన 'అద్భుత కథలు' అనే చెప్పవలసి ఉంటుంది. ఐతే వాటిలో అక్కడక్కడ రాజప్రాసాదాల్లో ఉండే రాజభటాదుల యథార్థ జీవితాంశాలు కూడా తొంగి చూస్తూ ఉంటాయి. ప్రధానంగా ఇది, మనం హర్షచరితంలో చూడవచ్చు.

ప్రస్తుతం లభ్యమయే, పద్యరూపంలో ఉన్న బృహత్కథా సంస్కృతానువాదాన్ని పట్టి చూస్తే బాణుని కాదంబరీ కథకు, కొంతవరకూ, బృహత్కథ మూలం అన్నట్లు కనిపిస్తుంది. ఐతే దానిలోఉన్న కథ అతి సంక్షిప్తంగా ఉంది. బాణుడు ఈ అత్యల్పమైన కథ తీసుకున్నాడు. సంస్కృ మహాకావ్యాల్లో సంప్రదాయ సిద్ధంగా వస్తూన్న,దీర్ఘవర్ణనలు చేర్చాడు. సునిపుణుడైన అక్షరశిల్పిగా, ఆ వర్ణనల మీద మళ్లీ, అందమైన ఎన్నో అలంకారాలు ఎంబ్రాయిడరీగా (కుట్టు మొగ్గలుగా) అల్లాడు. ఈ విధంగా రచించిన కాదంబరియొక్క రసాన్ని ఆధునిక పాఠకులు పూర్తిగా ఆస్వాధించాలంటే ఆ అద్భుతగాథకి సంబంధించిన భావనా ప్రపంచంలో ప్రవేశించి అందులోని వివిధ విచిత్రవిధానాలలో ఒక విధమైన తాదాత్మ్యం ఏర్పరచుకోవాలి. ప్రాచీన భారతదేశానికి సంబంధించిన సమాజంలో, సాగుబాటు ఉన్నవాళ్లు కొందరు, కొన్ని శతాబ్దాలపాటు అవిచ్ఛిన్నంగా ఇలాంటి స్థితిని సంపాదించుకో కలిగారనే విషయం, ఈ కాదంబరిని గూర్చి వాళ్లు కురిపించిన పొగడ్తలను పట్టి స్పష్టం అవుతుంది. బాణుని కావ్యాల్లో ఉన్న రసాన్ని ఆస్వాదించకలిగి ఉండడం అంటే, సాహిత్యాన్ని ఆస్వాదించే సహృదయత్వం ఉండడం అన్నమాట. కొంచెం ప్రయత్నమూ, పట్టుదలా చూపిస్తే సంస్కృతంతో సామాన్య పరిచయం ఉన్న ఈనాటి భారతీయుడుకూడా బాణుని కావ్యాల్ని ఆస్వాదించకలుగుతాడు. ఐతే, పాశ్చాత్యుల దృష్టిలో మాత్రం ఈతని కావ్యాలు సుదూరహేయాలు కావచ్చు. ఎందుచేతనంటే కావ్యాల్లోకూడా జీవిత సత్యాల్ని మాత్రమే అన్వేషించేవారికి అలంకార భూయిష్ఠంగా ఉండే అద్భుతగాథలు అపహాస్యాస్పదంగా కనబడడంలో ఆశ్చర్యం ఏమీ లేదు.

ఐతే, పాశ్చాత్యదేశాల్లోకూడా, ఎన్నో సాహిత్య ప్రక్రియాభేదాలకి సంబంధించిన సుదీర్ఘమైన చరిత్ర ఉండడం గమనార్హం. రూపకాలంకారాలు కేవలమూ అందంకోసం తగల్చిన అలంకారాలు మాత్రమే కాదనీ, ఆంతర భావావిష్కరణకు ఉపయోగించే విశిష్టసాధనాలనీ. ఇప్పుడిప్పుడు సాహిత్య విమర్శకులు అంగీకరిస్తున్నారు. అలాగే, విరుద్ధ స్వభావాలు ఉన్న వస్తువులకు ఊహాకల్పితమైన సంబంధాన్ని కల్పించే విరోధాభాసల్లో, రచయితలకి ఉండే కలాభిరుచి మాత్రమే కాకుండా, ఏదో ఒక కావ్యసత్యంకూడా నిగూఢమై ఉంటుందని అంగీకరిస్తున్నారు. ''రాళ్లుకూడా ధర్మోపదేశాలు చేస్తాయి; ప్రవహించే సెలయేళ్ళలో గ్రంథాలు ఉన్నాయి'' అని షేక్‌స్పియర్ మహాకవికూడా అన్నాడు. ఈ విధంగా కవులందరూ ఈ ప్రపంచాన్ని చూడడానికి ఒక నూతన దృక్పథం ఏర్పరచుకొంటారు. రూపక – విరోధాభాసలు వీళ్ళ సహజభాష వీళ్ళ దృష్టిలో ఈ భౌతిక ప్రపంచం అంతా ఆధ్యాత్మిక ప్రపంచానికీ లేదా రసప్రపంచానికి ఒక ప్రతీకం మాత్రమే. ప్రధానంగా భారతీయ కవులందరూ కాల్పనికమైన భావనా ప్రపంచంలో విహరిస్తూ, అందుకు ఉపయోగపడడం కోసం, అసాధారణమైన ఒక కవిసమయకోశాగారాన్ని నిర్మించుకున్నారు.

# 3

# చండీ శతకము

చండీశతకం ఇరవైయొక్క అక్షరాల (ఏడు గణాల) సుదీర్ఘ స్రగ్ధరా వృత్తంలో కూర్చిన నూరు శ్లోకాలున్న శతకం. ఇందులో ఉన్న ప్రతి ఒక్క శ్లోకమూ చండీదేవి ప్రార్థనారూపమైనది. సకల లోకక్షేమాన్ని ఉద్దేశించి అనేక రీతుల్లో చేసిన ప్రార్థన ఈ శతకంలోని అన్ని శ్లోకాల్లోనూ ఉన్న సాధారణ విషయం. ఎన్నో అలంకారాలతో ప్రయత్నపూర్వకంగా కూర్చిన

ప్రతి శ్లోకమూకూడా చండీదేవి – మహిషాసురుల యుద్ధం వర్ణించే వర్ణ చిత్రం అని చెప్పవచ్చు. సమరరంగంలో చండీదేవికీ, మహిషాసురునికీ మధ్య యుద్ధం జరుగుతూన్నప్పుడు, వివిధకోణాలనుంచీ తీసిన ఛాయా చిత్రమా అన్నట్లు, ప్రతి శ్లోకమూకూడా చండీదేవియొక్క ఒక్కొక్క ఆకృతి సంనివేశాన్ని చిత్రిస్తుంది. అంతకు పూర్వం మహిషాసురుడి చేతిలో ఓడిపోయిన దేవతలందరూ ఆ యుద్ధ రంగప్రేక్షకులు.

సంస్కృతసాహిత్య విమర్శకారులు ఈ చండీశతకాన్ని గూర్చి అంతగా పట్టించుకోలేదు. ఇది స్తోత్రకావ్యమై ఉండడం, ఇది బాణుని రచన అనే సూచనలేవీ ఇందులో లేకపోవడమూ అందుకు కారణాలై ఉండవచ్చు. ఐతే ఇది బాణుని రచనయే అని చెప్పడంలో ఏ మాత్రమూ సందేహం లేదు. మనకు నేటికి కూడా లభిస్తూన్న దీని లిఖిత ప్రతులూ, ఆలంకారికులు ఆయా గ్రంథాల్లో దీనినుంచి గ్రహించిన ఉదాహరణాలూ ఇందులకు తార్కాణం.

బాణుడు అనేక స్థలాల్లో ఉదాహరించిన ఉపాఖ్యానాల్ని పట్టిచూస్తే ఆతనికి ఎంత సువిస్తృతమైన పౌరాణిక జ్ఞానం ఉన్నదో స్పష్టం అవుతుంది. పురాణాల్లో ఉండే ప్రకీర్ణ విషయాల్లో ప్రధానమైన ఒక భాగం దేవతాస్తుతి. ఇప్పుడు మనకు లభించే పురాణాల్లో చాలా పురాణాలు బాణుని కాలం నాటికే లభ్యమైనట్లుగా మనం అంగీకరింపక తప్పదు. కాకపోతే, అవి కొంత వరకూ సంక్షిప్తరూపంలో ఉండి ఉండవచ్చు. పురాణాల్లో ఉండే శివ – విష్ణు – సూర్య – గణపతి – దుర్గాది దేవతా స్తోత్రాలకు సంప్రదాయ సిద్ధంగా, వైదిక మంత్రాల కున్నంత ప్రాశస్త్యం ఉంది. ప్రయోగదూరమైన అతి ప్రాచీన భాషలో ఉండడంచేత వైదికమంత్రాలు సామాన్యులికి కొరుకుడు పడవు. పురాణాల్లో ఉన్న ఈ స్తోత్రాలు అందరికీ అందుబాటులో ఉంటాయి. వైదిక మంత్రాలన్నీ అతి విస్తృతరూపాలైన యజ్ఞయాగాదులతో సంబంధించి ఉంటాయి. ధనవంతులు మాత్రమే ఈ యజ్ఞాలు చేయకలుగుతారు. పురాణాల్లోనూ, ఇతిహాసాల్లోనూ లభించే ఈ స్తోత్రాలను ఎవరి ఇళ్ళల్లో వాళ్ళు చేసుకునే దేవతాపూజల్లో కాని, దేవాలయాల్లో చేసే సాముహికారాధనలలో కాని వినియోగించుకోవచ్చును. అందుచేతనే వాటికంత ప్రచారం లభించింది.

సాహిత్య దృష్టితో చూస్తే, పురాణాల్లో ఉండే ఈ స్తోత్రాల విలవ చాలా తక్కువగా ఉంటుంది. వాటి ప్రచారానికి ప్రధాన కారణం మత సంబంధంగా వాటికున్న ప్రాధాన్యమే. వీటిలో సాహిత్య సౌందర్యం ఉన్నదా లేదా అనే విషయంతో సామాన్య మానవునికి పనిలేదు. ఐతే, బాణునికి పూర్వం ఉన్న కాళిదాసాదులు భక్తిరసాన్నికూడా ఒక అందమైన ప్రక్రియలో పొందుపరచి, ఒక క్రొత్తమార్గం చూపించి ఉన్నారు. మన నాటకాది రూపకాల్లో ఉన్న ప్రార్థనా శ్లోకాలన్నీ ఆయా దేవతలు ఒక నిశ్చితమైన ముద్రలో ఉన్నట్లుగానూ, లేదా ఒక నిశ్చితకార్య నిర్వహణంలో వ్యాపృతులైలనట్లుగానూ చిత్రిస్తాయి. ఒక కళాకారుడు ఈ దేవతలను యథాతథంగా గ్రహించి ఒక చిత్తరువును నిర్మింపవచ్చునా అన్నట్టుగా ఉంటాయి ఆ వర్ణనలు. విస్పష్టంగానూ, అత్యద్భుతంగానూ ఉన్న ఈ వర్ణచిత్రం భావావిష్కరణంలో ప్రభావవంతంగా ఉండి మన హృదయాల్ని ఆకర్షిస్తుంది.

అర్థం తెలిసినా తెలియకపోయినా, స్తోత్రాలు పారాయణ చేస్తేనే పుణ్యం లభిస్తుందని భారతీయుల విశ్వాసం. అలాంటప్పుడు భక్త్యావేశంతో స్తోత్రాలు రచించిన కవులకు ఈ లోకంలోనే విశిష్టమైన దేవతానుగ్రహం లభిస్తుందని విశ్వసించడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. సంస్కృత కవుల్లో, ఇహలోకానికి మాత్రమే సంబంధించిన ప్రవృత్తిగలవాడు ఒక్కడుకూడా లేడని చెప్పవచ్చు. ప్రతీ కవి రచనలోనూ, ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కొంత భక్తి భావం కనబడకుండా ఉండదు. బహుశా ఆనాటి సంఘంలో గౌరవం సంపాదించాలంటే ఇది అవశ్యక మయ్యేదేమో?

భక్తినికూడా అతి సుందరంగా చిత్రించే శక్తి మహాకవులికి ఉంది. భక్తి భావాన్ని కేవలమూ ప్రార్థనలు చేయడానికి మాత్రమే పరిమితం చేయంకుడా, ఒక దేవతను కొన్ని పరిస్థితులకి సంబంధించినట్లుగా చిత్రించి, మానవజీవనానికి సన్నిహితంగా తీసుకువచ్చి, సహృదయ హృదయాహ్లాదం కలిగించే రీతిలో వర్ణించడానికికూడా దీన్ని ఉపయోగించడం జరిగింది. శృంగార – వీర – అద్భుత రసాల్లో ఏదో ఒకటి ప్రధాన బిందువుగా ఉంటుంది. మిగిలిన భావాలన్నీ దానినుంచి ఆవిర్భవిస్తూ ఉంటాయి; లేదా దానిని ఉపోద్బలంచేస్తూ ఉంటాయి. సంస్కృత రూపకాల ప్రారంభంలో

సాధారణంగా అలాంటివి ఒకటో రెండో పద్యాలు ఉంటాయి. తన కవితా ప్రాభవాన్ని చూపించడానికా అన్నట్లు బాణుడు అలాంటి శ్లోకాలతో ఒక శతకమే వ్రాశాడు. దేవి మహిషాసురుణ్ణి సంహరించడం మార్కండేయ పురాణాంతర్గతమైన దేవీ మాహాత్మ్యంలోని ప్రధానవిషయం. ఐతే ఈ ఒక్క సంఘటనా తప్ప బాణుడు దేవీమాహాత్మ్యలోనుంచి గ్రహించిన విషయ మేమీ లేదు. ఇతడు మహాప్రతిభాశాలియైన కవి. ఆ మహిషాసుర సంహార ఘట్టాన్ని తన ప్రతిభా నేత్రంతో చూస్తూ, యుద్ధంలోని పరాకాష్ఠ ఐన దాన్ని మాత్రమే వివిధరూపాల్లో చిత్రిస్తాడు. దేవి స్వయంగా కల్పించి నటిం చిన ఈ మహిషాసుర సంహారం అనే నాటకంలో దేవియే నాయిక. మహిషా సురుడు దుష్టుడైన ప్రతినాయకుడు. దేవితో యుద్ధానికి తలబడడానికి ముందు మహిషాసురుడు దేవతల నందరినీ ప్రత్యే కంగానూ, సామూహికంగానూ కూడా ఓడించి ఉన్నాడు. ఆ అసురునితో కొన్ని పర్యాయాలు చిన్న చిన్న యుద్ధాలు చేసిన తరవాత దేవి విలాసగా వాని శిరస్సుమీద ఎడమపాదంతో ఒక్కతాపు తన్నుతుంది. దానితో అతడు మరణిస్తాడు. ప్రపంచానికి వాని వల్ల భయం తొలగి శాంతి లభిస్తుంది. బాణుని ప్రతిభను స్పందింపచేసినది, దేవి చేసిన ఈ చివరి పని మాత్రమే. అందుచేత, ఒకే విషయానికి సంబం ధించిన విభిన్న చిత్రణలే ఈ శతకంలోని నూరు పద్యాలు అని చెప్ప వచ్చును. ఈ విషయాన్ని వర్ణించడానికి ఇతడు ఏవిధంగా భిన్నమైన శైలిని ఉపయోగించాడో, ఏవిధంగా వివిధాలంకారాల ప్రయోగం చేశాడో మనం ఇక్కడ గమనించదగిన అంశం. ఈ దృష్టితో సూస్తే సుదీర్ఘమైన స్రగ్ధరా వృత్తాన్ని ఎన్నుకోవడంలోకూడా ఎంత ఔచిత్యం ఉందో మనం గమనించ వచ్చు. అత్యద్భుతమూ. అసాధారణమూ అయిన బాణుని కవితా వైభవాన్ని ఇతరభాషలోకి తీసుకురావడం అనేది అసాధ్యమైన విషయం. మూడు పద్యాలు మాత్రమే గద్యానువాద రూపంలో చూద్దాం:—

1. దేవి త్రిశూలంతో అ రాక్షసుని శరీరం గ్రుచ్చినపుడు మూడు రక్తధారలు ఒక్కమారుగా పైకి ఎగిసి పడ్డాయి. వాటిని చూడగానే 'ఇవి మూడు లోకాల్నీ ఒక్కమారుగా మ్రింగి వేయడం కోసం మృత్యుదేవత చాచిన మూడు నాలుకలా, ఒక్క మారుగా పైకి వస్తూన్నప్పుడు విష్ణువుయొక్క పాదపద్మ రక్త

చ్ఛాయలు ప్రతిబింబించిన మూడు గంగా ప్రవాహాలా, లేదా ఈశ్వరుని పూజలు అందుకోవడం కోసం కలిసివస్తూన్న మూడు సంధ్యలా', అని దేవతలందరూ ఆశ్చర్యపడ్డారు'' (అట్టి దేవి అందరినీ రక్షించు గాక.)

''మృత్యోస్తుల్యం త్రిలోకీం గ్రసితు మతి రసాన్నిః సృతాః కిం ను జిహ్వాః
కిం వా కృష్ణాంఘ్రి పద్మద్యుతిభి రరుణితా విష్ణుపద్యాః పదవ్యః.
ప్రాప్తాః సంధ్యాః స్మరారేః స్వయముత నుతిభి స్తిస్ర ఇత్యూహ్యమానా
దేవై ర్దేవీత్రిశూలాహత మహిష జుషో రక్తధారా జయన్తి'' (చ. శ. 4)

**త్రిజగతి మ్రింగ నొక్క పరి తీవ్రతఁ జూచిన మృత్యు జిహ్వలో**
**స్వజనక పాదపద్మరుచి సంప్లుత గాంగ ఝరీత్రయంబొకో**
**నిజనుతిచేయ నాస్మరవిజేతను జేరు త్రిసంధ్యయోయటం**
**చజరుఁ దల్ప శూల నిహతాసుర రౌధిరధారలొప్పెడిన్.**

2. రుద్రు లందరూ పారిపోయారు. సూర్యుడు భయంతో వణకుతున్నాడు. ఇంద్రుని చేతిలో ఉన్న వజ్రాయుధం జారి క్రింద పడిపోయింది. చంద్రుడు భయపడిపోతున్నాడు. వాయుదేవుడు స్తంభించిపోయాడు. కుబేరుడు వైరం వదులుకున్నాడు. విష్ణువు యొక్క చక్రాయుధం మొరపోయింది. ఈవిధంగా మహిషాసురుని బలం క్షణక్షణానికీ పెరిగిపోతూన్నది. అట్టి పరిస్థితిలో ఇతరుల సహాయం ఏమీ లేకుండా, ఏ దేవి ఆ అసురుణ్ణి అవలీలగా సంహరించిందో ఆ దేవి మన పాపాలన్నీ తొలగించుగాక,''

''విద్రాణే రుద్రవృన్దే సవితరి తరలే వజ్రిణి ధ్వస్త వజ్రే
జాతాశఙ్కే శశాఙ్కే విరమతి మరుతి త్యక్తవైరే కుబేరే.
వైకుణ్ఠే కుణ్ఠితాస్త్రే మహిషమతిరుషం పౌరుషోపఘ్న నిఘ్నం
నిర్విఘ్నం నిఘ్నతీ వః శయమతు దురితం భూరిభావా భవానీ.''

(చ. శ. 66)

రుద్రుల బృందంబు విద్రాణమై పోవ
చలితుడై సవితయు కలత చెంద
వజ్రియు తృటిలోన ధ్వస్త వజ్రుడు గాగ
సాశంకమతియై శశాంకుడుడుగ
వర మరుత్తులు యుద్ధవిరతులై పారంగ
వైరము మాని కుబేరు డరుగ
కుంఠితాస్త్రుండు వైకుంఠుడు సురగంగ
కరుణార్ద్రహృదశనంది వరుణు డేగ
పౌరుషోపఘ్ను నిఘ్ను నా దారుణాత్ము
మహిషునతివేల రోష దుస్సహ విచేష్టు
శూలమాత్ర ద్వితీయయై నేలఁగూల్చు
దేవి! దురితా పహంత్రివై బ్రోవు మమ్ము.

తా. "విష్ణుచక్రం ఆ అసురుని శరీరంమీద ఉన్న రోమాలకి తగిలినప్పుడు రాయిని ఢీకొన్నట్లుగా చప్పుడయింది. శివుని బాణం వాని చర్మకి తగిలి, కవచానికి తగిలినట్లుగా వెనక్కి తిరిగి పడిపోయింది. ఈ ఇద్దరు దేవతల్నీ, వారి ఆయుధాల్నీ చూసి నవ్వుతూన్నదా అన్నట్లు దేవి ఒక్క పాద ప్రహారంతో ఆ అసురుణ్ణి సంహారించింది. అట్టి దేవి మిమ్ములను అందర్నీ రక్షించుగాక."

"చక్రం చక్రాయుధస్య క్వణతి నిపతితం రోమణి గ్రావణీవ
స్థాణోర్బాణశ్చ లేభే ప్రతిహతి మురుణా చర్మణా వర్మణేవ.
యస్యేతి క్రోధగర్వం హసిత హరిహరా తస్యగీర్వాణ శత్రోః
పాయాత్పాదేన మృత్యుం మహిషతనుభృతః కుర్వతే పార్వతీ వః"

(చ. శ. 73)

హరి చక్రంబది ఖంగుమంచనె తదీయాశ్మాభరోమాహతిన్
హరు బాణంబును వర్మతుల్య ఘనచర్మావిద్ధమై వీగె న
త్తరి నోత్ప్రాసత వారి నా మహిషు నుద్యత్క్రోధతన్ జూచుచున్
చరణాబ్జాహతిమారితాసుర మిమున్ శర్వాణి రక్షించుతన్.

ఈ శతకంలో బాణభట్టు తన కవితాప్రతిభ చూపించడంకోసం ఎన్నుకున్న కథాంశం చాలాపరిమితమైనది. ఇందులో ఈతడు చూపించిన భావనాపటిమ కూడా స్వల్పమైనదే. వీటినిపట్టి చూస్తే, ఇది బాణుడు బాల్యావస్థలో చేసిన ప్రయత్నమనీ, అప్పటికి ఇతడు నిరంతరాభ్యాసం చేస్తూ ఉండడం చేత, మహాకవిగా తాను పొందవలసియున్న ఉన్నతస్థితికి ఇంకా దూరంగానే ఉన్నాడనీ ఊహించవచ్చును. ఈ శతకంలోని భావాలూ వర్ణనలూ కూడా చాలావరకు సాంప్రదాయికాలే కాని స్వాభావికాలు కావు. ఉన్నతభావనా నిర్మితాలైన అద్భుత చిత్రాలేవీ దీన్లో అంతగా మనకు కనిపించవు. ఈ విధంగా ఇందులోని కవిత్వం పరినిష్ఠిత రూపంలో ఉన్నదని చెప్పడానికి వీలులేకపోయినా, దీనిలో మొదటినుంచి చివరిదాకా గోచరించే ఒక విధమైన తీవ్ర, భక్తిభావమూ కూడా ఎంతగానో ప్రశంసాయోగ్యాలుగా ఉన్నాయి. వీటివల్ల స్తోత్రవాఙ్మయంలో దీనికొక మంచిస్థానం లభించింది. ఈ కోవకి చెందిన సమకాలీన స్తోత్రకావ్యాలతోటీ, తరువాత వచ్చిన వాటితోటీకూడా పోల్చి చూస్తే ఇది వాటికి ఏమాత్రమూ తీసిపోదు. మయూరుని సూర్యశతకమూ ఆనందవర్ధనుని దేవీశతకమూ వంటి ఒకటి రెండు శతకాలు పరిశీలించినట్లయితే వాటిలో శబ్దాడంబరం ఎక్కువగానూ, కవిత్వం తక్కువగానూ కనిపిస్తుంది. అంచుచేత ఇది, బాల్యంలో వ్రాసిన కావ్యమే అయినా, ఇది మహాకవి కాబోయే ఒక మహామేధావి బాల్యంలో రచించిన కావ్యమే కాని ఎవరో ఒక సామాన్యకవి బాల్యంలో రచించిన నీరసకావ్యం కాదు. ఈ శతకం ద్వారా బాణునికి మతగ్రంథ రచయితల్లోకూడా శాశ్వతమైన కీర్తి లభించింది. ఇంచుమించు ప్రతి కన్నడ కవీకూడా బాణుణ్ణి ఒక గొప్ప శైవ కవిగా స్తుతించి ఉన్నాడు. బహుశా ఇది వెనుక పేర్కొన్న బాణగద్య అనే స్తోత్రాన్నిపట్టి వచ్చి ఉండవచ్చు.

# 4

## హర్ష చరితము

హెన్రీ ఫీల్డింగ్ అనే ఆంగ్ల నవలారచయిత ఒకాయన ఉండేవాడు. ఆయన వ్రాసిన నవలలు నేటికి కూడా విరివిగా ప్రచారంలో ఉన్నాయి. ఫ్రెంచి వాఙ్మయంలోని నవీన ఉత్తమసాహిత్య ప్రక్రియల్లో, ధనిక వర్గానికి చెందిన అద్భుతగాథలు వ్రాయడమూ, చదవడమూ ఒక ఫేషన్‌గా ఏర్పడింది. వీటికి ఈయన 'అద్భుతగాథా ప్రహసనాలు' లేదా 'హాస్య గద్య కావ్యాలు' అని పేరు పెట్టాడు. ఈ రచనలన్నీ అతి దీర్ఘంగా ఉండడం చేతా, వాస్తవిక జీవితానికి చాలా దూరంగా ఉండడంచేతా, 18వ శతాబ్దం నాటికే ఇవి ఇంగ్లాండులో విమర్శకు గురి అయ్యాయి. ఇలాంటి రచనల్ని గూర్చి ఫీల్డింగు చిరస్మరణీయమైన ఒక అభిప్రాయం వెలిబుచ్చాడు. (The preface to Joseph Andrews : Metheru, London 1965 PP. 1-2) హర్షచరితంలో బాణభట్టు అవలంబించిన శైలికి ఈ అభిప్రాయం ఎంతో అనుగుణంగా ఉండడంచేత దీన్ని ఇక్కడ ఉదాహరించడం ఎంతైనా సమంజసం.

"ఐతిహాసిక కావ్యం (Epic Poetry) కూడా పద్యంలోగాని గద్యంలోగాని ఉండవచ్చు. ఐతే ఐతిహాసిక కావ్యానికి ఉండవలసిన లక్షణాల్లో ఒకటిగా అరిస్టాటల్ చెప్పిన ఛందస్సు లేక పోయినా—కథా, వివిధచేష్టా వర్ణనలూ, చరిత్ర చిత్రణా, భావాలూ, ఉత్తమశైలీ, మొదలైన ఇతర లక్షణాలన్నీ ఉన్నప్పుడు ఒక రచనని ఐతిహాసిక కావ్యం (Epic) అనడంలో తప్పేమీ లేదని నా అభిప్రాయం. అందుచేత హోమర్ వ్రాసిన

ఒడిస్సీ మోస్తరుగానే కాంబ్రే ఆర్చిబిషప్ వ్రాసిన 'టెలెమాకుస్' కూడా నా దృష్టిలో ఐతిహాసిక కావ్యాలకోవకు చెందినదే. ఛందోబద్ధం కాకపోవడం అనే ఒక్క కారణాన్ని పట్టి దీన్ని మరి యే పోలికలూ లేని సాహిత్యప్రక్రియల్లో చేర్చడం కంటె, ఈ ఒక్కటీ తప్ప మిగిలిన పోలికలన్నీ ఉన్న ఐతిహాసిక కావ్యాల్లో చేర్చడమే చాలా ఉచితంగా ఉంటుంది. ఈ విధంగా అద్భుత గాథా ప్రహసనం గద్యలో వ్రాసిన ఒక హాస్య ఐతిహాతిక కావ్యం. ఒక గంభీరమైన ఐతిహాసిక కావ్యానికీ (Serious Epic) దుఃఖాంత కావ్యానికీ ఎంత భేదం ఉన్నదో, దీనికీ, సుఖాంత కావ్యానికీ మధ్య ఉన్న భేదం కూడా అంతే; ఎందుచేతనంటే దీన్లో వివిధ పాత్రలకు ప్రవేశం ఉండడంచేతనూ, అనేక సంఘటనలకు అవ కాశం ఉండడంచేతనూ, దీన్లోని కార్యకలాపం అతి విస్తృతం గానూ, అభివ్యాపకంగానూ ఉంటుంది. కథనీ, దాని గమనాన్నీ పట్టి, దీనికీ గంభీరమైన అద్భుతగాథకూ మధ్యకూడా కొంత తేడా ఉంది.''

ఈ పోలికల్ని చాలా దూరం లాగకుండా, అరిస్టోటల్ ఉపయో గించిన పేర్లు సంస్కృత కావ్యాలకి కూడా ఉపయోగించే పక్షంలో హర్ష చరితం 'ఐతిహాసికాద్భుత గాథ' (Epic Romance) అనీ, కాదంబరి అద్భుతగాథ (Wondrous romantic Tale) అనీ చెప్పవచ్చు. హర్షచరిత నాయకుడు తన సమకాలీనుడైన చక్రవర్తియేయైనా, బాణుడు కథను మొదటి నుండి తుదిదాకా ఒక ఐతిహాసిక కవి (Epic bard) నడిపించి నట్లుగా నడిపించాడు. హర్షవర్ధనుణ్ణి ఒక ఐతిహాసిక నాయకుణ్ణి చిత్రించి నట్లుగా చిత్రించాడు. మొదటినుండి చివరిదాకా ఈతడు అవలంబించిన రీతి (style) అత్యున్నతంగానూ, గంభీరంగానూ నడిచింది. ఇందులో ఎక్కడా హాస్యానికిగాని, పరిహాసానికిగాని తావులేదు. భారతీయ సాహిత్య సంప్ర దాయానుసారంగా ఇది ఒక ఆఖ్యాయిక. ఇందులో ఐతిహాసికమైన యథార్థ గాథ సూత్రంవలె అనుస్యూతంగా వస్తూ ఉంటుంది. ఐతే, కవి తన

భావనాబలంతో కల్పించిన ఐతిహాసిక కావ్యాలకు కావలసిన అలౌకిక సామగ్రితో, అవశ్యకతానుసారంగా, ఈ కథకు క్రొత్త రూపం దిద్దుతూ ఉంటాడు. జీవితాన్ని యథార్థ రూపంలో చిత్రించేదాన్ని 'కామిక్' అన్నట్లైతే, ఆ లక్షణాన్నిబట్టి, హర్షచరితంగాని, కాదంబరిగాని కామిక్కులు కావు. ఎందుచేతనంటే ఈ రెండు కావ్యాలూ కూడా వేరు వేరు మార్గాల్లో ఒక అత్యున్నత జీవితాన్ని చిత్రిస్తున్నాయి. హర్షచరితాన్ని కూడా ఐతిహాసిక కావ్యం అని అనడం అంతగా యథార్థం కాదు. ఎందుచేతనంటే —దానిలో ఉన్న పరిమిత ఐతిహాసిక సత్యాల్ని కూడా మహాకావ్యాల్లో ఉండే కవి సమయాలద్వారా ఆదర్శరూపంలో చిత్రించడం జరిగింది. అలాగే ఇందులో ఉన్న సంఘటనల్ని అన్నింటినీ సాహిత్యదృష్టితో వీర-రౌద్ర-కరుణ — అద్భుతరసాలకు అనుగుణంగా ఉండే వాటినే ఎన్నుకోవడం కూడా జరిగింది. అందుచేత ఈ కావ్యంలో ఉన్న విషయాలన్నీ సాహిత్యదృష్టితో విశ్లేషణం చేసి, అవశ్యకతానుసారంగా కొన్ని విమర్శనాత్మక భావాలు ప్రకటించడం, రాబోయే పేజీల్లో పాఠకులు గమనించగలరు. బాణుని రీతికి (style) సంబంధించిన కొన్ని అంశాల చర్చ ఈ గ్రంథంలోని చివరి భాగంలో చేర్చబడింది.

''నిజవర్షాహిత స్నేహా బహుభ క్త జనాన్వితాః
సుకాలా ఇవ జాయ న్తే ప్రజాపుణ్యేన భూభుజః.''

**''స్వీయవర్షా హిత స్నేహులాయకరులు**
**నలఘు భ క్త జనాన్వితుల్ లలితతరులు**
**అల సుకాలము లట్లు నృపాలవరులు**
**ప్రజల పుణ్యాన పుడమిపై వరలు చుంద్రు.''**

''తమ రాజ్యంలో స్నేహం కురిపించే వారూ, చాలా భ క్తి విశ్వాసాలతో కూడిన ప్రజలు కలవారూ అయిన రాజులు, తమ వర్షాలచేత ఆర్ద్రత్వం సంపాదించేవీ, అత్యధికమైన అన్నం కల ప్రజలతో కూడినవీ అయిన మంచి కాలాలవలె, ప్రజాపుణ్యంచేత కలుగుతూ ఉంటారు.''

"సాధూనాముపకర్తుం లక్ష్మీం ద్రష్టుం విహాయసా గన్తుమ్
న కుతూహలి కస్య మన శ్చరితం చ మహాత్మానాం శ్రోతుమ్."

"సజ్జనావళి కుపకార శతము సేయ
లక్ష్మి జూడ నభోన్తరాళమున నెగుర
పుణ్యపూరుష చరితంబు పుడమి వినగ
నతి కుతూహల శూన్యులీ యవని గలరె."

"సత్పురుషులకు ఉపకారం చేయాలనీ, ఐశ్వర్యం చూడాలనీ, ఆకాశ మార్గంలో సంచరించాలనీ, మహాత్ముల చరిత్ర వినాలనీ, ఉవ్విళ్ళూరని వారు ఎవరున్నారు?"

ఇవి హర్షచరితంలోని తృతీయోచ్ఛ్వాస ప్రారంభంలోనే ఉన్న శ్లోకాలు. హర్షవంశవర్ణనం ఇక్కడి నుండే ప్రారంభం అవుతుంది. వీటిలో హర్షచరిత రచనా విధానాన్ని సూక్ష్మంగా సూచించడం జరిగింది. మొదటి రెండు ఉచ్ఛ్వాసాల్లోనూ బాణునికీ, అతని వంశానికీ సంబంధించిన కథ ఉంది. వాటిలోని ప్రధానాంశాలు మనం ఇదివరకే గమనించి ఉన్నాం. ఇంక మిగిలిన ఆరు ఉచ్ఛ్వాసాలూ పరిశీలించవలసి ఉంది.

కొంతకాలం రాజాస్థానంలో ఉన్న తరవాత, బాణుడు, ఒక శరదృతువులో, తన జన్మ భూమికి రావాలని నిశ్చయించుకొంటాడు. ఆకాశం నిర్మలంగా ఉంది. సూర్యుడు మంచి ప్రకాశంగా ఉన్నాడు. పద్మాలు అందంగా వికసిస్తున్నాయి. రాత్రులు చల్లగా ఉన్నాయి. సస్యాలు పంట ముఖానికి వస్తున్నాయి. ఈ ఋతు సౌందర్య విశేషాలన్నీ చూసి ఆనందిస్తూ అతడు ఇల్లు చేరుకొనేసరికి బంధువులందరూ ఎంతో ఆప్యాయంతో అతనికి స్వాగతం ఇచ్చారు. అతడు కొంత విశ్రాంతి తీసుకున్న తరువాత, సాయంకాలం అందరూ వాయు పురాణ ప్రవచనం వినడానికి ఒకచోట చేరుకున్నారు. సుదృష్టి అనే ఒకాయన ప్రవచనం చేస్తున్నాడు. ప్రవచనం మధ్యలో, ఒక గాయకుడు లేచి, ఆ మహాపురాణాన్ని హర్షవర్ధనుని ఉత్తమ గుణాలతో పోలుస్తూ రెండు ఆర్యాగీతాలు గానం చేస్తాడు.

"తదపి మునిగీత మతిపృథు తదపి జగద్వ్యాపి పావనం తదపి
హర్ష చరితా దభిన్నం ప్రతిభాతి హి మే పురాణమిదమ్."

**అదియును మునిజనగీతం**
**బదియును నతి పృథువు జగతి నదియును వ్యాప్తం**
**బదియును పావన మీగతి**
**చదవఁ బురాణంబు హర్షచరితము నొకచే.**

"మునిగీతమూ, అతివిశాలమూ, జగద్వ్యాప్తమూ, పావనమూ అయిన ఈ పురాణానికీ (ఇలాంటిదే అయిన) హర్షచరితానికీ మధ్య నాకేమీ భేదం కనబడడం లేదు."

"వంశానుగమ వివాది స్ఫుటకరణం భరతమార్గ భజనగురు
శ్రీకణ్ఠవినిర్యాతం గీత మిదం హర్ష రాజ్యమివ."

**"అరయ వంశానుగమ వివాదాంచితంబు**
**భరత కల్పిత సన్మార్గ భజన గురువు**
**స్ఫుష్టకరణము శ్రీకంఠ సంభవంబు**
**ప్రాజ్యగీతంబిదే హర్ష రాజ్యమట్లు"**

"హర్షరాజ్యంవలెనే, శ్రీకంఠ వినిర్యాతమైన (శ్రీకంఠ దేశంలో పుట్టినది—మధురమైన కంఠమునుండి బయల్వెడలినది) ఈ (పురాణ) గీతం కూడా వంశానుగమ వివాదిగానూ (గీతి పక్షంలో వేణునాదాన్ని అనుసరించేది, రాజ్యపక్షంలో వంశానుగం+అవివాది=వంశమర్యాదలను అనుసరించేది, వివాదరహితమైనది), స్ఫుటకరణముగానూ, (స్ఫుటమైన స్వరసంనివేశము కలది; స్పష్టమైన న్యాయనిర్ణయ స్థానాదికము కలది), భరత మార్గ భజన గురువుగానూ, (భరతుడు తన శాస్త్రంలో చూపిన మార్గాన్ని అనుసరించేది, భరత చక్రవర్తి యొక్క మార్గాన్ని అనుసరించేది) ఉన్నది.

ఇది వినగానే బాణుని సోదరుల మనస్సుల్లో హర్షవర్ధనుని అవదానాలు తెలుసుకోవాలనే కుతూహలం ఎక్కువైంది. "నలుడూ, నహుషుడూ, నృగుడూ మొదలైన పౌరాణిక చక్రవర్తుల్లో కూడా ఏమైనా లోపాలు ఉండవచ్చునేమో కాని ఈ హర్షునిలో మాత్రం అలాంటి లోపాలేవీ లేవంటారు. రోజురోజూ అతన్నిగూర్చి ఎన్నో క్రొత్త క్రొత్త అద్భుత విశేషాలు వినబడు

తూనే ఉన్నాయి. ఇక్కడనే ఈ బలజిత్తు (శత్రుసైన్యజేత—బలారియైన ఇంద్రుడు) క్షితిభృత్తులందరినీ (రాజులను, పర్వతాలను) కదలకుండా చేశాడు. ఇక్కడనే ఈ పురుషోత్తముడు సింధువును (సింధుదేశరాజును, సముద్రాన్ని) మథించి లక్ష్మిని స్వాధీనం చేసుకున్నాడు. ఇక్కడనే ఈ బలి (బలవంతుడు, బలిచక్రవర్తి) భూభృత్తును (రాజును, మందరాన్ని) మహా నాగం (ఏనుగ, సర్పము) పట్టునుంచి విడిపించాడు. ఇక్కడనే ఈ దేవుడు (రాజు–శివుడు) కుమారునికి (కుమారగుప్తుకి–కుమారస్వామికి) అభిషేకం చేశాడు. ఇక్కడనే ఈ స్వామి (రాజు–కుమారస్వామి) ఒక్కదెబ్బకు అరాతులను పడగొట్టి శక్తిని (తన బలాన్ని–శక్త్యాయుధాన్ని) ప్రసిద్ధికలదాన్నిగా చేశాడు. ఇక్కడనే ఈ నరసింహుడు (నరశ్రేష్ఠుడు – నరసింహస్వామి) స్వహస్తాలతో శత్రువుల్ని సంహరించి పరాక్రమాన్ని చూపించాడు. ఇక్కడనే ఈ పరమేశ్వరుడు (సార్వభౌముడు – శివుడు) దుర్గమమైన తుషారశైల భూమినుంచి పన్ను వసూలు చేశాడు. (హిమవత్పుత్రియైన దుర్గయొక్క హస్తం గ్రహించాడు). ఇక్కడనే ఈ లోకనాథుడు ఆయా దిక్కులలో లోకపాలకుల్ని నెలకొల్పినాడు. సకల భువనకోశం కూడా (లోకంలోని సమస్త ధనాన్ని—ఒక గ్రంథాన్ని) అగ్రజన్ములకు (బ్రాహ్మణులకు, శ్రమణులకు) విభజించి ఇచ్చాడు. ఈలాంటి ఎన్నో మహాకార్యాలు ప్రథమ కృతయుగంలో జరిగినట్లుగా ఈయన జరిపించినాడు. అందుచేత ఈయన చేసిన ఘనకార్యాలన్నీ సవివరంగా నీనుండి వినాలని అభిలషిస్తున్నాం. సూదంటురాయి చైతన్యంలేని ఇనుముని కూడా ఆకర్షించినట్లుగా మహాత్ముల ఉత్తమగుణాలు సామాన్యమానవుల హృదయాల్ని కూడా ఆకర్షిస్తాయి. అటువంటప్పుడు సరసుల హృదయాల్ని ఆకర్షిస్తాయని వేరే చెప్పాలా? హర్షుని చరిత్ర మహాభారతం తరవాత మహాభారతం లాంటిది. అలాంటి కథ వినాలని ఎవరికి ఆసక్తి ఉండదు? దయచేసి ఆ కథ అంతా చెప్పు. ఆ రాజర్షి చరిత్ర విని మన భృగువంశం ఇంకా పవిత్రం అయేటట్లు చెయ్యి.”

ఇది బాణుడు హర్షచరితానికి వ్రాసిన విస్పష్టమైన ప్రస్తావన వంటిది. ఇందులో అతడు తాను వ్రాయబోయే చరిత్ర ప్రణాళిక ఎలా ఉంటుందో స్పష్టంగా సూచించాడు. ఇది ఈనాడు మనం అనుకునే వాస్తవిక దృక్పథంలో వేసిన ప్రణాళిక కాదు; భారతదేశంలో సంప్రదాయ సిద్ధంగా

వస్తూన్న ఐతిహాసిక పద్ధతిలో వేసుకున్న ప్రణాళిక. బాణుణ్ణి ఆధునిక దృష్టితో ఇతిహాస రచయిత అని అనడానికి వీలులేదు. ఆతడు ప్రశంసా రూపేతిహాస రచయిత. ఆతని భావన పౌరాణిక దృష్టి ప్రభావితమైన భావన. ఆతని దృష్టిలోనూ, ఆతని శ్రోతల దృష్టిలోనూ కూడా హర్షవర్ధనుడు దివ్యాంశసంభూతుడైన ఒక పౌరాణిక నాయకుడువంటివాడే కాకుండా, పురాణేతిహాసాల్లో కనబడే నాయకుల కంటె కూడా గొప్పవాడు. పురాణాల్లోని ఆయా దేవతలు చేసిన ఒక్కొక్క ఘనకార్యానికీ సరియైన ఘనకార్యం ఒకటి ఈ హర్షవర్ధనుని జీవితంలో చూపించగలరు వాళ్లు. అందుచేత పౌరాణిక దేవతల్లోనూ, చక్రవర్తుల్లోనూ ఉన్న గొప్పతనం అంతా కలిసి ఈ హర్షవర్ధనునిలో ఉంది. రాజును ఈ విధంగా, అత్యున్నతాదర్శమూర్తిగా చిత్రించడం రాజాస్థాన కవులందరిలోనూ, పురాణకాలంనుంచీ వస్తూన్న ఒక అలవాటు; ఒక సంప్రదాయం. బాణుడు అనాదికాలంనుంచీ వస్తూన్న ఈ సంప్రదాయానికి ఒక ప్రతినిధి అని చెప్పవచ్చు. V. S. సుక్తంకర్ మొదలైన కొందరు ఆధునిక విమర్శకులు ఈ సంప్రదాయానికి 'భార్గవ సంప్రదాయం' అని పేరు పెట్టారు. ఈ సంప్రదాయం మన పురాణేతిహాసాలన్నింటికీ మూలస్రోతస్సు అని చెప్పవచ్చు. అందుచేత బాణుడు హర్షచరితాన్ని మొదట వాయు పురాణంతో పోల్చి, చివరికి ఇది రెండవ మహాభారతం అని చెప్పాడంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు. (ఈ సంప్రదాయాలకి సంబంధించిన విస్తృత వర్ణనకోసం చూ. Ancient Historians of India, V. S. Pathak, Asia Publishing House, Bombay, PP. 30-55).

హర్షవర్ధనుణ్ణి గూర్చి తన బంధువులు చెప్పిన అతిశయోక్తులికి బాణుడు మరికొన్ని అతిశయోక్తులు కూడా చేర్చాడు :—

"హర్షవర్ధనుడు సర్వజ్ఞునికికూడా అందరానివాడు. బృహస్పతి బుద్ధికికూడా గోచరించనివాడు. సరస్వతికికూడా అతి భారమైనవాడు. ఇంక నావంటి సామాన్యుని విషయం చెప్పాలా? నూరు జన్మమెత్తినా ఎవరూ ఆయన గుణగణాల్ని పూర్తిగా వర్ణించ జాలరు. ఐతే, ఆ గుణగణాల్లో ఏ కొన్నింటినో విన్నా చాలు అని మీరు అనుకొంటే సరే; నా అభ్యంతరం ఏమీ లేదు.

ఈనాడు, ఇప్పటికే, సాయంకాలం అయిపోయింది. నేను రేపటి నుండి కథ చెప్పడం ప్రారంభిస్తాను.''

మర్నాడు శ్రోతలందరూ కథాశ్రవణ కుతూహలంతో ఒకచోట చేరారు. హర్షుని కథ, ప్రారంభంనుంచీ—అంటే హర్షునితో కాకుండా అతని మూలపురుషుడైన పుష్పభూతినుంచీ, చెప్పడానికి బాణుడు ప్రారంభించాడు. మధ్యయుగానికి సంబంధించిన ఒక అద్భుతగాథ నడిచే ధోరణిలో ప్రారంభం అయింది కథ. పుష్పభూతి తంత్రీ ఎన్నో అనూహ్యాలైన అద్భుత కార్యాలు చేయడం ద్వారా దేవతల నుంచి వరాలు సంపాదించుకున్నాడని వర్ణిస్తూ, బాణుడు భావావేశంతో నిండిన నాటకీయపద్ధతిలో కథాకథనం సాగించాడు. నమ్మడానికి శక్యంకాని ఎన్నో అస్వాభావిక విషయాలతో నిండిఉన్నా, ఈ కథ వింటూన్నంతసేపూ శ్రోతల్ని 'ఇంకా ఏమౌతుందో; ఇంకా ఏమౌతుందో' అని ఊపిరి బిగపెట్టుకొని కూర్చునేటట్టు చేస్తాడు. ఈనాటివాళ్లు చాలామంది – ఇవన్నీ మూఢవిశ్వాసాలని తోసివేసినా, ఆనాటి వారికి దయ్యాల్ని భూతాల్ని పూజించడమూ, భయంకరమైన తాంత్రిక క్రియలు చేయడమూ, ఇవన్నీ పూర్తిగా విశ్వసనీయాలే.

ప్రారంభంలో, బాణుడు, తనకున్న పౌరాణిక భావనకు అందుబాట్లో ఉన్న సర్వసౌందర్యాలతోటీ వర్ణిస్తూ, శ్రీకంఠం అనే జనపదాన్ని భూతల స్వర్గంగా చిత్రించాడు. అక్కడ ఉన్న పశుపక్ష్యాదుల్నీ, పుష్పఫలాదుల్నీ, సస్యవృక్షాదుల్నీ, స్త్రీ పురుషుల్నీకూడా అతిశయోక్తి భరితమైన భాషలో వర్ణించాడు. ఉదాహరణకు ఒక వర్ణన చూడండి :—

"త్రేతాగ్ని ధూమంవల్ల కలిగిన కన్నీటి ధారలు కడిగి వేశాయా అన్నట్టు, ఈ దేశంలో, అపసిద్ధాంతాలన్నీ రూపుమాసి పోయాయి ... యూప స్తంభాలకోసం కర్రలు ఛేదిస్తూన్న గండ్ర గొడ్డళ్ళ నాట్లు తగలడం చేతనా అన్నట్లు అధర్మం చీలిపోయింది. యజ్ఞాగ్నుల ధూమాలచేత ఏర్పడిన మేఘాల ధారలు కడిగి వేశాయా అన్నట్లు వర్ణసంకరం (రంగుల కలయిక అని మరొక అర్థం) నశించింది. దక్షిణగా ఇచ్చిన వేలకొలది ఆవుల కొమ్ముల

పోట్లకు తాళలేకపోయాడా అన్నట్లు కలి పారిపోయాడు. దేవాలయాలకోసం శిల్పులు చెక్కే ఉలుల దెబ్బ తగలడంచేతనా అన్నట్లు ఆపదలు వ్రయ్యలై పోయాయి. వేలకొలది సత్రాలలోని వంటశాలల్లో ప్రజ్వలిస్తూన్న అగ్నియొక్క వేడి తగిలిందా అన్నట్లు వ్యాధులన్నీ కరగిపోయాయి ...''

రోగాలుకాని, అంటువ్యాధులు కాని లేకుండా, ప్రజలందరూ, పవిత్రమైన ధార్మిక జీవనాన్ని గడపుతున్నారని చెప్పడం కవి ఉద్దేశ్యం. ఐతే, ఆతడు ఉపయోగించే ఉత్ప్రేక్షలు చాలా ఎక్కువైపోవడంతో కొంచెం విసుగు కలిగిస్తున్నాయి.

స్థానేశ్వరం ఈదేశానికి రాజధాని. ఇది ధనధాన్య సమృద్ధమైన ప్రదేశం. ఇందులో ప్రజలందరూ సుఖమయమైన జీవితం గడుపుతూ ఉంటారు. స్త్రీలు అతిలోక సౌందర్యవతులు. దీన్ని పాలించేరాజు పుష్పభూతి; గొప్ప శివభక్తుడు. భైరవాచార్యుడనే మహాత్ముడైన ఒక శైవగురువు దక్షిణాపథంనుంచి తన పట్టణానికి వచ్చినట్లు తెలిసి ఆయన్ని కలుసుకోవడానికి ఉబలాట పడుతాడు పుష్పభూతి. ఒకనాడు ఆ శైవ గురువు రాజదర్శనానికై వస్తాడు. ఆతడు ఒక సంన్యాసి. పాశుపతులు ధరించే వేషంలో ఉన్నాడు. రాజు సగౌరవంగా స్వాగతం చెప్పాడు. ఆ సంన్యాసి, తాను పట్టణం వెలపల సరస్వతీ నదీతీరాన నివసిస్తున్నట్లుగా చెప్పి, రాజును ఆశీర్వదించి, రత్న ఖచితాలైన ఐదు రజత పద్మాలు ఆతనికి బహూకరిస్తాడు. రాజు చాలా సంతోషించి, 'రేపు మీ నివాసానికి వచ్చి కలుసుకుంటాను' అని ఆ సంన్యాసితో చెపుతాడు.

చెప్పిన ప్రకారం, మర్నాడు, రాజు ఆ సంన్యాసిని కలుసుకోవడానికై వెళ్ళినప్పుడు ఆయన ప్రేమపూర్వకంగా స్వాగతం చెప్పి, కూర్చోమని వ్యాఘ్రాజినం చూపించాడు. రాజు దానిమీద కూర్చోకుండా, తాను ఆయనకు శిష్యుడు కావాలనే కోరిక వెలిబుచ్చాడు. ఆ సంన్యాసికూడా అందుకు సంతోషించాడు. ఈ విధంగా వారిరువురూ అనేక పర్యాయాలు కలుసుకోవడం జరిగింది. సంన్యాసి రాజును కలుసుకోవడానికి వచ్చినప్పుడల్లా ఐదు

రజత పద్మాలు బహూకరిస్తూండేవాడు. ఒకనాడు రజత పద్మాలతోపాటు ఒక మాయా ఖడ్గంకూడా తెచ్చి ఇచ్చి రాజుతో ఇలా అన్నాడు.

"ఈ ఖడ్గంపేరు అట్టహాసం. దీన్ని పాతాళస్వామి అనే నా శిష్యుడొకడు ఒక భేతాళుడి దగ్గర్నించి సంపాదించాడు. ఇది నీ చేతిలో ఉండవలసిన ఖడ్గం."

ఈ కొత్త బహుమానానికి రాజు చాలా సంతోషించాడు ఒకనాడు ఆ సంన్యాసి రాజుతో రహస్యంగా ఇలా అన్నాడు!—

"ఒక రహస్యమైన తాంత్రిక పూజకు సంబంధించిన కఠోర నియమాలన్నీ నేను శ్మశానంలో పూర్తిచేశాను. ఇంక భేతాళుణ్ణి చంపడం అనే ఒక్క పనిమాత్రం మిగిలి ఉంది. ఈ పని నువ్వు తప్ప మరెవ్వరూ చేయలేరు. నువ్వొకనక అంగీకరిస్తే నా ముగ్గురు శిష్యుల్నికూడా నీకు సహాయంగా ఇస్తాను. నేను చెప్పేరోజు చీకటి రాత్రిలో, నువ్వు ఖడ్గం ధరించి ఒంటరిగా రావలసి ఉంటుంది."

గురువుగారికి సహాయంచేయడాలకి అవకాశం లభించినందునికు రాజు చాలా సంతోషించాడు. ఆయన నిర్ణయించి చెప్పిన రోజు, అర్ధరాత్రివేళ, వంటరిగా శ్మశానం చేరుకున్నాడు. భేతాళుడి రాకకోసం కొంతసేపు నిరీక్షించాడు. ఇంతలో భేతాళుడు వచ్చాడు. వచ్చిరావడంతో, ఆ భేతాళుడు, రాజుకు సహాయం చేయడంకోసం వచ్చిన ముగ్గురు సంన్యాసిశిష్యుల్ని నేల మీద పడగొట్టాడు. సంన్యాసి పూజలో కూర్చున్నాడు. రాజు కేవలం తన బాహుబలంతో ఆ భేతాళుణ్ణి ఓడించి, అతని వంటిమీద యజ్ఞోపవీతం కనబడడంచేత చంపకుండా వదిలిపెట్టాడు.

ఇంతలో హటాత్తుగా ఒక దేదీప్యమానమైన ఆకారం అతని ఖడ్గంలో నుంచి బైటికి వస్తూన్నట్లుగా కనబడింది. ఆ వ్యక్తి ఎవరో కాదు; అతని ధైర్యానికి మెచ్చి వరాలు ఇవ్వడానికి వచ్చిన విజయలక్ష్మి. ఏదైనా, ఒక వరం కోరుకొమ్మని ఆమె రాజును నిర్బంధించింది. సంన్యాసి మనస్సులో ఉన్న, విద్యాధరుడు కావాలనే కోరిక సిద్ధించేటట్లు చేయవలసిందని ఆమెను ప్రార్థిం

చాడు రాజు. ఆమె వెంటనే ఆ వరం ప్రసాదించి, ఆతని నిఃస్వార్థబుద్ధికి ఎంతగానో సంతోషించి, తనంతతానే ఒక వరం ఇస్తూ ఇలా అంది :—

"ఓ పుష్పభూతీ! నీ ఔదార్యమూ, నీ శివభక్తీ ఎంతో కొనియాడదగినది. అందుచేత సూర్యచంద్రులవలె నువ్వుకూడా, గొప్పతనంలోనూ, పవిత్రత్వంలోనూ, ధైర్యసాహసాల్లోనూ, ఐశ్వర్యంలోనూ సాటిలేని ఒక రాజవంశానికి మూలపురుషుడవు కానున్నావు. నీ వంశంలో హర్షుడనే చక్రవర్తి జన్మిస్తాడు. అతడు మాంధాతవలె ప్రపంచాన్నంతనీ జయించి, హరిశ్చంద్రుడువలె ఈ భూమండలాన్నంతనీ పరిపాలిస్తాడు. నేను స్వయంగా ఆతనికి వింజామర వేయనున్నాను."

భైరవాచార్యుడు రాజుదగ్గర శెలవుతీసుకుని, దివ్యరూపంతో వెళ్ళిపోయాడు. రాజు ప్రాసాదానికి తిరిగి వచ్చాడు. (తృతీయోచ్ఛ్వాసం)

అత్యద్భుతమైన ఈ అవదానం వింటూనే, మనకు, ఇంగ్లీషు వాఙ్మయంలో ఉన్న అద్భుతగాథల్లోని ఆర్థరూ - ఆతని అనుచరులైన వీరులూ చేసిన గొప్పగొప్ప పనులన్నీ గుర్తుకువస్తాయి. తన కథానాయకుణ్ణి మహోన్నత వ్యక్తిగా చిత్రించాలనే ఉద్దేశంతోటే బాణుడు ఈ విధంగా పుష్పభూతికి అలౌకికమైన శక్తి ఉన్నట్లూ, లక్ష్మి ఆతనికి వరం ఇచ్చినట్లూ, కల్పించాడు. కాని శిలాలేఖలద్వారా మనకు లభించే ఐతిహాసిక విషయాల్ని పట్టి చూస్తే, హర్షవర్ధనుని వంశంలోని ప్రాచీన పురుషుల్లో పుష్పభూతి అనేవాడు ఒకడు ఉన్నా, ఆతడు ఏదో ఒక చిన్న రాజ్యానికి మాత్రమే అధిపతిగా ఉన్నట్లు తెలుస్తున్నది. ఐతే ఆకాశమార్గాల్లో విహరించే బాణుని భావనాచక్షుస్సుకి ఈ విషయం గోచరించడానికి అవకాశం లేదు.

బాణుడు హర్షుని వంశంలోని ఇతర రాజులందరినీ ఉపేక్షించి అతని తండ్రి ప్రభాకరవర్ధనుణ్ణిగూర్చి విస్తృతంగా వర్ణించాడు.

'ప్రతాపశీల' బిరుదాంకితుడైన ఈ ప్రభాకర వర్ధనుడు హూణులనే లేళ్ళకి సింహం. సింధురాజును పీడించే దాహజ్వరం,

గుర్జర రాజుకి ప్రజాగరం. గాంధార రాజ మహాగజానికి 'కూట పాకలము' అనే గజజ్వరం. లాటుల పాటవానికి చోరుడు. మాలవ లక్ష్మీ లతకు గ్రంద్ర గొడ్డలి."

ఈ విధమైన విశేషణాలు ఉపయోగించడం ద్వారా బాణుడు ప్రభాకర వర్ధనుడు సాధించిన కొన్ని విజయాలు సూచించాడు. అతని ధార్మిక పరిపాలన చూసినవారికి కృతయుగం జ్ఞప్తికి వచ్చేదట. అతడు గొప్ప సూర్య భక్తుడు. అతని రాణి యశోవతి, సద్గుణాల రాశి. ఒకనాటి రాత్రి ఆమె నిద్రలోంచి ఉలిక్కిపడి లేచింది. రాజు ఆమెను సముదాయిస్తూ ప్రశ్నించగా ఆమె ఇలా చెప్పింది:—

"మహారాజా! నాకో స్వప్నంలో, సూర్యమండలంనుంచి దిగివస్తూన్న ఇద్దరు యువకులు కనిపించారు. వారి శరీర కాంతితో ఆకాశం అంతా మెరుపులతో నిండిపోయినట్లుగా మిరుమిట్లు గొలిపింది. వాళ్లు, కిరీటాలు, కుండలాలు, కేయూరాలు మొదలైన అలంకారాలు ధరించి ఉన్నారు. చేతుల్లో ఖడ్గాలు ఉన్నాయి. ప్రపంచంలోని ప్రజలందరూ, ముఖాలు పైకెత్తి, చేతులు జోడించి వాళ్ళకి జోహార్లు చేస్తున్నారు. సాక్షాత్తు చంద్రుని అవతారమా అన్నట్లు ఉన్న ఒక స్త్రీ వాళ్ళ వెంట వస్తూంది. వాళ్లు భూమిమీద దిగి, నాగర్భాన్ని భేదించి, దాన్లో ప్రవేశించడానికి ప్రయత్నించారు. నా గుండె ఝల్లుమంది. ఒక్క పోలికేక పెట్టి లేచాను."

ఇంతలో తెలవారింది. నలుమూలలా శుభశకునాలు కనిపించాయి. ఈ స్వప్నం సూచిస్తూన్నదాన్నిపట్టి, తమకు ఇద్దరు కుమారులూ, ఒక కుమార్తె కలుగనున్నారని రాజు రాణితో చెప్పాడు. కొంతకాలానికి, వారికి, రాజ్యవర్ధనుడనే కుమారుడు జన్మించాడు. రాజప్రసాదం అంతా ఆనంద డోలికల్లో ఓలలాడింది. రాణి మళ్ళీ గర్భవతి అయింది. అప్పుడు కొన్ని అద్భుతమైన శకునాలు కనిపించాయి. దేవకీ గర్భంలో శ్రీకృష్ణుడు ప్రవేశించినట్లు ఆమె గర్భంలో హర్షుడు ప్రవేశించాడు. గర్భవతిగా ఉన్నపుడు, ఆమెకు నాలుగు

సముద్రాల్లోనూ స్నానం చేయాలని కోరిక కలిగింది. ఒక శుభలగ్నంలో హర్షుడు జన్మించాడు. గొప్ప జ్యోతిష్కు డొకడు వచ్చి, పిల్లవాని భవిష్యత్తు గూర్చి ఈ విధంగా చెప్పాడు:

"చెడ్డ గ్రహయోగాలు కాని, చెడ్డ గ్రహదృష్టులుకాని లేని ఇలాంటి రోజునే, గ్రహాలన్నీ తమతమ ఉచ్చస్థానాల్లో ఉన్న సమయంలో, పూర్వం మాంధాత జన్మించాడు. ఎన్నో సహస్రాబ్దాలు గడిచినా, నాటినుండి నేటివరకూ, సార్వభౌము డవడానికి తగిన ఇలాంటి లగ్నంలో ఒక్క వ్యక్తికూడా జన్మించలేదు. నీ కుమారుడు పురాణప్రసిద్ధులైన చక్రవర్తులతో సమాను డవుతాడు. చక్రవర్తి చిహ్నాలైన మహారత్నాలు ధరిస్తాడు. సప్త సముద్రాలకు అధిపతి అయి సప్త మహాయజ్ఞాలు చేస్తాడు."

తన కావ్యానికి హర్షవర్ధనుడు నాయకుడు అవడంచేత బాణుడు, బుద్ధిపూర్వకంగా ఒక జ్యోతిష్కుని భవిష్యద్వాణి ప్రవేశపెట్టి ప్రథమ రాజకుమారుని జన్మకు ఏమాత్రమూ ప్రాధాన్యం ఇవ్వకుండా హర్షుని జన్మకు ప్రాధాన్యం చూపించాడు. ఇదంతా కవియొక్క భావనాబలమే కాని వాస్తవం కాదని మనం తెలుసుకోవచ్చు.

రాజ్యంలో అంతా గీత నాట్యాదులతో ఆనందోత్సవాలు జరుపుకొన్నారు. రాజు మహౌదార్యంతో పారితోషికాలు పంచిపెట్టాడు. హర్షుడు రాజ్యవర్ధనునికంటె ఐదు సంవత్సరాలు చిన్న. ఆతనికి ఏడు సంవత్సరాల వయస్సు వచ్చినప్పుడు రాణికి ఒక కుమార్తె జన్మించింది. ఆమెకు రాజ్యశ్రీ అని పేరుపెట్టారు. ఈ రోజుల్లోనే రాణిసోదరుడు, భండి అనే తన కుమారుణ్ణికూడా సోదరి దగ్గరకు పంపాడు. ఈ పిల్లలందరూ రాజదంపతుల సంరక్షణలో గారాబంగా పెరిగారు.

ఒకరోజున రాజు కుమారుల్ని పిలిచి ఇలా చెప్పాడు:—

"నాయనలారా! మంచిసేవకులు లభించడం చాలా కష్టం. సామ్రాజ్యం ఏలాలంటే ఉత్తమసేవకులు ఎంతైనా అవసరం. అందుచేత, నా మిత్రుడైన మాలవదేశరాజుయొక్క కుమారులైన

కుమారగుప్త మాధవగుప్తులను సోదరులనే మీకు సేవకులనుగా నియమిస్తున్నాను. వీళ్లు పరీక్షకి నిలిచిన అత్యుత్తమ శీలస్వభావాలు కలవారు. మీరుకూడా వీళ్ళని తగువిధంగా చూచుకోవాలి.''

ఆ గుప్త రాజకుమారులిద్దరూ అతి మనోహరమైన ఆకార రూపాలుకల వ్యక్తులు. వాళ్లిద్దరూ రాజ్యవర్ధన – హర్షవర్ధనులికి సహచరులుగాను, అంగరక్షకులుగాను ఉండి సేవిస్తూ ఉండేవారు.

రాజ్యశ్రీకి వివాహం చేయతగిన వయస్సు వచ్చింది. తగిన సంబంధం గూర్చి రాజు రాణితో ఆలోచించి, మౌఖరీవంశీయుడూ, కనోజుకు రాజూ అయిన అవంతివర్మయొక్క జ్యేష్ఠ పుత్రుడైన గ్రహవర్మ తగిన వరుడని నిర్ణయించాడు. అందరూ ఈ సంబంధాన్ని ఆమోదించడంతో మహావైభవంగా వివాహం జరిగింది. నూత్న వధూవరులు కనోజు చేరుకున్నారు.

ఈ ఉచ్ఛ్వాసంలోని మిగిలిన భాగం అంతా వివాహానికి సంబంధించిన అనేకవర్ణనలతో సాగింది. వివాహసందర్భంలో చేసే ఎన్నో ఏర్పాట్లూ, ఆ సమయంలో ఇటూ అటూ తొందరగా తిరుగుతుండే ముత్తైదువుల సంభ్రమాలూ, ఇవన్నీ యథాతథంగా వర్ణించాడు బాణుడు. ఈ వివాహవర్ణనలు పట్టి చూస్తే ఆనాటి ఆచార వ్యవహారాలు ఎన్నో ఈనాటికికూడా మనకు వారసత్వంగా వస్తూన్నట్లు తెలుసుకోవచ్చు. బాణుడు వర్ణించిన భారతీయ సాంఘిక జీవితమూ, మతసంబంధమైన ఆచారవ్యవహారాలూ, ఆనాడు ఎలా ఉండేవో ఈనాడుకూడా అలాగే ఉన్నాయి. ఇవన్నీ శీఘ్రంగా మార్పు చెందని కొన్ని మౌలిక సూత్రాలమీదా, భావాలమీదా ఆధారపడి ఉండడమే ఇందుకు కారణం. (చతుర్థోచ్ఛ్వాసం).

కథా దృష్టితో చూస్తే కుమారోదయమూ, ఋతువులూ, గర్భిణీ స్త్రీల కోరికలూ, వివాహమహోత్సవాలూ మొదలైనవాటి వర్ణనలు కథా గమనానికి ఏమాత్రమూ ఉపయోగించకపోయినా, సాహిత్యదృష్టిలో వీటికి చాలా ప్రాధాన్యం ఉంది. మహాకావ్యంలో అష్టాదశవర్ణనలు ఒక నిర్ణీతరూపంలో ఉండాలనే విషయం అందరికీ తెలిసినదే. బాణుడు అతి నైపుణ్యంతో ఈ ఉచ్ఛ్వాసంలో ప్రవేశపెట్టిన ఈ వర్ణనలతో మహాకావ్యంగా దీని విలువ

చాలా పెరిగింది. వీటిని ఏ సంబంధమూ లేకుండా తీసుకువచ్చి అతికినట్లు కాకుండా, కథలో ఒక భాగంగా బాగా ఇమిడేటట్లు చేశాడు. ఈ ఉచ్ఛ్వాసంలో, ఆయా లోపాలచేత కష్టాలకి గురియైన పదిహేనుగురు పౌరాణిక చక్రవర్తుల ప్రసంగం తీసుకురావడం గమనించతగిన విషయం. ఈ చక్రవర్తుల పేర్లు ఉదాహరించిన క్రమమూ - చంద్రుడు, పురూరవుడు, నహుషుడు, యయాతి, సుద్యుమ్నుడు, సోమకుడు, పురుకుత్సుడు, కువలయాశ్వుడు, నృగుడు, నలుడు, సంవరణుడు, దశరథుడు, కార్తవీర్యుడు, శంతనుడు, యుధిష్ఠిరుడు - వారిలో ఉన్న లోపాలూకూడా సరిగా వాసవదత్త అనే అద్భుతగాథలో సుబంధువు ఏవిధంగా పేర్కొన్నాడో, బాణుడుకూడా అదేవిధంగా పేర్కొన్నాడు. వాక్యాల్లోకూడా పూర్తిగా సామ్యం ఉంది. దీన్నిబట్టి బాణ సుబంధువుల్లో ఒకరు గ్రంథచౌర్యం చేశారని చెప్పవలసి ఉంటుంది. ఎవరు చేసిందీ పండితులు నిర్ణయించలేకుండా ఉన్నారు. ఈ కావ్యానికి ప్రారంభంలో, బాణుడు, గ్రంథచౌర్యం చేసేవాళ్ళని నిందించిన తీరు చూస్తే[1] అతడు ఈ పని చేసిఉండడని అనిపిస్తుంది.

ఇంక కథలోకి వద్దాం. ఒకనాడు ప్రభాకరవర్ధనుడు రాజ్యవర్ధనుణ్ణి పిలిచి, హూణుల్ని అణచడానికి ఉత్తరదేశంవైపు దండెత్తి వెళ్ళవలసిందిగా ఆదేశం ఇచ్చాడు. రాజ్యవర్ధనుడు గొప్ప సైన్యంతో బయలుదేరాడు. చాలా దూరంవరకూ హర్షవర్ధనుడుకూడా అన్నగారితో కలిసి వెళ్లాడు. హిమాలయ ప్రాంతాల్లో హింస్రజంతువుల్ని వేటాడుతూ కొన్నాళ్లు వినోదంగా గడిపాడు. ఒకనాడు రాత్రి అతని కొక పీడకలవచ్చింది. ఒక సింహం దావాగ్నిలో పడి

---

1. అన్యవర్ణపరావృత్త్యా బన్ధచిహ్న నిగూహనైః
అనాఖ్యాతః సతాం మధ్యే కవిశ్చోరో విభావ్యతే. హ. చ. I VI
"అన్యవర్ణ పరావృత్తి నఖిల బంధ
చిహ్న గూహనముల నొరుల్ చెప్పకున్న
సత్కవీన్ద్రాంచితంబులౌ సభలలోన
బైట పడుగాదె కవిచోరుడెటులనైన."

చూ. Bana: by R. D. Karmarkar, Karnataka University, Dharwad, 1964 PP. 36 - 38.

మండిపోతూన్నట్లూ, ఆశసింహం కూడా పిల్లల్ని విడిచిపెట్టి వెళ్ళి ఆ అగ్ని లోకి దూకినట్లూ కనిపించింది. ఈ కల ఏదో అశుభాన్ని సూచిస్తున్నట్లుగా తోచింది హర్షుడికి.

ఇంతలో రాజధానినుంచి ఒక వార్తాహరుడు సేనానివేశానికి వచ్చాడు. ఆతడు చెప్పిన అస్పష్ట వాక్యాలతోటీ, తెచ్చిన లేఖతోటీ, హర్షుని భయ సందేహాలు ఎక్కువయాయి. చక్రవర్తి హఠాత్తుగా జబ్బుపడ్డట్టు తెలిసింది. అంతే; ఇంక ఏమాత్రమూ ఆలస్యం చేయకుండా హర్షవర్ధనుడు గృహోన్ముఖు డయ్యాడు. మార్గంలో ఎన్నో అపశకునాలు కనిపించాయి. నిద్రాహారాలు లేకుండా మహారణ్యంగుండా సుదీర్ఘప్రయాణంచేసి మరునాడు రాజధాని చేరుకున్నాడు.

రాజధాని అంతాదుఃఖసముద్రంలో మునిగిఉంది. ఎక్కడా ఆనందో త్సాహాల జాడలేదు హర్షుడు అతిశీఘ్రంగా రాజప్రాసాదం చేరుకున్నాడు. ఆదంతా పాడుపడినట్టుగా ఉంది. లోపలికి ఎవ్వరినీ వెళ్ళనీయడం లేదు. ద్వారం దగ్గర సుషేణుడనే వైద్యుడు కనబడ్డాడు. ఆతని ముఖం కళా హీనంగా ఉంది. రాజుగారి పరిస్థితి అటా ఇటా అన్నట్లుంది. ఆయన ఆరోగ్యం కోసం ప్రతిచోటా ప్రజలందరూ ప్రార్థనలు చేస్తూన్నారు. మరణోన్ముఖుడైన ఆయనకోసం ఔషధాలు తయారుచేయడంలో పరిచారకులందరూ వ్యగ్రులై ఉన్నారు. వాళ్ళందరినీ దాటుకొంటూ హర్షుడు రాజు ఉన్న గదిలో ప్రవేశిం చాడు. ఇంతమంది ఇన్ని సేవలు చేస్తూన్నా ఆయన స్పృహతప్పి పడి ఉన్నాడు. ఆయన మరణం ఆసన్నమైనదనే విషయం స్పష్టంగా కనబడు తూన్నది.

''ఆతనిలో పూర్తిగా మృత్యు చిహ్నాలు కనబడుతున్నాయి. రోగం తన బలం అంతా ఆతనిమీద చూపిస్తూన్నది. క్షామత్వం తన అస్త్రాలన్నింటినీ ఆతనిమీద ప్రయోగించింది. అసహాయ స్థితి ఆతన్ని ఆవహించింది. ఆతనిని బాధ ఆశ్రయంగా స్వీకరిం చింది. క్షయ నివాసంగా చేసుకుంది. గ్లాని వశుణ్ణిగా చేసుకుంది. దుఃఖం కాటు వేసింది. అస్వాస్థ్యం తనవాణ్ణిగా చేసుకుంది. వ్యాధి బంటుగా చేసుకుంది; కాలుడు కబళిస్తున్నాడు . . . . . .

మాట పడిపోయింది. మనస్సు నిలకడ తప్పింది. శరీరం వ్యాకులంగా ఉంది. ప్రాణాలు అడుగంటుతున్నాయి, కీళ్ళన్నీ నొప్పులతో పట్టు తప్పాయి.''

రానున్న ముప్పు ఊహించుకొంటూ, దుఃఖంతో దిగ్భ్రాంతిచెంది రాణి అసహాయస్థితిలో ప్రక్కనే కూర్చుని ఉంది. ఇదంతా చూడగానే హర్షుడికి దాదాపు మూర్ఛ వచ్చినంత పని అయింది.

ఇంత కరుణ ప్లావితమైన మృత్యువర్ణనం సంస్కృత వాఙ్మయంలో మరెక్కడా లేదని చెప్పాలి. కొన్ని సంప్రదాయాలకి కట్టుబడి ఉండడంచేత కవులూ, నాటకరచయితలూకూడా మృత్యువునుగూర్చి అప్రత్యక్షంగా సూచించడమే కాని, ఈ విధంగా, ప్రత్యక్షంగా ఎక్కడా వర్ణించలేదు. ప్రభాకర వర్ధనుని మరణాన్ని ప్రత్యక్షంగా, అతి విస్తృతంగా వర్ణించడం ద్వారా మాత్రమే కాకుండా, తన భర్తకంటె ముందుదానే ధైర్య స్థైర్యాలతో ప్రాణత్యాగం చేసి, రాణి 'సతి' అయినట్లుగా వర్ణించడం ద్వారాకూడా బాణుడు, కరుణరసాన్నికూడా ఎంత అద్భుతంగా చిత్రించవచ్చునో మనకు ఈ ఉచ్ఛ్వాసంలో చూపించాడు. హృదయాన్ని ద్రవింపచేసే ఇలాంటి కరుణరసమయ ఘట్టాల్ని చిత్రించడంలో ఇతడు ఒక కొత్త మార్గం అవలంబించాడు. ఈ ఘట్టంలో ఇతని శైలికూడా అంతవరకూ ఉన్న ఆడంబరాన్ని విడిచిపెట్టి, జలజలా ప్రవహించే సెలయేరులాగ, మృదుమధుర ధ్వనులలో అతిసహజంగా సాగింది. ఇటువంటి ఘట్టాల్లోనే, బాణుడు తన నిరుపమాన కవితా ప్రతిభను చూపించి ఆధునిక పాఠకలోకాన్నికూడా ఆకర్షించ గలుగుతున్నాడు.

మూడు రోజులనుంచి హర్షుడికి నిద్రాహారాలు లేవు. అప్పటికే మృత్యుముఖంలో ఉన్న రాజు కుమారుణ్ణి చూడగానే పరమానందభరితుడైనాడు. ప్రేమావేశంతో ఇలా అన్నాడు:—

''తీవ్రమైన జ్వరతాపం నన్ను చాలా దహిస్తూంది. ఐతే, నీ దుఃఖం నన్ను ఇంకా దహిస్తూంది. నీవు ఈవిధంగా కృశించిపోవడం తీక్ష్ణమైన కత్తివలె నన్ను ఖండించివేస్తూంది. నాసుఖమూ,

రాజ్యమూ, వంశమూ, ప్రాణాలూ కూడా నామీదనే ఆధారపడి ఉన్నాయి. నీ దుఃఖం ఈ భూమండలంమీద ఉన్న ప్రజలందరికీ దుఃఖమే ...... నీ శరీరంమీద చతుఃసముద్ర పర్యన్తరాజ్యాన్ని పాలించే లక్షణా లున్నాయి. నీవు పుట్టడంతో నాజన్మ చరితార్థం అయింది. ఇపుడు, ఇంకా జీవించాలనే కోరిక నాకు లేదు....... రాజులకు నిజమైన బంధువులు ప్రజలే కాని జ్ఞాతులు కాదు. అందుచేత లేచి, మామూలుగా స్నానాది క్రియలన్నీ చేసుకో.''

ఈ భాగం చాలా ప్రధానమైనది. హర్షుని ఔన్నత్యాన్ని చిత్రించడం కోసం బాణుడు ఏ విధంగా ఇతరవిషయాలన్నింటినీ ఉపకరణాలుగా ఉపయోగించుకుంటాడో దీనివల్ల మనకు తెలుస్తూన్నది. ఆఖరికి హర్షుని తండ్రిని కూడా ఇందుకోసమే సాధనంగా ఉపయోగించుకున్నాడు. ఆతని మరణం తీరని లోటే కావచ్చు. ఐనా, ఇది ఎవ్వరూ తప్పించలేనిది. అందుచేత దీన్ని ఒక దుఃఖహేతువైన సంఘటనగా తీసుకోవలసిన పనిలేదు. హర్షుణ్ణి రంగం మీదకు తీసుకురావడానికి ఇదొక మెట్టు. రాజ్యవర్ధనుడు జ్యేష్ఠ కుమారుడవడంచేత రాజ్యానికి రావలసినవాడు అతడే అయినా, అతణ్ణి గూర్చి రాజు ఒక్క మాటకూడా చెప్పలేదు. దైవనిర్ణీతుడైన ఉత్తరాధికారి హర్షుడే అన్నట్లు మాట్లాడాడు. కేవలం సాహిత్య దృష్టితో ఐతిహాసిక సత్యాన్ని ఈ విధంగా తారుమారుచేసినందుకు మనం బాణుణ్ణి అంతగా తప్పు పట్టవలసిన పనిలేదు.

హర్షుని దుఃఖానికి అంతులేదు. గడియగడియకీ తండ్రిపరిస్థితినిగూర్చి అడుగుతూనే ఉన్నాడు. ఏమీ మార్పు కనబడడంలేదు. ఇంతలో రాజుగారి విశ్వాసపాత్రుడైన వైద్యుడు అగ్నిప్రవేశం చేశాడని వార్తవచ్చింది. ఆకాశం మీద తోకచుక్క పొడిచింది. ఇంకా ఎన్నో అపశకునాలు కనబడుతున్నాయి. మర్నాడు ఉదయం రాణి పరిచారిక ఒకామె పరుగెత్తుకుంటూ, ఏడుస్తూ వచ్చి, రాణి అగ్నిప్రవేశం చేయబోతూన్నదనీ, ఆమెను ఎలాగైనా మరలించవలసిందనీ హర్షుణ్ణి ప్రార్థించింది. దుఃఖాక్రాంతుడైన హర్షుడు పరుగెత్తుకుంటూ తల్లిదగ్గరికి వెళ్ళి ఆమెను బ్రతిమాలాడు. ప్రయోజనం లేకపోయింది. మహోన్నత ధర్మవంతురాలైన ఒక వీర పత్నిగా ఆమె తన పట్టు విడవలేదు, ఇలాంటి వీరపత్నులకు ప్రాణం తృణప్రాయం. మరణం అంటే ఏ

మాత్రమూ భయంలేదు. జీవితం కంటె స్వర్గమే వారికి ఇష్టమైనది ఇలాంటి స్వయం మరణానికి ధర్మశాస్త్రంకూడా అంగీకరిస్తుంది. ఇలా సహగమనం చేసిన వందలాది స్త్రీలని, భారతదేశంలోని వివిధప్రాంతాల్లో నేటికికూడా పూజిస్తూ ఉంటారు. ఆమె సూటిగా, ఆవేశపూరితంగా కుమారునితో అన్న మాటల్లో, బాణుని శైలికి ఉన్న శక్తిని మనం చూడవచ్చు.

"నాయనా! నాకు నీమీద ప్రేమ లేదని కాని, నీవు సద్గుణవంతుడవు కావనిగాని, లేదా నీవు విడిచివేయ తగినవాడ వని కాని అర్థంకాదు. నువ్వు నా చనుబాలతోపాటు హృదయం కూడా త్రాగినవాడవు. ఈ సమయంలో నేను నీవిషయంలో ఆదరభావం చూపించలేకుండా ఉన్నానంటే అందుకు కారణం నాప్రభువు విషయంలో నేను చేయవలసిన కర్తవ్యం మన ఇద్దరి మధ్యా అడ్డుగా నిలవడమే. ఒక ప్రభువును విడిచి మరియొక ప్రభువును చేరడానికి నేను చపలస్వభావంగల లక్ష్మివంటి దాన్ని కాను. నిష్కలంకమైన వంశంలో పుట్టి ఒక గొప్ప ఇంటికి చేరు కున్నదాన్ని నేను. సద్గుణాలే నాకు కావలసిన ఉత్తమాభరణాలు. ఎన్నో యుద్ధాల్లో సింహంవలె అద్భుత బలపరాక్రమాలు చూపిం చిన మహాపురుషుని అర్ధాంగినైన ఆడసింహాన్ని నేను; వీర్య శుల్కంగల ఒక వీరపుత్రిని; వీరపత్నిని; వీరమాతను. నాలాంటి స్త్రీ మరి ఇంకే విధంగా ప్రవర్తించాలో నీవే ఆలోచించి చెప్పు ...... వైధవ్యం రాకముందే నేను మరణించాలి ...... ఇటు వంటి పరిస్థితిలో మరణించకుండా జీవించడం అనేది కటికితనం అవుతుంది. అనశ్వరమైన ప్రేమ అనే కట్టెలతో మండే భర్తృ వియోగ దుఃఖ జ్వాలలతో పోల్చి చూస్తే, నిప్పుకూడా ఒళ్లు కొంకర్లు పోయేటంత చల్లగా ఉన్నట్లు అనిపిస్తుంది ...... నాయనా! నిన్ను వేడుకుంటాను. నా హృదయాభిలాష తీర్చుకో

వడానికి అడ్డుచెప్పి నన్ను ఇంక అవమాన పరచవద్దు. అని అంటూ ఆమె ఆతని పాదాలపై పడింది.''

ఇది సంస్కృత వాఙ్మయంలో అతి ప్రసిద్ధి సంపాదించిన భాగం. బాణుడు, ఈ వర్ణనలో, ఆమె నిర్భయంగా చేసిన దృఢనిర్ణయాన్ని సుకుమార ప్రేమభావంతో చాలా చక్కగా మేళవించి చూపించాడు. ఇపుడు మనం 'సతి' అయే ఆచారంనుంచి చాలా దూరం అయి ఉండవచ్చు. ఐతే బాణుడు వర్ణించిన తీరునుబట్టి ప్రాచీనకాలంలో ఉన్న ఈ ఆచారాన్ని గూర్చి స్పష్టంగా తెలుసుకొని, నేడుకూడా దాని వైశిష్ట్యాన్ని మెచ్చుకోవడానికి అవకాశం ఉంది. కాదంబరిలో, బాణుడే, ఈ ఆచారాన్ని ఖండిస్తూ, దాని వల్ల స్వర్గం కలుగుతుందని చెప్పడం వట్టి బూటకం అంటాడు. ఐనాకూడా దీన్నిగూర్చి హర్షచరిత్రలో ఇంతగా వర్ణించాడంటే దీనికున్న ఐతిహాసిక ప్రాధాన్యాన్ని మనం ఊహించుకోవచ్చు. కేవలమూ సాహిత్యదృష్టితోచేసిన వర్ణన అని చెప్పి దీన్ని తేలిగ్గా కొట్టివేయడానికి వీలులేదు. హర్షుని తల్లియైన యశోమతీదేవి సహగమనం చేసి ఉండకపోయినట్లైతే ఇంతటి విస్తృత వర్ణనికి హర్షవర్ధనుని ఆస్థానంలో అంత ప్రాధాన్యం ఉండేది కాదు. ఈ సంఘటన అక్కడ ఉండే ప్రతీవారి హృదయంలోనూ చెరపరానివిధంగా హత్తుకుపోయి ఉండడమే దీని ప్రాధాన్యానికి కారణం. పాఠకులందరికీ నచ్చేవిధంగా ఈ విషయాన్ని ఈ విధంగా వర్ణించడమనేది బాణుని అసాధారణ ప్రతిభా సంపదకు తార్కాణం. కళాదృష్టితో, బాణుడు బాహ్యసౌందర్యానికి ప్రాధాన్యం ఇచ్చినా, ఇటువంటి ఘట్టాల్లో, వర్ణించే పాత్రల హృదయాంతరాళాల్లో ప్రవేశించి వాళ్ళ భావాల్ని వెలికి తీసిచూపిస్తాడు. ఆతని లయబద్ధ గద్య నిర్మాణమూ, మాటలలోని ఒడుపూ, ఒక మాటకే క్రొత్తక్రొత్త విశేషణాలు వేస్తూ దాన్ని రెండుమూడు సార్లు ప్రయోగించే విధానమూ, అప్పుడప్పుడు చెప్పవలసిన విషయం ప్రత్యక్షంగా చెప్పకుండా వర్ణనలద్వారా సూచించి పాఠకుల్ని ఆలోచనా మగ్నులయేటట్లు చేయడమూ. మళ్ళీ మొదటి మార్గానికి తిరిగి వెడుతూ ఉండడమూ, వీటి అన్నిటినీ చూస్తే పాఠకులు దిగ్భ్రాంతులైపోయి, కవి ఏ పక్షాన్ని సమర్థిస్తున్నాడో చెప్పలేని పరిస్థితిలో పడిపోతారు.

ఇంతలో ప్రాణం పోయేముందు, రాజు, రాజ్యాధికారం చేపట్టవలసిం దిగా హర్షుణ్ణి మరొకసారి కోరుతూ, ధైర్యంగా రాజ్యపాలనం చేయమం టాడు. ఈ విధంగా బాణుడు రాజుయొక్క అభిప్రాయం ప్రకారం హర్షుడు తప్ప మరెవ్వరూ రాజ్యానికి ఉత్తరాధికారులు కారు అనే విషయాన్ని మరొక సారి ధ్రువపరుస్తాడు.

మానవుల దుఃఖంలో పాలుపంచుకుంటున్నట్లు ప్రకృతికూడా ఏవిధంగా విషాదచ్ఛాయలు కప్పిఉందో బాణుడు విస్తృతంగా వర్ణిస్తాడు. దుఃఖభారంతో క్రుంగిపోయిన హృదయంతో, హర్షుడు సరస్వతీ నదీతీరాన, తండ్రికి అంత్య క్రియలు జరుపుతాడు. స్వామి భక్తులైన ఎంతోమంది రాజసేవకులు కూడా రాజుతో సహగమనం చేస్తారు. హర్షుడు రాజ్యవర్ధనునికి అతి శీఘ్రంగా వార్త పంపి ఆతని రాక కోసం ఎదురుచూస్తూ ఉంటాడు. (పంచమోచ్ఛ్వాసం)

దైవానుకూల్యంచేత పరిస్థితులుకూడా హర్షుడే రాజ్యానికి ఉత్తరాధి కారి అవడానికి అనువుగా ఏర్పడ్డాయని చెప్పడం పంచమోచ్ఛ్వాస సారాంశం.

తండ్రి మరణవార్త వినగానే రాజ్యవర్ధనుడు దుఃఖంతో క్రుంగిపోయి ఇంటికి తిరిగి వస్తాడు. అతడు హూణుల్ని ఓడించాడు కాని, ఆతనికి కూడా శరీరం నిండా గాయాలు తగిలాయి. మూర్తీభవించిన దుఃఖమా అన్నట్లు న్నాడు. ఒకర్ని ఒకరు చూడగానే ఆ సోదరుల దుఃఖసముద్రం పొంగిపొర లింది. వాళ్లిద్దరూ అశ్రుప్రవాహంలో మునిగిపోయారు.

భారతీయ సంప్రదాయం ప్రకారం జ్యేష్ఠపుత్రుడే రాజ్యానికి ఉత్తరాధి కారి కావాలి అందుచేత ఐతిహాసిక దృష్టితో ఆలోచిస్తే, హర్షుడు సింహాస నాన్ని అధిష్ఠించడానికి ముందు, రాజ్యవర్ధనునివల్ల కొన్ని కష్టాలు ఎదుర్కో వలసి వచ్చి ఉంటుందని మనం అనుకుంటాం. ఐతే ఇలాంటిదేమి జరగలేదు. బాణుడు రాజ్యవర్ధనుణ్ణి లేశమాత్రమైనా స్వార్థపరత్వంలేని ఉత్తమ పురుషు ణ్ణిగా చిత్రించాడు. హర్షుడే రాజ్యానికి ఉత్తరాధికారి కావాలని తన తండ్రిగారి అభిమతమైనట్లు బహుశా అతనికి తెలిసి ఉంటుంది. నిజానికి తనకు కూడా రాజ్యాభిలాష ఏమాత్రమూ లేదు. అతడు సాక్షాత్తు, బోధిసత్త్వుని అవరావతా రమా అన్నట్లున్నాడు. తండ్రి చనిపోవడంతో, తాను బుద్ధుడువలె సంన్యాసి కావాలనీ, ఐహిక సుఖాలన్నీ పూర్తిగా విసర్జించి అరణ్యంలో శాంతిమయ జీవనం గడపాలనీ నిర్ణయించుకున్నాడు. తమ్ముణ్ణి మొట్టమొదట కలుసు

కున్నప్పుడే తన స్థిరనిశ్చయం ఆతనికి తెలియపర్చాడు. రాజ్యభారం వహించి వీరోచితమైన మహోన్నత జీవితాన్ని గడపవలసిందిగా ఆతనికి గట్టిగా నచ్చచెప్పాడు. తన దృఢనిశ్చయానికి చిహ్నంగా చేతిలో ఉన్న కత్తి విడిచిపెట్టాడు.

సింహాసనం అధిష్ఠించాలనే అభిలాష హర్షవర్ధనునికీ లేదు. ఈ రాజ్యాన్ని తనకు అప్పగించడంద్వారా అన్నగారు తనని శిక్షిస్తున్నాడని అతడు భావించాడు. కాదుకూడదని గట్టిగా పట్టుబడతాడు. ఈ ఘట్టంలో బాణభట్టు ఎన్నో చక్కని లోకోక్తులు ఉపయోగించాడు. వాస్తవానికి, విశ్రామ చిహ్నాలు ఉపయోగించినట్లుగా మధ్య మధ్య ఈలాంటి లోకోక్తులు చేర్చడం బాణునికి పరిపాటి అందుచేత ఆ మాటలు కొన్ని ఇక్కడ ఉదహరించడం అవసరం.

"రాజ్యభారం వహించుము అని చెప్పడం, అసలే దుఃఖంతో దహించుకుపోతూన్న నన్ను ఇంకా దహింపచేస్తూ, అనావృష్టికి ఎండిపోయిన ఎడారిమీద కొరవుల వర్షం కురిపించడం వంటిది. ఇది ఆర్యునికి తగినదికాదు. ఈ ప్రపంచంలో గర్వంలేని రాజకుమారుడూ ఆశలేని బ్రాహ్మణుడూ, కోపంలేని మునీశ్వరుడూ, చపలచేష్టలు చేయని కోతీ, అసూయలేని కవీ, మోసం చేయని వర్తకుడూ, అసూయా అనుమానమూ లేని భార్యాప్రియుడూ, దారిద్ర్యం లేని సత్పురుషుడూ; పరుషంగా మాటలాడని ధనికుడూ, దుర్వ్యసనాలు లేని యువరాజూ, . . . . . . లభించడం కష్టమే అయినా నాకు ఆర్యుడే ఆచార్యుడు."

వాక్యాల్ని తూచిచూచి వాడడంలో బాణుడికి ఉన్న నైపుణ్యం ఈ ఘట్టంలో స్పష్టంగా కనిపిస్తుంది. ఈ మాటలతో బాణుడు మనల్ని, రాజ్యాన్ని కబళించడం కోసం కాకుండా, రాజ్యాన్ని త్యజించడం కోసం రామ భరతు లిద్దరూ పరస్పరమూ తీవ్రంగా వాదించుకున్న దృశ్యంలోకి తీసుకుపోతాడు. ఇక్కడ రాజ్యవర్ధనుడు రాముడైతే హర్షవర్ధనుడు భరతుడు. రాజ్యభారాన్ని స్వీకరించమనే అన్నగారి ఆజ్ఞను తిరస్కరించాలని హర్షుడు

అనుకుంటూ ఉంటాడు. రాజ్యవర్ధనుడు మాత్రం తన నిర్ణయం ఏమాత్రమూ మార్చుకోకుండా, తాపసులు ధరించే నారచీరలు ధరిస్తాడు. దైవకృతంగా ఒక విఘ్నం ఏర్పడింది కాని, లేకపోతే ఈ వాదం ఇంకా కొనసాగేదే.

రాజ్యశ్రీ సేవకు డొకడు పరుగెత్తుకుంటూ వచ్చి, అశ్రుపూర్ణ నేత్రాలతో, ఆ సోదరులకు ఒక శోకవార్త వినిపించాడు. రాజు మరణించినట్లు పుకార్లు బయలుదేరిన రోజునే మాలవరాజు రాజ్యశ్రీ భర్తయైన గ్రహవర్మను దొంగపోటుగా వచ్చి హతమార్చాడు. రాజ్యశ్రీకి సంకెళ్లువేసి కనోజులోనే కారాగారంలో ఉంచుతాడు. ఈ దేశం మీదికికూడా దండెత్తి వస్తున్నాడని పుకారు బయలుదేరింది.

ఈ దుర్వార్త పిడుగులా వచ్చి పడడంతోటే, రాజ్యవర్ధనుడు తన మనస్సు మార్చుకున్నాడు. భయంకరమైన క్రోధావేశంతో మళ్లీ కత్తి చేబట్టాడు. ఇపుడు తాను చేయవలసింది తాపసవేషధారణం కాదు; అపరాధియైన ఆ దుర్మార్గుడిమీద పగతీర్చుకోవడం తన ప్రథమ కర్తవ్యం. పదివేల అశ్వసైన్యంతో, భండినిమాత్రం సహాయంగా తీసుకుని బయలుదేరాడు. కూడా రావాలనుకున్న హర్షుణ్ణి వెనక్కి పంపివేశాడు.

కొన్ని రోజుల తరవాత హర్షునికి ఒక కల వచ్చింది. ఆకాశాన్ని చుంబిస్తూన్న ఒక ఆయస స్తంభం ముక్కలు ముక్కలుగా బద్ధలైపోయినట్టు కనబడింది. ఈ కల ఇతన్ని చాలా క్రుంగదీసింది. రాజ్యవర్ధనుడు మాలవ సైన్యాన్ని అనాయాసంగా జయించాడనీ, ఐతే, అతడు తన సేనానివేశంలో కొంచెం అలమరచి ఉన్నప్పుడు, గౌడరాజు విశ్వాసఘాతకుడుగా ప్రవర్తించి, అతన్ని చంపవేశాడనీ వార్తలు వచ్చాయి. ఇవి చాలా ప్రధానమైన ఐతిహాసిక సంఘటనలు. ఐతే, వీటికి సంబంధించిన వివరాలు బాణునిద్వారా తెలుసుకోవడం కోసం ప్రయత్నించడం నిష్ప్రయోజనం. అఖరికి, ఆ శత్రురాజుల పేర్లుకూడా బాణుడు మనకు చెప్పడు. ఆ గౌడరాజు పేరు శశాంకుడని హ్యూయన్‌త్సాంగ్ వ్రాశాడు. హర్షచరితానికి వ్యాఖ్యానం వ్రాసిన శంకరుడనే ఒక ప్రాచీన వ్యాఖ్యాతకూడా ఈ విషయాన్ని ధ్రువపరచి ఉన్నాడు. రాజ్యశ్రీని బందీగా చేసిన మాలవరాజు దేవగుప్తుడనే విషయంకూడా మనం అధునిక చారిత్రకులద్వారా తెలుసుకోవలసి ఉంది. (చూ. C. V. Vaidya: History of Mediaval India; Vol I PP. 34 - 39.)

ఆధునిక - ఐతిహాసిక దృష్ట్యా చూస్తే ఏమైనా లోపాలు ఉన్నట్లు కనబడినా సాహిత్యదృష్టితో చూచే సహృదయుడికి మాత్రం, తీవ్రభావ సంచలనం కలిగే విధంగా చేసిన ఇలాంటి ప్రధాన ఘట్టాల వర్ణన, సంతృప్తి కరంగానే ఉంటుంది. రోజెర్ ఫ్రై యొక్క అభిప్రాయం ప్రకారం — లోకోత్త రాహ్లాదం అనేది, చివరికి ఏదైనా ఒక ప్రయోజనాన్ని మనస్సులో పెట్టుకొని వ్రాయడంవల్లగాని, ఇతరమైన ఉపాయాలవల్లగాని కలగదు; "ఇవి వాస్తవ మైనవే అని మనకు అనిపించే కొన్ని సంఘటనలను సృష్టించడంద్వారా కలుగుతుంది. ఈ సంఘటనలు, ఇతరాపేక్ష ఏమీ లేకుండానే పరిపూర్ణమైన విగా ఉంటాయి"

హృదయవిదారకమైన సోదర మరణవార్త వినగానే హర్షవర్ధనుడు కోపోద్రిక్తు డౌతాడు. సింహనాదుడనే సేనాధిపతి, ఆ దుర్మార్గులను శిక్షించ డానికి వెంటనే దండెత్తి వెళ్లాలని, కోపోత్తేజకాలైన మాటల్లో, ఉపదేశిస్తాడు. పరశురాము భీ మూదులు చేసినట్లుగా హర్షవర్ధనుడుకూడా దుష్టశత్రుసంహారం చేయాలని అతడు ఉద్బోధిస్తాడు

యుద్ధానికి సన్నద్ధులు కావలసిందిగా, హర్షవర్ధనుడు, సైన్యా లన్నిం టికీ ఆదేశాలిస్తాడు. గజసేనాపతి స్కందగుప్తుడు ఏర్పాట్లన్నీ పూర్తి అయినా యని చెపుతూ శత్రువుల కపటోపాయాలకి బలికాకుండా జాగర్తగా ఉండవల సిందని హర్షవర్ధనుణ్ణి హెచ్చరిస్తాడు ఈ సందర్భంలో, పాపభీతిలేని శత్రు వుల కపటోపాయాలకి సులభంగా లొంగిపోయిన ఇరవై ఎనమండుగురు ప్రాచీన రాజుల్ని గూర్చి అతనికి వర్ణించి చెపుతాడు. ఉదాహరణకి :—

1. చిలుక రహస్య భేదనం చేయడంతో పద్మావతీ రాజైన నాగసేనుడు (ఇతడు బహుశా సముద్రగుప్తుని సమకాలికుడై ఉంటాడు) మరణం పొందాడు.

2. చిలక రహస్య భేదనం చేయడంచేతనే, శ్రావస్తి రాజైన శ్రుతవర్మ రాజ్యం కోల్పోయాడు.

3. కలవరింతలో తన రహస్యం బయటపెట్టుకొని మృత్తి కావతి రాజైన సువర్ణ చూడుడు అసువులు కోల్పోయాడు.

**4.** కిరీట మణిక్యాల్లో ప్రతిబింబించిన రహస్య లేఖ చదివిన ఒక చామర గ్రాహిణి యవనేశ్వరుని పాలిటి మృత్యువు అయింది.

ఈ విధంగా అజాగర్తచేతా, పాపభీతి లేని శత్రువులు చేసిన వంచన చేతా మరణించిన ఇంతమంది రాజుల పేర్లు భారతీయ వాఙ్మయంలో మరెక్కడా లభించవు. విష్ణుపురాణము, కాముందకీయ నీతిసారము, వరాహ మిహిర విశాఖదత్తాదుల గ్రంథాలూ, బాణుడు చెప్పిన చాలా విషయాలు యథార్థాలే అని రుజువు చేస్తున్నాయి. బహుశా ఈ విషయాలు భారతీయ రాజాస్థాన కవిపరంపరలో సంప్రదాయంగా, అనుస్యూతంగా వస్తూ ఉండవచ్చు. ఈ రాజుల్లో చాలామంది ఇతిహాసానికి సంబంధించిన వారేకాని కేవలమూ పురాణగాథలకి సంబంధించినవారు కాదు. ఐతే మన అధునిక — ఐతిహాసికులికి ఈ విషయాలేవీ తెలియనే తెలియవు ఈ రాజుల పేర్లనైనా తన హర్షచరితంలో, అంశంగా ప్రస్తావం కాకపోయినా, ఉదాహరించి, అవి విస్మృతి పథంలో కలిసిపోకుండా కాపాడినందుకు మన చరిత్ర కారులు బాణునికి కృతజ్ఞులై ఉండాలి (షష్ఠోచ్ఛ్వాసం)

హర్షవర్ధనుని దిగ్విజయాన్ని వర్ణించే సప్తమోచ్ఛ్వాసం, వీరునికి అసాధ్యమైనదేదీ లేదనే లోకోక్తిని ధ్రువపరుస్తూన్నది.

"అఙ్గనవేదీ వసుధా కుల్యా జలధిః స్థలీ చ పాతాలమ్
వల్మీకశ్చ సుమేరుః కృతప్రతిజ్ఞస్య వీరస్య."

(హ. చ. VII 1)

"వసుధ యంగణవేది యౌ, వనధి కుల్య
యగును, దుర్గమ పాతాళ మగును స్థలిగ
అలసుమేరువు వల్మీక తులిత మగును
ప్రతిన బూనిన ధీరున కతులితునకు."

"ప్రతిన పూనిన వీరుడికి ఈ భూమండలం అంతా గృహాంగణంలో ఉన్న ఒక తిన్నె; సముద్రం ఒక బోదె కాలువ. పాతాలం ఒక మెట్టభూమి. మేరుపర్వతం ఒక చీమలపుట్ట."

బాణుని మాటల్లో విజయయాత్రచేస్తున్న సైన్యం ధ్వనికూడా మనకు వినబడుతుంది.

"వెంటనే పటహాలు మ్రోగాయి. మంగళ పటహాలు ధ్వనిచేశాయి కుంజాలు గుంజనం చేశాయి. ఘంటానాదం బయలు దేరింది, శంఖాలు పూరింపబడ్డాయి. సేనా కలకలం తారస్థాయి అందుకొంటూన్నది. భేరీదండజనిత ఝాంకారాలతోటీ, తాళ ధ్వనులతోటీ దిక్కులు పిక్కటిలుతున్నాయి."

ఈ ఘట్టంలో, బాణుడు, అశ్వదళాన్నీ, గజసైన్యాన్నీ వివిధ సామ గ్రులు మోస్తూన్న గార్దభసమూహాన్నీ, శకటాలనీ అత్యద్భుతంగా వర్ణిం చాడు. స్వర్గాధీశ్వరుడైన మహేంద్రుడు వలె హర్షవర్ధనుడు సేనామధ్యలో ఉండి, ప్రయాణం చేస్తున్నాడు. మహాధైర్యశాలులైన యుద్ధభటులందరూ తాము హిమాలయ గంధమాదన ప్రాంతాలమీదా, టర్కీ, పర్షియాదేశాల మీదా, పారియాత్ర - మలయ - మహేంద్ర పర్వత ప్రాంతాలమీదా దండ యాత్రలు చేసినప్పుడు సాధించిన ఘనవిజయాల్ని గూర్చి ఉత్సాహంతో మాటలాడుకుంటున్నారు.

మార్గమధ్యంలో, ప్రాగ్జ్యోతిష రాజదూత ఒకడు హర్షవర్ధనుని దర్శనం చేసుకుని, తమ ప్రభువు హర్షవర్ధనుని మైత్రి కోరుతున్నట్లుగా నివేదించాడు. హర్షవర్ధనుని విషయంలో తనకున్న గౌరవానికి చిహ్నంగా అతడు పంపిన ఆభోగం అనే విచిత్ర శక్తివంతమైన ఒక శ్వేతచ్ఛత్రం బహూకరించాడు. అది తమ ప్రభువుకు వరుణుడిచ్చిన పారితోషికం అని తెలియచేసి, అతడు, ఆ ఛత్రానికున్న ప్రభావం వర్ణిస్తూ ఇలా చెప్పాడు:—

"ఇది ఎంతో ప్రభావంగల శ్వేతచ్ఛత్రం. దీని ఊచలలో చల్లని చంద్రకిరణాలు ఉండడంచేత మనకు కావలసినంతసేపూ ఇది చంద్రుడివలె నిర్మలమైన జలాన్ని స్రవిస్తుంది. ఇది, చతుః సముద్ర పర్యంత భూమండలానికి సమ్రాట్టు ఐనవానినే గౌరవిస్తుంది కాని ఇతరుల్ని గౌరవించదు. దీన్ని అగ్ని దహించజాలదు; వాయువు ఎగురగొట్ట జాలదు; ఉదకం తడపజాలదు; ధూళి మలినం

చేయజాలదు. ఎన్నటికీ, ఇది పాతదై పోవడం అనేది ఉండదు. ప్రభువులు దృష్టిప్రసారంచేత దీన్ని అనుగ్రహించాలి."

దానితోపాటు ఇంకా కొన్ని ఇతర పారితోషికాలుకూడా ఉన్నాయి. మొదటి సేనానివేశంలోనే ఇలాంటి పారితోషికాలు లభించడం శుభసూచకం అని భావించి, హర్షుడు వాటి నన్నింటినీ స్వీకరించాడు. ఈ ప్రాగ్జ్యోతిషాధీశుల వంశాన్ని అతివిస్తృతంగా వర్ణిస్తూ, బాణుడు, హర్షవర్ధనునితో మైత్రి చేసుకోవాలని, ఆ రాజుకు ఉన్న తీవ్రాభిలాషనూ, "అచిరకాలంలోనే ఆయనను కలుసుకుంటాను" అని చెపుతూ హర్షవర్ధనుడు ఆతని విషయంలో అనుగ్రహం చూపించిన పద్ధతినీ విపులంగా చిత్రించాడు.

రాజ్యవర్ధనుని పరాక్రమంచేత పరాజితుడైన మాల్వాధీశుని సైన్యాన్నంతనీ తీసుకుని భండి వస్తున్నాడనీ, దగ్గరలోనే విడిసి ఉన్నాడనీ, హర్షవర్ధనునికి ఒకనాడు వార్త అందింది. ఈవార్త వినగానే సోదర శోకాగ్ని మళ్లీ ప్రజ్వలించింది. పూర్తిగా ధైర్యం ఉడిగిపోయి అతడు భండి రాకకోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు. ఇంతలో, ఎన్నో గాయాలు తగిలి మలినంగా ఉన్న శరీరంతో భండి వచ్చాడు. అతడు "మహాపాపం చేసిన వాడిలాగ, ఏదో మహాపరాధం చేసి అపయశస్సుకుపాత్రైన దోషిలాగ ఉన్నాడు. మోసగించి దోచుకోబడ్డ వాడులా ఉన్నాడు."

అతడు ఎంతో సేపు జాలిగా ఏడ్చాడు. దుఃఖావేశం కొంతవరకూ తగ్గిన తరువాత, రాజ్యశ్రీ కనోజులోని చెరసాలనుంచి తప్పించుకొని, తన పరివారంతో వింధ్యాటవిలోనికి ప్రవేశించినట్లుగా వార్తలు అందినట్లు తెలుపుతూ, ఆమె జాడ తెలుసుకోవడం కోసం తాను పంపిన వార్తావహు లెవ్వరూ ఇంకా రాలేదని చెప్పాడు.

ఈ మాట వినగానే. హర్షవర్ధనుడు, ఏవిధంగానైనాసరే, ఆమెను రక్షించుకోవడమే తన ప్రథమ కర్తవ్యం అన్నట్లు నిశ్చయం చేసుకొన్నాడు. తాను తిరిగివచ్చేవరకూ గౌడరాజుపై జరిపే ఈ దండయాత్రకు నాయకత్వం వహించవలసిందిగా భండిని ఆదేశించాడు. తన అన్నగారైన రాజ్యవర్ధనుడు మాలవరాజును ఓడించి సంపాదించిన యుద్ధ ధనాన్నంతనీ మరునాడు పరీక్షించాడు. అందులో ఎన్నో అమూల్య రత్నాలూ. అనేక ధనపేటికాదులూ

ఉన్నాయి. తరువాత వెంటనే అశ్వారూఢుడై సోదరి అన్వేషణం కోసం బయలుదేరి కొద్ది రోజుల్లో వింధ్యారణ్యం చేరుకున్నాడు.

ఈ ఘట్టాన్నంతనీ, బాణభట్టు మహాకావ్య శైలిలో అతి విస్తృతంగా వర్ణించాడు. (సప్తమోచ్ఛ్వాసం)

ఇపుడు మనం చివరిదైన అష్టమోచ్ఛ్వాసానికి వచ్చాం. ఐతిహాసిక దృష్టిలో అంతా అసంపూర్ణంగానే ఉన్నట్లు కనిపించినా, సాహిత్యదృష్టిలో ఈకావ్యం పూర్తి అయినదని చెప్పడానికి ఏమాత్రమూ సందేహంలేదు. దైవానుగ్రహం చేత రాజ్యశ్రీ జాడ తెలిసి దురంత పరిణామాల్లోంచి ఎలాగో బయటపడి, అంతా సుఖాంతం అయేలోపల ఉన్న దృశ్యం అంతా కరుణ భయాత్మకం గానూ, ఇంకా ఏమౌతుందో అని పాఠకుడు ఊపిరి బిగపెట్టుకొని కూర్చుంవలసిందిగానూ ఉంటుంది. బాణుడికి శ్లేష అంటే ఎంత ఇష్టమో మనకు తెలుసు. ఆ దృష్టిలో చూస్తే రాజ్యశ్రీని ఆపదల్లోంచి ఉద్ధరించడం అనేదాన్ని, రాజ్యలక్ష్మిని ఉద్ధరించడానికి ప్రతీకంగా గ్రహించవలసి ఉంటుంది. ప్రతీక రూపంలో కాకుండా అక్షరార్థంలో గ్రహించినాకూడా, రాజ్యశ్రీని ఉద్ధరించిన తరువాతనే తద్వారా, హర్షవర్ధనుడు కనోజు రాజధానిగా గల మౌఖరీ రాజ్యానికంతకీ ఆధిపత్యం సంపాదించాడు. ఒకదానితరువాత ఒకటిగా జరిగిన అద్భుతసంఘటనల పరంపరలో కవియొక్క స్వీయానుభూతికూడా ఇమిడి ఉంది. అందుచేతనే ఇది పఠితల మనస్సును అంతగా ఆకట్టుకోకలుగుతూన్నది. ఈ కథ నడిపించిన తీరుచూస్తే, హర్షవర్ధనుడే వ్రాసిన రత్నావళి వంటి రూపకాల్లో అకస్మాత్తుగా ఆపదలు వచ్చిపడడమూ, అంతలోనే పరిస్థితులు కొంత చక్కబడడమూ- చివరికి అంతా సుఖమయం కావడమూ, ఇవన్నీ గుర్తుకు వస్తాయి.

హర్షవర్ధనుడు చాలారోజులపాటు అరణ్యంలో తిరిగాడు. ఒకనాడు ఒక ఆటవిక నాయకుడు, ఒక వ్యాధ యువకుణ్ణి హర్షవర్ధనుని దగ్గరకు తీసుకువచ్చి, అతడొక వ్యాధనాయకుని కుమారుడైన నిర్ఘాతకుడనీ, ఆ మొత్తం అరణ్యంలో అతనికి తెలియని చోటు ఏదీ లేదనీ, రాజ్యశ్రీని అన్వేషించడంలో అతడు కొంతవరకూ ఉపకరించవచ్చుననీ చెప్పాడు. ఈ అరణ్యంలో అందమైన స్త్రీ ఎవరైనా నీకు కనబడిందా అని హర్షవర్ధనుడు అతన్ని అడిగాడు. నాకు ఇంతవరకూ ఎవరూ కనబడలేదు. కాని ఆమెకోసం

అరణ్యంలో అంతటా గాలించడానికి ఏర్పాట్లు చేస్తానని అతడు చెప్పాడు. ఇంతలో, ఆ ప్రాంతంలోనే ఉన్న దివాకర మిత్రుడనే బౌద్ధ పరివ్రాజకుడికి ఆమె జాడ తెలియడానికి అవకాశం ఉన్నదనే ఒక అభిప్రాయంకూడా ఏర్పడింది. ఆ పరివ్రాజకుణ్ణి గూర్చి హర్షవర్ధనుడు వినిఉన్నాడు. అందుచేత వెంటనే ఆయన్ని కలుసుకోవాలని అభిలాషతో, ఆ వ్యాధనాయకుడు చూపిన మార్గాన ఆయన ఆశ్రమానికి వెళ్లాడు. ఆ ఆశ్రమం అతి పవిత్రంగానూ, ప్రశాంతంగానూ ఉంది.

''ఆ చుట్టుప్రక్కల కనబడేవాళ్ళని పట్టి, ఆ వృక్షసమూహం మధ్యంలో, ఆ మహాతపస్వి ఉన్నాడనే విషయం హర్షవర్ధనుడికి దూరంనుంచే తెలిసింది. అనేక ప్రాంతాలనుంచి వచ్చిన బౌద్ధులు అక్కడ అనేక భంగిమల్లో కూర్చున్నారు. కొందరు శిలాస్తంభాలకి ఆనుకున్నారు. కొందరు శిలాఫలకాలమీద కూర్చున్నారు. కొందరు లతామండపాల్లో ఉన్నారు. కొందరు పొదల్లో పండుకున్నారు. కొందరు కొమ్మల నీడల్లో కూర్చున్నారు. కొందరు చెట్ల మొదళ్లు ఆనుకొని కూర్చున్నారు. వీళ్ళందరూ కామాలన్నీ జయించిన బౌద్ధ సంన్యాసులే. అక్కడ ఇంకా శ్వేతాంబర జైనులూ, భాగవతులూ, బ్రహ్మచారులూ, కేశలుంచనం చేసుకున్న క్షపణకులూ, కపిలమతానుయాయులూ, జైనులూ, లోకాయతికులూ, కాణాదులూ, ఉపనిషన్మతానుయాయులూ, ఈశ్వరుడే జగత్స్రష్ట అనే మతాన్ని విశ్వసించేవారూ, ధర్మశాస్త్రాధ్యయనం చేసే వారూ, పౌరాణికులూ, యజ్ఞాలు చేయించకలిగిన వారూ, వైయాకరణులూ, పాంచరాత్రికులూ, ఇంకా ఎన్నో విభిన్న సంప్రదాయాలు అనుసరించే వారూ ఉన్నారు. వాళ్ళందరూ తమ తమ సంప్రదాయాలను శ్రద్ధగా అనుసరిస్తూన్నవారే. వాళ్ళల్లో కొందరు తమ తమ సిద్ధాంతాలను గూర్చి చర్చలు చేస్తున్నారు. కొందరు పూర్వపక్షాలు చేస్తున్నారు. కొందరు

సందేహాలు వెలిబుచ్చుతున్నారు. కొందరు ఆ సందేహాలు తొలగిస్తున్నారు. కొందరు నిర్వచనాలు చెపుతున్నారు. కొందరు వాగ్వాదం చేస్తున్నారు. కొందరు చదువుతూ అర్థవివరణం చేస్తున్నారు. ఐతే వాళ్ళందరూ ఈయనకు శిష్యులుగా వచ్చి చేరినవారే.''

ఈ వర్ణనలో మనం ఆనాటి గురుకులాల యథార్థ స్వరూపం చూడవచ్చు. ఆనాటి గురుకుల విద్యాభ్యాసం అతివిశాల దృష్టిలో ఏర్పడినది. ఈ గురుకులాలు, మతసంబంధమైన విద్యలూ, ఐహిక విద్యలూ అభ్యసించడం కోసం వచ్చే భిన్న రుచులుగల విద్యార్థుల్ని ఆకర్షించేవి. బాణుడు ఈ ఘట్టంలో నిష్పాక్షిక బుద్ధితో చిత్రించిన బౌద్ధమత వైశిష్ట్యం భారతీయ వాఙ్మయంలో లభించదనే చెప్పాలి. మన దేశంలో తర్కబద్ధమైన ఆలోచనా పద్ధతికి ఒక వైపు ప్రోత్సాహం ఇస్తూ, మరొక వైపు నైతికోన్నతా దర్శాలని బోధించినది బౌద్ధ మతమే. ఏ విధమైన అడ్డంకులూలేని ఆలోచనా పద్ధతికీ, ఉన్నత విద్యావిధానానికీ పునాదులు వేసినది బౌద్ధమతమే అని చెప్పాలి. బాణుని కాలంలో ఈ మతానికి రాజాదరమూ, ప్రజాగౌరవముకూడా లభించాయి. వివిధ మతాల విషయంలో బాణుడికున్న విశాలదృక్పథానికి ఈ వర్ణన ఒక ఉత్తమ నిదర్శనం.

దివాకరమిత్రుడు హర్షవర్ధనుడికి ఆదరపూర్వకంగా స్వాగతం చెప్పాడు. హర్షవర్ధనుడు ఆ పరివ్రాజకుణ్ణి సగౌరవంగా పూజించి రాజ్యశ్రీని గూర్చి ఆయనను అడిగాడు. తనకేమీ తెలియదని ఆయన సమాధానం చెప్పాడు.

ఆదే సమయంలో - ఎవరో యువతి అగ్నిలో ప్రవేశించి ఆత్మత్యాగం చేయడానికి సన్నద్ధురాలై ఉన్నదని ఒక సంన్యాసి వార్త తీసుకొని వచ్చాడు. ఆ మాట వినగానే హర్షుడూ, దివాకరమిత్రుడూ, ఇతరులూకూడా సరియైన సమయానికి, ఆ ప్రదేశానికి వెళ్ళి రాజ్యశ్రీ ప్రాణాలు కాపాడారు సోదరీ సోదరులు కలిసిన ఆ దృశ్యం చాలా కరుణమయంగా ఉంది. శత్రువులు రాజవర్ధనుణ్ణి హత్యచేసింది మొదలు తాను పడ్డ బాధలూ ఆహారంలేకుండా అడవులంట తిరగడమూ, చివరికి అగ్నిలోపడి ఆత్మాహుతి చేసుకోవడానికి

చేసిన ప్రయత్నమూ, ఈ విషయాలన్నీ రాజ్యశ్రీ అన్నగారికి చెప్పి, తాను పరివ్రాజిక అవడానికి అనుమతి ఇవ్వవలసిందిగా కోరింది. రాజ్యవర్ధనుణ్ణి హత్యచేసిన శత్రువుపై పగతీర్చుకొని, తన ప్రతిజ్ఞ నెరవేర్చుకొని తిరిగివచ్చే వరకూ ఆమె దివాకరమిత్రుని సంరక్షణలో ఉండాలనీ, తాను తలపెట్టిన పని పూర్తియైన తరువాత, తానూ, రాజ్యశ్రీకూడా సంన్యాసం తీసుకోవచ్చు ననీ హర్షవర్ధనుడు ఆమెకు నచ్చచెపుతాడు. దివాకరమిత్రుడూ, రాజ్యశ్రీ కూడా హర్షునివెంట వెళ్ళడానికి అంగీకరిస్తారు. ఇంతలో సూర్యాస్తమయం అయి చంద్రోదయం అవుతుంది. ఈ గ్రంథంలోని అంతిమ వాక్యాలు ఇవి:–

"సంధ్యాకాలం దాటగానే రాత్రి, చంద్రుణ్ణి రాజుకు కానుకగా సమర్పించింది. (ఇది) అపరిమితమైన యశస్సును త్రాగడం కోసం దప్పికొన్న ఆతనికి, నిజకుల కీర్తి, ముక్తాశైల శిలతో పాన పాత్ర తయారుచేసి తీసికొని వచ్చినదా అన్నట్లు ఉన్నది. కృత యుగాన్ని నెలకొల్పడానికి ప్రయత్నిస్తూన్న ఇతనికి రాజ్యలక్ష్మి, ఆదిరాజులయొక్క రజతమయ రాజ్యాధికార ముద్రను తెచ్చినదా అన్నట్లున్నది. సకల ద్వీపాలు జయింపవలెననే ఉద్దేశంతో బయలు దేరిన ఇతనివద్దకు ఆగామిశుభదైవము శ్వేతద్వీపదూతను పంపి నదా అన్నట్లున్నది."

నిజమే. ఐతిహాసిక దృష్టితో వ్రాసిన చరిత్రకి ఇది చివరి భాగం అని ఏ విధంగానూ చెప్పడానికి వీలులేకపోవచ్చును. కాని కావ్యదృష్టితో వ్రాసిన గద్యకావ్యానికి ఇది తగిన సమాప్తియే అని చెప్పడానికి సందేహం లేదు. బాణుడు అద్భుతగాథ వ్రాయడానికి పూనుకున్నవాడు. అందుచేత దేవతా పురుషునితో సమానుడైన హర్షుని బలపరాక్రమాలచేత కృతయుగం మళ్ళీ అవతరించిందని సూచిస్తూ గ్రంథం ముగించినా తప్పేమీలేదు. హర్షుని దిగ్విజయానికి సంబంధించిన ఐతిహాసిక సంఘటనలన్నీ బాణునికి అంతగా ప్రధానమైనవి కావు. పౌరాణిక చక్రవర్తుల వీర్యపరాక్రమాది సద్గుణాలన్నీ హర్షవర్ధనునిలో కలిసి ఉన్నాయనీ, అదృష్టంకూడా కలిసిరావడంచేత అతడు కృతయుగాన్ని మళ్లీ భూమిమీద నెలకొల్ప గలిగాడనీ సూచించడం వరకు మాత్రమే బాణుని దృష్టిలో ఈ దండయాత్రకంతకీ ఉన్న ప్రాధాన్యం.

హర్షుని పుట్టుకా, అతడు సాధించిన కార్యాలూ, వీటి అన్నింటిలోనూ పౌరాణిక చక్రవర్తులలో ఉండే వైశిష్ట్యం ఉన్నదని చూపించడానికే బాణుడు మొదటినుండి చివరిదాకా చేసిన ప్రయత్నం. ఆ ప్రయత్నంలో అతడు చాలా వరకు సఫలుడయేడనే చెప్పాలి. ఈ దృష్టితో చూడకపోతే బాణుడు ఈ కావ్యాన్ని కూడా అసంపూర్ణంగానే వదిలివేశాడని మనం భావించవలసి వస్తుంది.

ఐతిహాసిక కావ్యాలు వ్రాసిన తరువాతి కవులందరూ, తమ పోషకులైన రాజుల చరిత్ర వ్రాయడంలో, బాణుడు చూపించిన ఈ మహాకావ్య పద్ధతినే గ్రుడ్డిగా అనుకరించారు. వాక్పతి రాజు తన పోషకుడైన యశోవర్మ యొక్క చరిత్రా, బిల్హణుడు షష్ఠ విక్రమాదిత్యుని చరిత్రా వ్రాశారు. బాణుడు గద్యంలో వ్రాస్తే వాళ్లు పద్యంలో వ్రాశారు. ఇదే వీటిలో ఉన్న భేదం. ఈ క్రొత్త సాహిత్య సంప్రదాయాన్ని ప్రారంభించిన గౌరవం బాణునికే చెందుతుంది. ఇది కాళిదాసు ప్రారంభించిన కావ్యరచనా పద్ధతికి విరుద్ధమైనపద్ధతి. కాళిదాసు పౌరాణిక నాయకుల చరిత్ర వ్రాస్తూ, ప్రతీక రూపంలో, తన సమకాలికులూ, పోషకులూ అయిన రాజుల చరిత్ర పాఠకుల స్మృతిపథంలో మెదిలేటట్లు చేశాడు. ఐతే, బాణుడు పౌరాణిక చక్రవర్తుల అతిశయోన్నత్యాలు చేరుస్తూ తన పోషకుడైన రాజుయొక్క చరిత్ర వ్రాశాడు. కొందరు విమర్శకులు అన్నట్లుగా — "ఐతిహాసికమైన అద్భుతగాథ వ్రాయడంలో ప్రప్రథమ ప్రయత్నం అవడమే ఈ హర్షచరితానికి ఉన్న గొప్ప వైశిష్ట్యం." (E. W. Cowell and F. W. Thomas, The Harshacharita of Bana, Motilal Banarsidas, Delhi, 1961, P. VIII.)

ఈ కథలోని ప్రధాన వ్యక్తుల్ని చిత్రించేటప్పుడు, బాణభట్టు మానవ స్వభావంయొక్క లోతుల్నికూడా పరిశీలించడంలో తనకున్న శక్తినీ, ప్రయోజనాత్మకమైన పాత్రసృష్టిలో నేర్పునూ, ప్రకటించాడు. వివిధ భావాలను అభివ్యక్తం చేయడమూ, వారివారి వైయక్తిక విశేషాలతో వివిధ వ్యక్తుల్ని స్పష్టంగా వర్ణించడమూ అంటే అతనికి ఎంతో అభిరుచి ఉంది.

సాంఘిక చరిత్ర తెలుసుకోవాలనే వారికికూడా హర్షచరిత్ర ఎక్కువగా ఉపయోగ పడుతుంది. బాణుడు చూపించిన కావ్యాతిశయోక్తుల్నీ, సాహిత్య సమయాల్నీ విడిచిపెట్టి వేస్తే, ఒక విస్పష్టమైన సమకాలీన సాంఘికచిత్రం

నిర్మించవచ్చు. ఆనాటి ప్రజల స్వరూపస్వభావాలూ, వారి వివిధవృత్తులూ, ఆచార వ్యవహారాలూ, వేషాలంకారాలూ, విశ్వాసాలూ, ఆదర్శాలూ, నమ్మకాలూ, భావాలూ, వినోదాలూ, ఇవన్నీ మనం తెలుసుకోవచ్చు. సేనానివేశాల్లోనూ, ఆశ్రమాల్లోనూ, నగరాల్లోనూ ఉండే వివిధ జీవనవిధానాలూ, నదీ తీరాల్లో ఉండే గ్రామాల్లోని ప్రశాంత జీవితమూ, ఇవన్నీకూడా మనం చూడవచ్చు. సంఘంలో స్త్రీలకు మంచి గౌరవం ఉండేది. వారు సంగీతమూ, నాట్యమూ మొదలైన అనేక కళలు అభ్యసించేవారు. సాధారణంగా ప్రజలందరూ ధార్మిక జీవనం గడుపుతూ ఉండేవారు. నిర్ణీత వేషాలు ధరించిన సేవకులతో నిండిన ప్రాసాదాల్లోని జీవనం భోగప్రధానంగా ఉండేది. మతానికి సంబంధించిన ఉత్సవాలన్నీ ఉత్సాహంతో జరుపుకుంటూ ప్రజలు శాంతి సమృద్ధులతో కూడిన జీవనం గడిపేవారు. మొత్తంమీద ప్రజలందరికీ పాపభీతి ఉండేది. సద్గుణవంతులై వారివారి వృత్తులతో సంతృప్తి చెందుతూ హాయిగా జీవితం గడిపేవారు. ఇది నీచవృత్తి అనీ, అది ఉత్తమ వృత్తి అనీ వృత్తుల విషయంలో తరతమ భావాలేవీ ఉండేవి కావు. ప్రతివ్యక్తీకూడా, కులక్రమాగతమైన వృత్తిని ఈసడించుకోకుండా ఆసక్తితోటీ పట్టుదలతోటీ అవలంబించేవాడు. భారతదేశంలోని అన్ని ప్రాంతాలవారికీ పరస్పర సంబంధాల విషయంలో ఏ విధమైన అడ్డంకులూ ఉండేవికావు. పైపై ఆచార వవ్యహారాదుల్లో ఎన్ని భేదాలున్నా, తామంతా ఒకే దేశానికి, ఒకే సంస్కృతికి చెందినవారమని ప్రజలందరూ భావించేవారు. కళలూ, విజ్ఞానమూ కూడా ఉన్నతస్థాయిని చేరుకొన్నాయి. వైద్యజ్యోతిషాల్లో సాధించిన ఔన్నత్యం బాగా చెప్పుకోతగినది. బాణుడు అత్యుత్తమ శైలిలో వ్రాసిన ఈ కావ్యంలో భారతీయ నాగరికత చేరుకున్న మహోన్నత స్థితి స్పష్టంగా ప్రతిబింబిస్తూన్నది. బాణుడువంటి మహాకవి ప్రత్యక్షంగా చూపుతున్నాడా అన్నట్లు చిత్రించిన ఈ ప్రాచీన భారతదేశౌన్నత్యాన్నిగూర్చి ఊహించుకుంటే ఆలాంటి రోజులకోసం పరితపించనివారు ఉండరు.

# 5

## కాదంబరి

బాణుని హర్షచరితం వీరరసప్రధానమైన అద్భుత గాథాకావ్యమైతే, అనగా వీరగాథా కావ్యమైతే, అతని రెండవ కావ్యమైన కాదంబరి కేవలమూ ఒక గద్యరూపమైన అద్భుతగాథ. కాలం మారినా ఎన్నటికీ వాడిపోనివీ, పద్ధతులూ, సంప్రదాయాలూ మారినా రుచి తగ్గనివీ అయిన కొన్ని సంస్కృత మహాకావ్యాల కోవకి చెందినది కాదంబరి. దీనికి ఇంత ప్రసిద్ధి రావడానికి అనేక కారణాలున్నాయి. ఒక మహాకావ్యంలోనూ, ఒక నాటకంలోనూ ఉండవలసిన సౌందర్యం ఇందులో కలిసి ఉన్నది. దుఃఖమయమైన సత్య ప్రపంచానికి ఏమాత్రమూ చోటులేకుండా విశ్వజనీనమైన శృంగారాన్ని ఇందులో చక్కగా చిత్రించడం జరిగింది. మొత్తం ప్రపంచనాగరికతకి, లేదా విరాట్టు వురుషునికి ఉన్న తీవ్రవాంఛల కొక రూపం కల్పించి అత్యద్భుత విషయాలను స్వాప్నిక లోకంలో చూపించినట్లుగా ఈ కావ్యం చూపిస్తుంది. దీన్ని సంపాదించి ప్రకటించిన ఆంగ్లేయులలో ప్రథముడైన పీటర్సన్ చెప్పి నట్లుగా — (P. Peterson, Kadambari, Bombay 1883, Introduction, P. 43.)

''ఇలాంటి కథ కోసం ఉవ్విళ్లూరుతూండే ప్రపంచ మానవుని కోరికను తీర్చే గ్రంథంగా కాదంబరికి ప్రపంచ వాఙ్మయంలో మంచి స్థానం ఉన్నది. ఇలాంటి కథ కావాలని సృష్టి ప్రారంభం నుంచికూడా మానవుల చెవులు ఎంతగానో ఉత్కంఠతో ఉన్నా ఇంతవరకూ ఏ మానవుని పెదవులూ ఈ కథను చెప్పలేక పోయాయి.''

ఇవి 1883 లో వ్రాసిన మాటలు. క్రొత్తగా కనుగొన్న ఒక అపూర్వ వస్తువుగా సంస్కృత భాషయొక్క ప్రభావం పాశ్చాత్య పండితుల మనస్సులో ఇంకా పచ్చగా ఉన్న రోజులవి. ఈ విధమైన సాహిత్య ప్రక్రియలో కాదంబరి సాటి లేనిదని భారతీయ సాహిత్యవేత్తలు చేసిన నిర్ణయం దాదాపు పది శతాబ్దాలనుంచి మార్పులేకుండా అదేవిధంగా ఉన్నది. మానవుని దుఃఖమూ, దివ్యపురుషులనుండి లభించే ఆశ్వాసనమూ, మరణానంతరంకూడా మళ్లీ కలయిక కోసం ప్రతీక్ష — ఇది ఈ కావ్యంలోని కథ. ఈ అత్యుత్తమ కాల్పనిక గాథలో మానవుని కోరికలు పండి, కలలు నిజమై, ఒక వాస్తవ స్వరూపాన్ని సంతరించుకున్నాయి.

ఈ రకమైన అద్భుత గాథ భారతీయుల సంప్రదాయానికి సంస్కృతికి అనువైనది. పాశ్చాత్యుల అద్భుత గాథలలోకూడా, వీరరసభరితమూ, గ్రామ్య జీవన సంబంధమూ, పారదేశికమూ, అనిర్వచనీయమూ, స్వాప్నమూ, ఈ విధంగా అనేక పద్ధతులలో ఉండే గాఢానురాగాన్ని చిత్రించడం ఉంది. ఐతే వాటి అవధి మరణం మాత్రమే. దాన్ని దాటి మరణాంతర జీవితం అనేదాని దగ్గరకు అవి వెళ్ళవు. అద్భుతగాథల రచనకూడా ఆయా కాలాల భావుకత్వాన్ని దృష్టిలో ఉంచుకొని సాగుతుంది. ఒకటి రెండు జన్మల పరిధి కూడా దాటి, ప్రగాఢానురాగానికి సాఫల్యం లభించినదన్నట్లు చిత్రించడానికి తగిన భావుకత్వం భారతీయుల్లో ఉంది. పాశ్చాత్యదేశాల్లో నవలలు బయలుదేరగానే అద్భుతగాథలు చదివేవాళ్లు పూర్తిగా తగ్గిపోయారు. ఆయాకాలాలలోని పాఠకుల భావుకత్వానికి అనుగుణంగా ఆ అద్భుత గాథలు వ్రాయడమే అందులకు కారణం. ఐతే కాదంబరి మాత్రం నేటి పాఠకుల్నికూడా ఎంతగానో ఆకర్షిస్తూనే ఉంది. ఇందులో ఉండే శ్లేషవిరోధా భాసాదుల ప్రయోగాలు ఈనాటి పద్ధతికి అనుగుణం కాకపోయినా, మానవసహజమైన భావాల్ని అతిమనోహరమైన రీతిలో చిత్రించడమే ఈ గ్రంథానికి నేటికీ ఉన్న లోకప్రియత్వానికి కారణం. మార్పుచెందుతూ ఉండే పాఠకుల అభిరుచుల్ని సంతృప్తిపరుస్తూ అత్యుత్తమ కళాత్మక సృష్టులు మాత్రమే నిలువ కలుగుతాయి. అద్భుతగాథల్లో ఉండే వైశిష్ట్యం ఏమిటంటే — పాఠకుడు వీటి ప్రభావానికి పూర్తిగా లొంగిపోనైనా లొంగిపోతాడు, లేదా చదవడానికి ప్రారంభించిన మరుక్షణంలోనే విసుగుచెందుతాడు. వాస్తవికతా దృష్టితో వ్రాసిన నవలల్లో మోస్తరుగా ఇందులో పాక్షిక ప్రశంసకు అవకాశం లేదు.

అద్భుతగాథల్లో చిత్రించిన ప్రపంచం ఒక అపూర్వ కాల్పనిక ప్రపంచం అనే విషయంలో సందేహం లేదు. దుఃఖభూయిష్ఠమైన వాస్తవిక ప్రపంచంతో విసుగుచెంది, దానికి దూరంగా పోవాలనుకొన్నప్పుడు పాఠకుడు ఈ ప్రపంచంలోనికి బుద్ధిపూర్వకంగా ప్రవేశిస్తాడు. ఇది పూర్తిగా కాల్పనిక ప్రపంచమే అయినా ఇందులో అతని భావుకత్వానికి ఒక విధమైన విశ్రాంతి, ఊరట లభిస్తాయి. యంగు చెప్పినట్లుగా బహుశా అతనిలో నిగూఢంగా ఉండే కొన్ని భావాలకి సంతృప్తి లభిస్తుంది. రీన్ వెల్లెక్ (Rene Wellek) చెప్పిన మాటల అభిప్రాయంకూడా ఇదే:

"నాకు తెలిసినంతవరకూ, అద్భుతగాథలయొక్క ప్రధాన లక్షణం ఏమిటంటే — ఇందులో అనుభూతుల్ని, వాటికి అనుబంధంగా ఉండే అన్ని పరిస్థితులనుంచీ వేరుచేసి స్వతంత్ర రూపంలో చిత్రించడం జరుగుతుంది" — అని ఆయన అంటాడు.

ఇది భారతీయ సాహిత్యశాస్త్రంలో ప్రసిద్ధమైన రససిద్ధాంతానికి దగ్గరగా ఉంటుంది. "దేవతలుకూడా నివాళులు పట్టిన" ఒక విశిష్టానురాగాన్ని గూర్చి బాణుడు గానంచేశాడు. మునీశ్వరుల పవిత్రత్వంవంటి పవిత్రత్వాన్నీ, ప్రేమగాంభీర్యాన్నీ జోడించి చిత్రించడంలోనే ఉంది కాదంబరియొక్క వైశిష్ట్యం అంతా. ఇది స్వర్గలోక భూలోకాల కలయిక వంటిది. కాళిదాసు శాకుంతల నాటకంలో చేసినదికూడా ఇదే. అందుచేత, ఈ విషయంలో, బాణుడు కాళిదాసుకు సరియైన ఉజ్జీగా నిలబడతాడు. అర్ధమానుష ప్రకృతులూ, అర్ధ దైవప్రకృతులూ అయిన ఈ కావ్యాల్లోని వ్యక్తులందరూ, మనం ఉన్నచోటే మనకు ఉపదేశాలు అందజేస్తూ, మనల్ని మరొక లోకంలోకి తీసుకుపోతారు. ఇదే అద్భుతగాథలకున్న అనిర్వచనీయమైన శాశ్వత ప్రభావం. ఇది తర్కానికి లొంగేది కాదు. అద్భుతగాథ ఈ ప్రపంచాన్ని వివిధ వాంఛనీయ రూపాల్లో పునఃసృష్టిస్తుంది. మన భావనను ఆకర్షించే రీతిలో ఒక నూతన భవిష్యత్తును చూపిస్తుంది

స్థూలంగా కథకు సంబంధించినంతవరకు కాదంబరికి గుణాఢ్యుని బృహత్కథలోని సుమనసాఖ్యానం మూలం. ఇది బృహత్కథా సంస్కృతానువాదమైన సోమదేవుని (క్రీ. శ. 11 వ శతాబ్దం) కథాసరిత్సాగరంలో ఈ

విధంగా ఉంది : సుమనసుడు ఆస్థానంలో కూర్చుని ఉండగా, ఒకరోజున ముక్తాలత అనే ఒక ఆటవిక స్త్రీ శాస్త్రజ్ఞుడనే పేరుగల చిలుకను పంజరంలో ఉంచుకొని ఆతని దర్శనంకోసం వస్తుంది. ఆ చిలక గొప్పపాండిత్యాన్నీ కవితాశక్తినీ చూపిస్తుంది. దానితో ఆశ్చర్యచకితులై ఆ రాజూ మంత్రులు కూడా నీకీవిధమైన శక్తి ఎట్లు లభించిందో చెప్పమని ఆ చిలకని అడుగుతారు. చిలక కథ చెప్పడం ప్రారంభించింది :—

నేను హిమాలయోపత్యకల్లో ఉన్న ఒక చెట్టుమీద పుట్టాను. నేను పుట్టిన వెంటనే తల్లి చనిపోయింది. నన్ను తండ్రే పెంచాడు. ఒక రోజున అక్కడికి కొందరు వేటగాళ్లు వచ్చారు. మాగూళ్లు అన్నీ లాగేసి మావాళ్ళని చాలామందిని చంపేశారు. నేను నాతండ్రి రెక్కల సందుల్లో దాముకున్నాను. ఒక వేటగాడు నా తండ్రినికూడా చంపేసి క్రింద పారవేశాడు. నేను ఆకుల క్రింద దాముకొని ఏలాగో ప్రాణాలు తక్కించుకున్నాను మర్నాడు ఉదయం నేను దాహం తీర్చుకోవడానికి ఒక సరస్సువైపు వెడుతూండగా మరీచి అనే ఒక మునీశ్వరుడు నన్ను చూచి, జాలిపడి, కొంచెం నీళ్లు త్రాగించి, నన్ను తన ఆశ్రమానికి తీసుకొనిపోయాడు. నన్ను చూడగానే అక్కడున్న పులస్త్యుడనే ఒక మహర్షి చిరునవ్వు నవ్వాడు. అక్కడ ఉన్నవారంతా అందుకు కారణం అడిగారు. అప్పుడాయన నా పూర్వజన్మ వృత్తాంతాన్ని గూర్చి ఈ విధంగా చెప్పడం ప్రారంభించాడు :

(పులస్త్యుడు చెప్పిన కథ) :— రత్నాకర నగరంలో జ్యోతిష్ప్రభుడనే రాజు ఉండేవాడు. ఆయన భార్య పేరు హర్షవతి. ఆ దంపతులికి సోమప్రభుడనే కుమారుడు జన్మించాడు. అతడు పెరిగి పెద్దవాడైన తరవాత అతన్ని యువరాజుగాచేసి అమాత్య పుత్రుడైన ప్రియంకరుణ్ణి అతనికి సహచరుణ్ణిగా ఇచ్చారు. సోమప్రభుడు మనుష్యుడుగా అవతరించిన దేవతా పురుషుడు అవడంచేత, ఇంద్రుడు స్వర్గంనుంచి ఒక అశ్వాన్ని అతనికి పారితోషికంగా పంపాడు. వెంటనే ఆ రాజకుమారుడు దిగ్విజయ యాత్రకి బయల్దేరాడు. ఎంతోమంది రాజుల్ని జయించి చివరికి అతడు హిమాలయ ప్రాంతం చేరుకుని, అక్కడ వినోదం కోసం వేటకు బయలుదేరాడు. ఒక కిన్నరుణ్ణి చూసి అతన్ని తరుముకొంటూ వెళ్లాడు. ఐతే ఆ కిన్నరుడు తప్పించుకుని పారిపోయాడు. అప్పటికే ఆ రాజకుమారుడు సేనానివేశంనుంచి చాలా

దూరం వచ్చేశాడు. ఇంతలో సూర్యాస్తమయం అయింది. సేనానివేశానికి తిరిగివస్తూ అతడు దారిలో ఒక సరస్సు చూచి, ఆ రాత్రి అక్కడ గడపాలని నిశ్చయించుకున్నాడు. ఆ సరస్తీరంలో విశ్రాంతి తీసుకొంటూన్న సమయంలో అతనికొక మధురమైన సంగీత ధ్వని వినబడింది. దాన్ని అనుసరించి అన్వేషిస్తూ వెళ్ళాడు. అక్కడ శివుని ఎదట కూర్చుని గానం చేస్తూన్న ఒక దివ్యాంగన కనిపించింది. ఆమె అతనికి అతిథి మర్యాదలన్నీ చేసింది. ఆమెకు తన విషయం అంతా చెప్పి ఆమెను గూర్చిన వివరాలు అడిగాడు. ఆమె పేరు మనోరథప్రభ. ఆమె ఇలా చెప్పింది.

మనోరథప్రభ కథ :— హిమాలయ పర్వతంమీద కాంచనాభం అనే ఒక నగరం ఉంది. ఆ నగరంలో పద్మకోటుడనే విద్యాధర చక్రవర్తి నివసిస్తున్నాడు. నేను అయన కుమార్తెను. నాతల్లి పేరు హేమప్రభ. ఒక నాడు నేను చెలికత్తెతో కలిసి ఉద్యానవనంలో సంచరిస్తూండగా ఒక ముని కుమారుడు కనబడ్డాడు. అతనితో అతని సహచరుడుకూడా ఉన్నాడు. ప్రథమ దర్శనంలోనే నేనూ ఆ మునికుమారుడూ మన్మథబాణ ప్రహారానికి గురి అయినాం. ఆ ముని కుమారుడు ఎవరని నా చెలికత్తె అతని సహచరుణ్ణి అడిగింది.

మునికుమారుని మిత్రుడు ఈ విధంగా చెప్పాడు :— "సమీపంలోనే ఉన్న ఒక ఆశ్రమంలో దీధితి అనే ఒక మునీశ్వరుడు నివసిస్తున్నాడు. ఒక నాడు అతడు స్నానానికై సరస్సుకు వెళ్ళాడు. అక్కడ లక్ష్మీదేవి అతని సౌందర్యం చూసి మదనవివశురాలైంది. శారీర సంబంధం లేకపోయినా, ఆమె కొక కుమారుడు జన్మించాడు. మునీశ్వరుడు ఆ పిల్లవానికి రశ్మిమంతుడనే పేరుపెట్టి, తన పుత్రుణ్ణి పెంచినట్లుగానే పెంచాడు. ఇతడే ఆ పిల్లవాడు."

"అంతలోనే సాయంకాల భోజనం కోసం నన్ను అంతఃపురానికి పిలిచారు. నా భోజనం పూర్తి అయింది; అంతలో నా ప్రియుడైన ఆ ముని కుమారుని మిత్రుడు వచ్చి "నువ్వు వెంటనే వచ్చి రక్షించకపోతే నా మిత్రుడు విరహతాపంతో మరణించేటట్లు ఉన్నాడు" అని చెప్పాడు. నేను అతన్ని కలుసుకోవడంకోసం తొందరగా వెళ్ళాను. అప్పటికే చంద్రోదయ సమయంలో, అతడు ప్రాణాలు కోల్పోయాడు. నేనుకూడా అతని చితిమీద పడి మరణించాలని అనుకున్నాను. ఐతే ఎవరో ఒక దివ్యపురుషుడు స్వర్గం

నుంచి దిగివచ్చి ఆతని మృతకళేబరాన్ని తీసుకుపోయాడు. 'నీకు మళ్ళీ ఆతని సమాగమం కాబోతుంది అందుచేత మరణించవద్దు'' అని ఒక దివ్య వాణి చెప్పింది. అప్పటినుంచీ నేను శివారాధన చేస్తూ, ఆతని పునఃసమా గమం కోసం ఎదురుచూస్తూన్నాను. ఈలోగా అతని మిత్రుడు ఎక్కడికి పోయాడో నాకు తెలియదు.''

ఈకథ అంతా విని సోమప్రభుడు ''నీ చెలికత్తె ఎక్కడ ఉన్నది'' అని అడిగాడు. దానికి ఆమె ఈవిధంగా సమాధానం చెప్పింది. ''సింహ విక్రముడనే ఒక విద్యాధర చక్రవర్తి ఉన్నాడు. ఆయన కుమార్తె, మకరం దిక నాకు ప్రాణస్నేహితురాలు. నాకు కలిగిన ఈ ఆపదకు ఆమె చాలా దుఃఖించి తాను వివాహం చేసుకోనని ప్రతిజ్ఞ చేసింది. నా పరిస్థితులు తెలుసు కోవడం కోసం ఆమె ఒక వార్తాహరుణ్ణి పంపింది. ఆమెను ఓదార్చడానికి నా చెలికత్తెనుకూడా ఆ వార్తాహరునితో పంపించాను. అందుచేతనే ప్రస్తుతం నేను వంటరిగా ఉంటున్నాను.''

ఇంతలో ఆమె చెలికత్తెకూడా వచ్చింది. మరునాడు వార్తాహరుడైన ఒక విద్యాధర కుమారుడు వచ్చి, వివాహమాడడానికి మకరందికను ఒప్పిం చడంకోసం తనతోకూడా రావలసిందని మనోరథ ప్రభను ప్రార్థించాడు. ఆమె వెళ్ళడానికి సిద్ధమౌతున్న సమయంలో సోమప్రభుడు, తనకు ఆ విద్యా ధర నగరం చూడాలనీ అభిలాష ఉన్నట్లుగా సూచించాడు. ఆమె సంతోష పూర్వకంగా అతనిని తనవెంట తీసుకొని వెళ్ళింది. మకరందికా సోమప్రభులు పరస్పరమూ ప్రేమించుకొంటారు. వ్యర్థమైన ప్రతిజ్ఞ విడిచిపెట్టి వివాహ మాడవలసిందిగా మకరందికకి నచ్చచెప్పి మనోరథ ప్రభ వాళ్ళ వివాహం కుదిర్చింది.

''నేను హఠాత్తుగా మాయం ఐపోయినందుకు నా పరివారం అంతా కంగారుపడుతూ ఉంటారు; అందుచేత సేనానివేశానికి వెళ్ళి, వాళ్ళని కుదటపరచి మకరందికను వివాహమాడడానికి తిరిగి వస్తాను'' అని చెప్పి, సోమప్రభుడు సేనానివేశం చేరుకుని జరిగినదంతా ప్రియంకరుడికి చెప్పాడు. అప్పుడే ఒక వార్తాహరుడు వచ్చి సోమప్రభుణ్ణి తిరిగి రావలసిం దిగా ఆజ్ఞాపిస్తూ తండ్రి పంపిన సందేశాన్ని అందజేశాడు. శీఘ్రంగానే తిరిగి వస్తానని చెప్పి అతడు ఇంటికి వెళ్ళాడు. ఈ వార్త మకరందికకికూడా అంద

చేశాడు. ఐతే ఆమె విరహవ్యథతో భరింపరాని బాధపడడం చూసి విసుగు చెందిన ఆమె తండ్రి "భూలోకంలో ఆటవికుల మధ్య జనింతువుగాక" అని శపించాడు. కాని తాను చేసిన పనికి పశ్చాత్తాపపడి, అతడూ, ఆతనితో పాటు భార్యకూడా మరణించారు. మొదట ఆతడు ఒక మునీశ్వరుడుగాను, తరువాత చిలుకగాను జన్మ ఎత్తాడు. ఆతని భార్య అరణ్యవరాహంగా జన్మ ఎత్తింది. చిలకకి పూర్వజన్మల్లో జరిగినదంతా జ్ఞాపకం ఉంటుంది.

పులస్త్యుడు ఈ విధంగా కథ అంతా చెప్పి ఇంకా ఇలా అన్నాడు: "ఈచిలక ఈకథ అంతా మళ్లీ రాజాస్థానంలో చెప్పినట్లైతే ఈ జన్మ చాలిస్తుంది. సోమప్రభుడూ, ప్రస్తుతం ఆటవిక స్త్రీగా ఉన్న మకరందికాకూడా కలుసుకుంటారు. అలాగే మనోరథప్రభా, ప్రస్తుతం రాజుగా జన్మఎత్తిన రశ్మివంతుడూకూడా కలుసుకుంటారు."

చిలక ఇంకా ఈ విధంగా చెప్పింది — "మునీశ్వరుడు చెప్పిన కథ వినగానే నాకు పూర్వజన్మస్మృతి లభించింది. కొంతకాలం మరీచి ముని నన్ను పెంచాడు. రెక్కలు బాగా పెరగగానే నేను స్వేచ్ఛగా ఎగరడం మొదలు పెట్టాను. ఒకనాడు ఆటవికుల చేతిలో పట్టుబడ్డాను. నన్ను ఇప్పుడు నీవద్దకు తీసుకువచ్చారు."

ఈ కథ అంతావిని సుమనస్సుకూడా చాలా సంతోషించాడు. సోమప్రభుడు చేసిన పూజకు సంతోషించి, శివుడు - 'సుమనస్సు ఆస్థానానికి వెళ్లు; నీ ప్రియురాలు అక్కడ ముక్తాలత అనేపేరుతో ఆటవిక స్త్రీరూపంలో ఉంది. చిలకగా అయిన ఆమె తండ్రికూడా పంజరంలో ఆమె దగ్గరనే ఉన్నాడు" అని చెపుతాడు. వాళ్ళకి మళ్ళీపూర్వరూపాలు లభిస్తాయి. అదే విధంగా శివుడు "నీ ప్రియుడైన రశ్మిమంతుడు ఇప్పుడు సుమనస్సుగా ఉన్నాడు ఆతనివద్దకు వెళ్లు" అని మనోరథప్రభను కూడా ఆజ్ఞాపించాడు. వాళ్లుకూడా తమతమ పూర్వరూపాల్లో మళ్లీ కలుసుకున్నారు. ఈ విధంగా అంతా ఆనందమయంగా ముగిసింది.

బాణుని కావ్యంలోని ప్రధానకథా స్వరూపం తెలియాలంటే, పైకథలో ఉన్న పేర్లకు బదులు బాణుడు ఏపేర్లు ఉపయోగించాడో చూడాలి:-

| మూలకథ | | కాదంబరి |
|---|---|---|
| 1. కాంచనపురి | .... | విదిశ |
| 2. సుమనసుడు (నాయకుడు) | .... | శూద్రకుడు (చంద్రాపీడుడు) |
| 3. ముక్తాలత | .... | చండాల కన్య |
| 4. శాస్త్రజ్ఞుడు (చిలుక) | .... | వైశంపాయనుడు (పుండరీకుడు) |
| 5. మరీచి (ముని) | .... | హారీతుడు |
| 6. పౌలస్త్యుడు | .... | జాబాలి |
| 7. రత్నాకరపురం | .... | ఉజ్జయిని |
| 8. జ్యోతిష్ప్రభుడు | .... | తారాపీడుడు |
| 9, హర్షవతి | ... | విలాసవతి |
| 10. సోమప్రభుడు | .... | చంద్రాపీడుడు |
| 11. ప్రభాకరుడు | ... | శుకనాసుడు |
| 12. ప్రియంకరుడు | ... | వైశంపాయనుడు |
| 13. ఆశుశ్రవము (అశ్వము) | .... | ఇంద్రాయుధము |
| 14. పద్మకూటము | .... | హంస |
| 15. హేమప్రభ | .... | గౌరి |
| 16. మనోరథప్రభ | .... | మహాశ్వేత |
| 17. దీధితిమత్ | .... | శ్వేతకూటము |
| 13. రశ్మిమంతుడు | .... | పుండరీకుడు |
| 19. సింహవిక్రముడు | .... | చిత్రరథుడు |
| 20. మకరందిక | .... | కాదంబరి |
| 21. దేవజయుడు | .... | కేయూరకుడు |

ఈ కావ్యం పూర్తికాకముందే బాణభట్టు కాలధర్మం చెందాడన్న విషయం మనం గుర్తు ఉంచుకోవాలి. చంద్రాపీడుని తాంబూలకరంకవాహిని యైన పత్రలేఖ, తన ముందు కాదంబరి ఏవిధంగా తన విరహవ్యథ అంతా వెళ్ళబోసుకుందో వర్ణించి చెపుతూ, చంద్రాపీడుణ్ణి తీసుకురావడానికై అనుజ్ఞ ఇమ్మనే ఘట్టం దగ్గర సగంలో ఆగిపోయింది బాణుడి రచన. బాణుడు నడిపించినంతవరకూ మనుష్యుల పేర్లల్లోనూ, స్థానాలపేర్లల్లోనూ కొన్ని మార్పులు తప్ప కథలో ఏమీ మార్పులు లేవు. కథా సూత్రాలన్నీ దూర

దూరంగానే పడి ఉన్నాయి. వీటి నన్నింటినీ ఒక దగ్గరికి చేర్చి బాణుడు ఏవిధంగా ముడివేయదలచాడో మనకు తెలియదు. ఈ కథనంతనీ పూర్తి చేసింది బాణుని కుమారుడు. ఇతడు మూలకథలో చాలా మార్పులు చేశాడు. ఈ మార్పులన్నీ బాణుడికి అభిమతములా కావా అనేది చెప్పడానికి శక్యం కాని విషయం. మూలకథలో చండాలకన్యకయైన ముక్తాలతయే కథానాయిక; చిలుక ఆమె తండ్రి. బాణుని కుమారుని ప్రకారం ఆమె లక్ష్మీదేవి; చిలుకగా మారిపోయిన పుండరీకుని తల్లి, కాదంబరీ మహాశ్వేతలు మొదటినుంచి చివరి దాకా మూలకథానుసారంగానే ఉన్నారు. కాదంబరిలో కపింజలుడు ఇంద్రాయుధంగా మారాడు. చంద్రుని భార్య, రోహిణి, పత్రలేఖారూపంలో భూలోకానికి వచ్చింది. అలాగే పుండరీకుని తల్లి, లక్ష్మి, చండాల కన్యక అయింది. కాదంబరి కథకు కొంత స్వాభావికత్వం కల్పించడం కోసం మూలంలో ఉన్న అలౌకిక కథాంశాలు కొన్ని తీసివేయడం జరిగింది.

కథా నాయిక కాదంబరి. ఈమె పేరే ఈ అద్భుతగాథకుకూడా పెట్టడం జరిగింది. పవిత్ర ప్రేమభావంతో ఎన్నో కష్టాలు సహించి, ఈమె చివరికి చంద్రాపీడుణ్ణి వివాహమాడుతుంది. కాదంబరీ చంద్రాపీడుల ప్రేమ గాథకీ, మహాశ్వేతా పుండరీకుల ప్రేమగాథకీ, చాలా దగ్గర సంబంధం ఉంది. ఈ కావ్యం ఇద్దరు నాయకుల జీవితగాథలతోటీ ప్రేమగాథలతోటీ సంబంధించి ఉంది. ఇద్దరు నాయకులూకూడా రెండేసి జన్మలు ఎత్తారు.

1. చంద్రుడు — మొదటి జన్మ : చంద్రాపీడుడు
రెండవ జన్మ : శూద్రకుడు

2. పుండరీకుడు—మొదటి జన్మ : వైశంపాయనుడు
రెండవ జన్మ : చిలుక

కథా మధ్యంలో మరికొన్ని కథలు చొప్పించడం భారతీయ కథా కథనంలోని వైశిష్ట్యం. పంచతంత్రంలోని ఈ విధానం సర్వవిదితమే. దేవదత్తుడు చెప్పిన కథ యజ్ఞదత్తుడు చెప్పగా విని విష్ణుమిత్రుడు చైత్రుడికి చెప్పినట్లుగా మైత్రుడు చెపుతాడు. ఈ విధంగా నడుస్తుంది కథాకథనం. చివరికి మొదట ప్రారంభించిన అసలు కథకు చేరుకోవడం జరుగుతుంది. ఇలాంటి కథాకథన విధానంలో ఒక సౌకర్యం ఉంది. సాధారణంగా ఈ

కథలన్నీ ప్రధాన కథలో ఉన్న పాత్రలు చెపుతూ ఉంటారు. ఈ కథలకి పరస్పర సంబంధం ఏదీ ఉండదు. ఏదో ఒక లోకోక్తి చెప్పడం, దానితో, ఆలోకోక్తికి సంబంధించిన కథ ఉదాహరణరూపంలో చెప్పడమూ జరుగుతూ ఉంటుంది. ఇదే ఈ కథలన్నింటినీ బంధించే సూత్రం. ఐతే బాణభట్టూ, కాదంబరీ మూలకథా రచయితాకూడా ఒక క్రొత్తపద్ధతి ప్రవేశపెట్టారు. ప్రధాన కథలోని నాయకులూ, రెండవ కథలోని నాయకులూ కూడా వేరు వేరు జన్మల్లో ఉన్న సమానవ్యక్తులే అవడంచేత కథావస్తువులో ఒక విధమైన ఏకత్వం లభించింది. ఐతే ఈ విధమైన కథాసంవిధానంవల్ల మామూలు పాఠకుడు విక్షిప్తచిత్తుడు అవడానికి ఎక్కువ అవకాశం ఏర్పడింది. శూద్రకుని కథ మధ్యలో చిలక వచ్చి కొంతదూరం వరకూ తన కథ చెప్పడం ప్రారంభిస్తుంది. జాబాలి చంద్రాపీడ వైశంపాయనుల కథ ప్రారంభించి చెప్తూతూ వాళ్ళ ఘనకార్యాలూ, మహాశ్వేత పుండరీకుల ప్రణయవృత్తాంతమూ, కాదంబరీ చంద్రాపీడుల ప్రణయవృత్తాంతమూ, వాళ్ళ ప్రేమ వ్యవహారాల్లో దైవవశంచేత వచ్చిన అడ్డంకులూ, ఇవన్నీ వర్ణిస్తాడు. బాణుడు చెప్పిన కథ హఠాత్తుగా మధ్యలో ఆగిపోయినా, సమాంతరంగా నడిచిన రెండు ప్రేమగాథలను చిత్రించడంలో ఆతడు చూపిన నేర్పే చాలు పఠితల హృదయాలను ఆకర్షించడానికి. ఆతని కుమారుడు పూర్తిచేసిన కథ కథా దృష్టిలో చదివే పాఠకులకు సంతృప్తి కలిగించవచ్చు. కాని ఆధునిక పాఠకునికి కావలసింది ఈ కాల్పనిక కథకాదు; ఆతనికి కావలసినదల్లా భావనోత్తేజకంగా ఉండే ప్రకృతిని పృష్ఠభూమిగా చిత్రించి, అద్భుత కల్పనలనే విచిత్రసుందరవేషంలో చేసిన మధుర భావవ్యంజనం. కాదంబరీ మహాశ్వేతలూ, వారి పవిత్ర నిష్కలంక ప్రేమా, ఆ ప్రేమకోసం మృత్యువును కూడా ఎదిరించి వారు పడిన కష్టాలూ, ఇవన్నీ మనకెప్పుడూ మరవరానివై మన మనస్సుల్లో ఎల్లప్పుడూ మెదులుతూనే ఉంటాయి.

కథలో కథను ఇమడ్చడంచేత ఏర్పడిన చిక్కు విడదీసి సులభ పద్ధతిలో సంగ్రహంగా చెప్పాలంటే కాదంబరీ కథ ఈ విధంగా ఉంటుంది.

శ్వేతకేతు పనే ఒక దివ్యర్షి స్వర్గభూముల్లో నివసిస్తూ ఉండేవాడు. ఆయనకి లక్ష్మియందు జనించిన కుమారుడు పుండరీకుడు. ఆతనికి కపింజలు డనే ఒక ప్రియమిత్రుడు ఉండేవాడు. వాళ్ళిద్దరూ వేదశాస్త్రాభ్యాసం చేసి

పవిత్రమైన బ్రహ్మచర్యాశ్రమ జీవితం గడుపుతూ ఉంటారు. ఒకనాడు వాళ్ళిద్దరూ అచ్ఛోద సరస్సు అనే ఒక పవిత్రమైన సరస్సుకు వెళ్ళారు.

గంధర్వులు దేవతా గణానికి సంబంధించినవారు; చంద్రకిరణ, సంజాతులు. ఈ గంధర్వుల్లో రెండు వంశాలు ఉన్నాయి. వాటిలో ఒక వంశానికి చెందిన గంధర్వులకు చిత్రరథుడు రాజు. అతని భార్య గౌరి. వారికి కాదంబరి అనే కుమార్తె ఉండేది. రెండవ వంశానికి చెందిన గంధర్వుల రాజు హంసుడు. అతని కుమార్తె పేరు మహాశ్వేత.

పుండరీకుడు మిత్రుడితో కలిసి వెళ్ళిన రోజునే మహాశ్వేత కూడా, తల్లివెంట, ఆ ప్రాంతంలో ఉన్న శివాలయంలో శివుణ్ణి ఆరాధించడానికి, అచ్ఛోదసరస్తీరానికి వెళ్ళింది. ఒకరినొకరు చూడుకోగానే మహాశ్వేతా పుండరీకులు అనురాగవశంవదు లౌతారు. ఇంతలో పూజ పూర్తిచేసుకొని తల్లి వెళ్ళిపోవడంవల్ల మహాశ్వేతకూడా ఇంటికి వెళ్ళవలసి వచ్చింది. ఈలాంటి యౌవన చాపలం మంచిదికాదని కపింజలుడు పుండరీకుడికి ఎంతగానో ఉపదేశించాడు కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది. పుండరీకుడు ప్రేమోన్మాదంతో ప్రమాదకరమైన పరిస్థితిలో పడి ఉన్మత్తుడువలె ఏవేవో మాటలాడడం ప్రారంభించాడు.

అంతకుపూర్వం కపింజలుడు మహాశ్వేత స్నేహితురాలి ద్వారా ఆమె నివాసస్థానాన్ని గూర్చి తెలుసుకొని ఉన్నాడు. అందుచేత వెంటనే హేమకూటానికి వెళ్ళి మహాశ్వేతకు తన మిత్రుని అవస్థగూర్చి తెలియచేసి, వెంటనే వచ్చి అతని ప్రాణాలు కాపాడవలసిందిగా ఆమెను వేడుకున్నాడు. మహాశ్వేతకూడా అంత విరహబాధా పడుతూనే ఉంది. అందుచేత వెంటనే వెళ్ళి పుండరీకుణ్ణి కలుసుకోవాలని నిశ్చయించుకుంది. కాని, ఆమె అక్కడికి చేరే సరికే పుండరీకుడు ప్రాణాలు విడిచాడు. అతని మరణానికి ఆమె విలపిస్తూండగానే ఎవరో ఒక దివ్యపురుషుడు పుండరీకుని శరీరం తీసుకొనిపోతూ కనిపించాడు. వెంటనే కపింజలుడు అతన్ని వెంబడించాడు.

విరహబాధ సహించలేని పరిస్థితిలో పుండరీకుడు అప్పుడే ఉదయిస్తూన్న చంద్రుణ్ణి చూచి, నువ్వుకూడా భూలోకంలో జన్మించి అనేక జన్మల్లో విరహవ్యథ అనుభవించెదవు కాక అని శపించాడు. చంద్రుడుకూడా పుండరీకుణ్ణి అదేవిధంగా శపించాడు. ఐతే, తన వంశానికి చెందిన మహాశ్వేతమీద

ప్రేమచేత పుండరీకుడు ఇట్టి ఉన్మాదావస్థలో ఉన్నాడని తెలిసిన తరువాత చంద్రుడు పశ్చాత్తాపపడి, పుండరీకుని శరీరం పాడైపోకుండా కాపాడాలని నిశ్చయించుకుంటాడు. అందుచేత తన లోకంలో ఆ శరీరాన్ని కాపాడ డానికి, దాన్ని తీసుకుపోవడం కోసం స్వయంగా వచ్చి – "నువ్వు మళ్లీ పుండరీకుణ్ణి కలుసుకుంటావు; దుఃఖావేశంలో ఆత్మహత్య చేసుకోవద్దు" అని మహాశ్వేతను ఓదారుస్తాడు. అప్పటినుంచీ, మహాశ్వేత పాశుపత యోగినీ వేషం ధరించి ఆ సరస్తీరాన ఉన్న ఉద్యానంలో, ఒక గుహలో నివసిస్తూ ఉంటుంది.

ఈ విషయాలన్నీ చంద్రుడి ద్వారా తెలిసిన తరవాత, కపింజలుడు, దుఃఖాక్రాంతుడై, ఏమి చేయాలో తోచక ఆకాశమార్గంలో సంచరిస్తూ, ప్రమాదవశంచేత ఒక దేవతా పురుషుని మార్గానికి అడ్డం వెడతాడు. "కళ్లెం లేని గుఱ్ఱంవలె స్వేచ్ఛగా సంచరిస్తూ నా మార్గానికి అడ్డువచ్చావు. కాబట్టి గుఱ్ఱంగా పుడతావు" అని ఆ దేవతాపురుషుడు శపించాడు. తత్ఫలితంగా అతడు సముద్రంలో పడిపోయి ఒక విచిత్రమైన అశ్వంగా బైటికి వచ్చాడు. ఆ అశ్వాన్ని పర్శియాదేశపు రాజు పట్టుకున్నాడు.

చంద్రుడు, ఉజ్జయినీ రాజైన తారాపీడుడి కుమారుడైన చంద్రాపీడు డుగా జన్మించాడు. పుండరీకుడు వైశంపాయనుడనే పేరుతో తారాపీడుని ప్రధాన మంత్రియైన శుకనాసుడి కుమారుడుగా జన్మించాడు. పర్శియాదేశ రాజు తనకు లభించిన ఆ అశ్వాన్ని తారాపీడుడికి పారితోషికంగా పంపిం చాడు. దానికి ఇంద్రాయుధం అని పేరుపెట్టారు. చంద్రుడు మనుష్య రూపంతో భూలోకంలో పుట్టడం చూసి అతని భార్యల్లో ప్రధానురాలైన రోహిణి పత్రలేఖ అనేపేరుతో కులూత రాజకుమారిగా జన్మించింది.

చంద్రాపీడ వైశంపాయనుల విద్యాభ్యాసం పూర్తి అయిపోవడంతోటే తారాపీడుడు చంద్రాపీడుణ్ణి యువరాజుగా చేసి అతనికి ఇంద్రాయుధాన్ని బహూకరించాడు. అప్పటికే కులూతదేశరాజు పత్రలేఖను తారాపీడుని భార్యకు ఉపాయనంగా పంపి ఉండడంచేత, ఆమె, ఆ రాజకుమారిని చంద్రాపీడుడికి తాంబూలకరంకవాహినిగా నియమించి అతనివద్దకు పంపించింది.

చంద్రాపీడుడు రాజులందర్నీ జయించి తన సార్వభౌమత్వం స్థాపించుకోవడం కోసం విజయయాత్రకి బయలుదేరాడు. ఆ యాత్ర పూర్తిచేసుకొని, పత్రలేఖా వైశంపాయనాదులతో సువర్ణపురంలో విడిసిఉంటాడు. ఒకనాడు ఇంద్రాయుధం ఎక్కి ఒంటరిగా వేటకోసం బయలుదేరి, అరణ్యంలో చాలా లోపలికి వెళ్ళిపోయాడు. అక్కడ అశ్వముఖులైన కిన్నరుల జంట ఒకటి అతని కంటబడింది. వాళ్ళని పట్టుకోవడంకోసం తరుముకొని వెళ్ళాడు. చాలాదూరం వెళ్ళిన తరవాత వాళ్లు హటాత్తుగా ఎత్తైన పర్వతశిఖరంపైకి ఎక్కివేశారు. అప్పటికి చంద్రాపీడుడు చాలాదూరం వచ్చి ఉండడంచేత, తిరిగి వెళ్ళి తన నివేశం చేరుకోవడానికి తగిన మార్గం తెలుసుకునే పరిస్థితిలోలేడు. దప్పికకూడా చాలా ఎక్కువగా ఉన్నది. పానీయంకోసం వెతుక్కుంటూ వెళ్ళగా అచ్ఛోదసరస్సు అనే సరస్సు కనబడింది. అక్కడ తపస్సు చేసుకుంటూన్న మహాశ్వేతకూడా కనబడింది. ఆమె ఈతనికి అతిథిమర్యాదలు చేసింది. అంత లేతవయస్సులోనే తపస్సు చేయడానికి కారణం ఏమిటని చంద్రాపీడుడు ప్రశ్నించగా, మహాశ్వేత, అందుకు కారణం అంతా ఆతనికి తెలియచేసింది.

మహాశ్వేత ఈవిధంగా, తాపసజీవనాన్ని గడుపుతూండడం చూసి, ఆ ద్వితీయ గంధర్వ రాజకన్య, కాదంబరి, తన స్నేహితురాలైన మహాశ్వేత మళ్లీ తన ప్రియుణ్ణి చేరేవరకూ తానుకూడా వివాహం చేసుకోనని నిర్ణయం చేసుకుంది. ఐతే, ఆమె తలిదండ్రులకు ఇది నచ్చలేదు. వివాహమాడటానికి ఏదో విధంగా కాదంబరికి నచ్చచెప్పవలసిందిగా మహాశ్వేతని కోరారు. అందుచేత మహాశ్వేత కాదంబరితో మాటలాడడానికి హేమకూటం వెళ్ళబోతూ, చంద్రాపీడుడికి హేమకూట దర్శన కుతూహలం ఉన్నట్లుగా తెలుసుకొని, ఆతనినికూడా తనతో తీసుకువెళ్ళింది. అక్కడ ప్రథమ దర్శనంలోనే కాదంబరీ చంద్రాపీడుల హృదయాల్లో పరస్పరానురాగం అంకురించింది. చంద్రాపీడుడు అక్కడ కొంచెం కాలం మాత్రమే ఉండి తన సేనానివేశానికి బయలుదేరాడు. ఇంతలో ఆతని పరివారంకూడా అతనిని వెతుక్కుంటూ వచ్చి అచ్ఛోద సరస్తీరం చేరుకున్నారు.

చంద్రాపీడుడు వెళ్ళిపోయినప్పటినుంచీ, విరహవేదనతో బాధపడుతూన్న కాదంబరి పరిస్థితి విషమించింది. అందుచేత వెంటనే హేమకూటానికి

రావలసిందిగా చంద్రాపీడుణ్ణి కోరుతూ, కాదంబరి తలిదండ్రులు కేయూరకుడు అనే ఒక గంధర్వకుమారుణ్ణి పంపారు. ఈమాటు హేమకూటానికి వెళ్ళినప్పుడు చంద్రాపీడుడు పత్రలేఖనుకూడా తీసుకువెళ్ళాడు. కొద్దిరోజులు అక్కడ ఉండి చంద్రాపీడుడు తిరిగి వెళ్ళబోతుండగా, పత్రలేఖను తన వద్ద ఉంచి వెళ్ళవలసిందిగా కాదంబరి కోరింది. ఆమె కోరిక ప్రకారం పత్రలేఖను అక్కడ విడచి, చంద్రాపీడుడు అచ్ఛోదసరస్తీరం చేరుకున్నాడు.

ఇంతలో, వెంటనే ఉజ్జయినికి రావలసిందిగా చంద్రాపీడుడి తండ్రి నుంచి ఆదేశం వచ్చింది. పత్రలేఖను జాగర్తగా తీసుకురావలసిందిగా సేనానాయకుణ్ణి ఆదేశించి, మొత్తం పరివారం అంతనీ వైశంపాయనుని సంరక్షణలో ఉంచి, చంద్రాపీడుడు వెంటనే ఉజ్జయినికి వెళ్ళాడు.

చంద్రాపీడుడు ఉజ్జయినిలో తలితండ్రుల్ని కలుసుకున్నాడు. తనకు వివాహం చెయ్యడానికై వారు ప్రయత్నిస్తున్నట్లు తెలిసింది. ఇంతలో సేనానాయకుని రక్షణలో పత్రలేఖ తిరిగి వచ్చింది. చంద్రాపీడుడు వెళ్ళిపోయింది మొదలు కాదంబరి విరహవ్యథతో ఏవిధంగా బాధపడుతున్నదో వర్ణించి చెప్పింది.

బాణుడు వ్రాసిన కథ ఈ ఘట్టంలో ఆగిపోయింది. మిగిలిన కథ అంతా ఆతని కుమారుడైన భూషణుడు (ఈతనికే పులిందుడనికూడా పేరు) వ్రాసినది.

కొద్దిరోజుల్లోనే, కాదంబరియొక్క విషమపరిస్థితి చంద్రాపీడుడికి తెలియపర్చడంకోసం కేయూరకుణ్ణికూడా ఉజ్జయినికి పంపించారు. తన సేన రాజధానికి తిరిగి రావలసి ఉండడంచేత దాని రాకకోసం ఎదురుచూస్తూన్న చంద్రాపీడుడు వెంటనే హేమకూటానికి వెళ్ళలేకపోయాడు. ఇంతలో సేన తిరిగివస్తూన్నట్లు వార్తలు వచ్చాయి. వైశంపాయనుణ్ణీ, సైన్యాన్నీ కలుసుకోవడానికి చాలా ఉత్కంఠతో చంద్రాపీడుడు బయలుదేరాడు. సైన్యంతో పాటు వైశంపాయనుడు రాలేదు. సైనికులు వైశంపాయనుణ్ణి గూర్చిన ఒక విషాదపూర్ణమైన గాథ చెప్పారు.

గృహానికి ప్రయాణం అయేముందు వైశంపాయనుడు సైనికులందరినీ, అచ్ఛోద సరస్సులో స్నానంచేసి శివునికి పూజలు చేసుకోవలసిందిగా ఆజ్ఞా

ించాడు. ఆ సరస్సు సమీపించాడో లేదో – అతడు పూర్తిగా పిచ్చివాడువలె అయిపోయాడు. ఏదో పోగొట్టుకొన్న వస్తువు గుర్తుకు వచ్చినట్లు ప్రవర్తిస్తూ అతడు ఆస్థలం విడిచి రావడానికి నిరాకరించాడు. ఎవరు ఎంత ప్రతిమాలినా వినలేదు. చివరికి చేసేది ఏమీలేక, అతని యోగక్షేమాలు చూస్తూ ఉండడం కోసం కొందరు పరిచారకుల్ని అక్కడఉంచి, సైన్యం తిరిగి రావలసివచ్చింది.

వైశంపాయనుడు మహాశ్వేత నివసిస్తూన్న ఆశ్రమానికి వెళ్ళాడు. తాను పూర్వజన్మలో పుండరీకుడుగా ఉన్నప్పుడు ఆమెపై తనకున్న అనురాగాన్నిగూర్చి అతని మనస్సులో ఏవేవో అస్పష్టభావాలు బయలుదేరాయి. వాటితో తన అనురాగాన్ని ఆమెకు ప్రకటించాడు. అతనిపూర్వజన్మ విషయాలేమీ తెలియకపోవడంచేత మహాశ్వేత కోపించి, చిలుకవు అవుదువు గాక అని అతన్ని శపించింది. వెంటనే వైశంపాయనుడు మృతుడై నేలమీద పడిపోయాడు.

వైశంపాయనుడికి స్వయంగా బోధించి తిరిగి తీసుకురావాలనే అభిప్రాయంతో, చంద్రాపీడుడు వెంటనే బయలుదేరి అచ్ఛోద సరస్సుకు వెళ్ళాడు. ఐతే అక్కడ వైశంపాయను డెక్కడా కనబడలేదు. అతని విషయం మహాశ్వేత కేమైనా తెలిసి ఉండవచ్చుననే ఉద్దేశంతో మహాశ్వేత దగ్గరకు వెళ్ళాడు. వైశంపాయనుడికి సంబంధించిన విషాదకరమైన ఆ సంఘటన అంతా ఆమె చంద్రాపీడుడికి చెప్పింది. ఈ భయంకరమైన ఉదంతం వినగానే హృదయం విదీర్ణమై చంద్రాపీడుడు మరణించాడు. ఈ రెండవ విషాదమయ సంఘటనతో మహాశ్వేత చాలా విషణ్ణురాలైంది. చంద్రాపీడుడితో వెళ్ళిన వారందరూ విషాదాక్రాంతు లయ్యారు.

ఈలోగా చంద్రాపీడుడు హేమకూటానికి రానున్నాడనే విషయం పత్రలేఖ ద్వారా తెలుసుకొని, కాదంబరి అతన్ని మార్గమధ్యంలో కలవాలనే అభిప్రాయంతో అచ్ఛోద సరస్సు చేరుకుంది. అక్కడ చంద్రాపీడుడికి బదులు అతని మృతకళేబరం చూసింది. "చంద్రాపీడుడి శరీరాన్ని సురక్షితంగా కాపాడుతూ ఉండండి. అచిరకాలంలోనే ఇతడు పునరుజ్జీవితు డౌతాడు; కాదంబరి అతన్ని కలుసుకుంటుంది" అని అంటూ, ఇప్పుడుకూడా, ఒక అశరీర దివ్యవాణి వినబడింది. మహాశ్వేతవలె కాదంబరికూడా తాపస జీవనం గడుపుతూ, చంద్రాపీడుని శరీరం కాపాడుతూ ఉంది.

చంద్రాపీడుని రాకకోసం ఉజ్జయినిలో, అత్యుత్కంఠతో ఎదురు చూస్తూన్న తారాపీడుడు, కొన్నిరోజులు గడచిపోవడంతో కంగారుపడుతూ, కుమారాన్వేషణం కోసం బయలుదేరాడు. రాణీ, మంత్రీ కూడా ఆయనతో పాటు వెళ్ళారు. ఆ సరస్సు చేరగానే వారికి ఆ విషాదగాథ అంతా తెలిసింది. కొంతకాలం తరవాత పరిస్థితులన్నీ చక్కబడగలవనే విషయంకూడా తెలియడంచేత, ఆతడు మంచిరోజుకోసం ఎదురుచూస్తూ, ఆ సమీపంలోనేఉన్న ఆశ్రమంలో నివసించాడు.

కాదంబరితోపాటు అక్కడికి వచ్చిన పత్రలేఖ చంద్రాపీడుడు మరణించడం చూసి, ఇంద్రాయుధంతో సహా అచ్ఛోద సరస్సులోకి దూకింది. కపింజలుడు ఆ సరస్సులోనుంచి బైటకువచ్చి, పుండరీకుడు చంద్రుణ్ణి శపించిన వృత్తాంతాన్నీ, చంద్రుడు తిరిగి పుండరీకుణ్ణి శపించిన వృత్తాంతాన్నీ, తాను శాపంచేత ఇంద్రాయుధంగా మారిపోయిన వృత్తాంతాన్నీ వాళ్ళకి చెప్పి, ఈ విషయాలన్నీ స్వర్గంలో ఉన్న, పుండరీకుని తండ్రి, శ్వేతకేతువుకు తెలియపర్చడానికై వెళ్ళిపోయాడు.

ఆ చంద్రాపీడుడే విదిశారాజైన శూద్రకుడుగా జన్మించాడు. వైశంపాయనుడు, వింధ్యారణ్యంలో ఉన్న జాబాల్యాశ్రమ ప్రాంతంలో చిలకగా పుట్టాడు. తలిదండ్రుల్ని కోల్పోయిన ఆ చిలుకని మునీశ్వరుడు పెంచాడు. ఆ చిలుక ఒకనాడు, ఒక వేటగాని చేతిలో చిక్కింది. అతడు దాన్ని పంజరంలో బంధించాడు. శాపకాల పూర్తి అయేవరకూ, అది ఆవిధంగానే ఉండిపోయింది. పుండరీకుని తల్లియైన లక్ష్మి ఆ వేటగాని కుమార్తెగా జన్మించింది. శాపకాలం పూర్తి అయేవరకూ ఆ చిలుకని జాగర్తగా పెంచి, తరువాత శూద్రక మహారాజు దగ్గరికి తీసుకువెళ్ళింది. కాదంబరీ ప్రియుడైన చంద్రుడు నీవే అని శూద్రకుడికి చెప్పి, లక్ష్మి స్వర్గలోకానికి వెళ్ళిపోయింది.

తనకూ కాదంబరికీ ఉన్న సంబంధం ఆ రాజుకుకూడా గుర్తుకు వచ్చింది. ఇంకా చిలుక రూపంలోనే ఉన్న వైశంపాయనుడికికూడా తన పూర్వ జన్మలన్నీ స్మృతిపథానికి వచ్చాయి. పురాజన్మ ప్రేమగాథలు స్మృతికి రావడంతో, రాజూ, చిలకాకూడా విరహబాధ సహించలేక మరణిస్తారు. తత్క్షణమే అచ్ఛోద సరస్తీరంలో ఉన్న చంద్రాపీడుని శరీరమూ, చంద్రలోకంలో ఉన్న పుండరీకుని శరీరమూ పునరుజ్జీవితము లయాయి. వెంటనే

పుండరీకుడూ, కపింజలుడూ వచ్చి సరస్సుదగ్గర చంద్రాపీడుణ్ణి కలుసు కున్నారు. వాళ్లిద్దరూ పునరుజ్జీవితులవడం చూసి తారాపీడాదులు అమితా నందం పొందారు. కాదంబరీ మహాశ్వేతల తలిదండ్రులుకూడా పరమానం దంతో అక్కడికి వచ్చారు. మహాశ్వేతా పుండరీకులికీ, కాదంబరీ చంద్రాపీడు లికీ వివాహాలు జరిగాయి. చంద్రాపీడుడు ఉజ్జయినికి రాజయ్యాడు. పుండరీకుడు అతనికి మంత్రి అయ్యాడు. చంద్రాపీడుడు ఇష్టం వచ్చినప్పుడల్లా కొంత కాలం ఉజ్జయినిలోను కొంతకాలం హేమకూటంలోనూ, కొంతకాలం చంద్రలోకంలోనూ గడుపుతూ ఉండేవాడు ఈవిధంగా వారందరూ మళ్లీ కలిసి చాలాకాలం సుఖంగా ఉన్నారు. కాదంబరి, చంద్రలోకంలో రోహిణిగాఉన్న పత్రలేఖను కలుసుకొని సంతోషించింది.

ఇది— ఎన్నో శతాబ్దాలపాటు భారతీయ పాఠకుల్ని ఆనందపర వశుల్నిగా చేసిన కాదంబరియొక్క సంక్షిప్త కథ. ఈ మూలగ్రంథంలో శుష్కంగా ఉండే కథతోపోల్చి చూస్తే బాణుడు కూర్చిన కథ ఎంతో మాన వీయతతో కూడిందిగానూ, రసభరితంగానూ కనిపిస్తుంది. సాధారణంగా జానపదగాథల్లో ఉండే విషయాలన్నీ ఈ కథాసంవిధానంలో ఉన్నాయి. దేవతలూ, దేవయోనులైన గంధర్వాదులూ, మానవులూ, మునులూ, దేవ ర్షులూ - వీళ్లు ఇందులోని పాత్రలు. మానవలోకంవాళ్ళకీ, దేవభూముల్లో నివసించేవాళ్ళకీ మధ్య నిరాఘాటంగా రాకపోకలు ఉన్నాయి. భూలోకంలో ఎంత కథ జరిగిందో అంత కథ కాదంబరీ నివాసమైన దేవభూమిలోనూ, ఈ రెండు ప్రాంతాలకీ మధ్య ఉండి, రెండు ప్రాంతాలవారికీ అందుబాటులో ఉన్న అచ్ఛోద సరస్తీరంలోనూకూడా జరిగింది.

కథా సంవిధానం అంతా, నాయికానాయకులు రెండు మూడు జన్మ లెత్తి తమ పూర్వజన్మ ప్రేమ వృత్తాంతాన్ని స్మరించడం అనే దానిమీద ఆధారపడి ఉన్నది. ఇది సాధారణంగా హిందువుల ఇతిహాసాల్లో కనబడే ప్రధాన విషయం. దీన్ని గ్రహించి, కథాగమనం చక్కగా జరిగి చివరికి సుఖమయంగా అవడానికి మంచి చాతుర్యంతో ఉపయోగించుకొన్నాడు కవి.

జానపద వాఙ్మయంలోవలెనే ఇందులోకూడా పశుపక్ష్యాదులు మను ష్యులవలె ప్రవర్తిస్తాయి. చిలకలు మాటలాడతాయి; కథలు చెపుతాయి. ప్రకృతికూడా సజీవమై మానవులకుండే భావావేశాల్ని చూపిస్తుంది. మానవులకీ

దేవయోనులకి సంబంధించిన ఈ అద్భుతగాథలో, మొక్కలూ, లతలూ, చంద్రుడూ, నక్షత్రాలూ, వాయువూ, ఇవన్నీకూడా చైతన్యంగల వ్యక్తులుగా పాల్గొంటాయి సర్వజ్ఞులైన మునీశ్వరులుకూడా మనకు ఇందులో కనిపిస్తారు. వీళ్లు తమ దగ్గరికి వచ్చినవాళ్ల భూతభవిష్యద్వర్తమానాలుగూర్చి చెప్ప కలుగుతారు. ఐతే కొన్ని నియమాలకి కట్టుబడి ఉండడంచేత ఈజ్ఞానాన్ని ఐహిక ప్రయోజనాలకోసం ఉపయోగించుకొనరు.

అమోఘమైన మునీశ్వరుల శాపం ఈ పునర్జన్మలకు కారణం. శాపం ఇవ్వడం అనేది భారతీయుల గాథల్లోనూ, జానపదగాథల్లోనూ సర్వసాధారణంగా కనిపించే విషయం. కాదంబరిలో ఈ శాపవృత్తాంతాన్ని, ప్రధాన పాత్రల భాగ్యం అనేక విధాల మార్పుచెందడంలో ఉన్న కీలకంగా ఉపయోగించుకోవడం జరిగింది. శాపానికి విపరీతం వరం. దీన్ని దివ్యవాణులద్వారా ఇవ్వడం జరిగింది. ఇలాంటి దివ్యవాణులే వినబడకపోతే కాదంబరీ మహాశ్వేతలు మృతిచెందిన తమ ప్రియులతో సహగమనం చేసి ఉండేవారు.

సంక్షేపంగా చెప్పాలంటే, అద్భుతగాథా ప్రపంచం ఒక ఊహాకల్పితమైన ప్రపంచం. దాని నియమాలు దానివే. మామూలు ప్రపంచంలోఉన్న నియమాలతో దానికి పనిలేదు. అదొక స్వతఃపరిపూర్ణ ప్రపంచం. పాఠకుల మనస్సుని కొన్ని నిగూఢానుభూతులమీద కేంద్రీకరించడంకోసం, మామూలు అనుభవాల్ని దూరంగా ఉంచి, నిగూఢానుభూతుల్నే అతిశయోక్తులతో చిత్రించి, ఈ నూతన ప్రకాశంలో వెలిగే నూతన వ్యక్తుల్ని సృజించడం జరుగుతుంది ఈ నూతన ప్రపంచంలో. ఇది సంభావ్యము, ఇది అసంభావ్యము అని మామూలుప్రపంచంలో ఉన్న విభాగానికి ఈ ప్రపంచంలో ఉన్న విభాగానికీ ఏమీ సంబంధం ఉండదు. అద్భుతగాథ చదువుతూన్నంతసేపూ పాఠకుడు ఆ స్వప్నప్రపంచంలో లీనమైపోవాలి. ఇందులో ఉండే జీవిత విధానమే వేరు ఒకదానితో ఒకటి అల్లుకుపోయే కథాపరంపరని మంత్రదండంతో సృష్టించినట్లుగా సృష్టించి, క్రొత్త అనుభూతుల్ని ఆవిష్కరించడం జరుగుతుంది ఈ ప్రపంచంలో. ఈ అనుభూతులికీ, నిస్సారమైన సాధారణ ప్రపంచానుభూతులికీ ఏమీ పోలికలు ఉండవు. చాలా కథల్ని ఒకదానితో ఒకటి అల్లి చెప్పడంతో, అనేక వాద్యధ్వనుల్ని ఒక లయమీద నడిపించినట్లు ఉంటుంది. ఒక వ్యక్తి ఎదురుగావచ్చి, నేను ఇలాచేశాను, అలా చేశాను అని

అంటూ, 'నేను' 'నా' లతో కథ చెపుతూంటే, ఆ కథలో చెప్పిన ఊహా ప్రపంచంతో తనకుకూడా ఏదో భాగం ఉన్నట్లు పాఠకుడు భావించడానికి ఎక్కువ అవకాశం ఉంది.

ఈ రోజుల్లో, అద్భుతగాథ అనే సాహిత్యప్రక్రియ పాతబడిపోయిం దనే విషయం మనం గుర్తు ఉంచుకోవాలి కాని యువకుల గాఢానురాగాన్నీ కన్యకల ముగ్ధచేష్టా భావాదుల్నీ, సుఖదుఃఖాలలోనూ, ఆశానిరాశల్లోనూ ఎప్పటికప్పుడు మార్పుచెందుతున్న వాళ్ళ భావాల శబలత్వాన్ని లోతుగా గమనించి, చక్కగా చిత్రించడంలో బాణుడు చూపించిన నైపుణ్యాన్ని చూచిన తరువాత మనం ఆతనిని అభినందించకుండా ఉండలేము. అసలు ఈ కావ్యంలో ఉండే వైశిష్ట్యం అంతా ఇదే. ఈ కావ్యంలో నాయికలైన కాదంబరీ మహాశ్వేతల చరిత్రాన్ని చక్కగా చిత్రించడం విషయంలో బాణుడు చాలావరకు సాఫల్యం పొందాడు. నూతనంగా అంకురించిన మానసోత్కంఠకూ, కుమార్తెగా తలిదండ్రుల విషయంలో ఉన్న తన కర్తవ్యానికీ బాధ కలగకుండా చూచుకొంటూ కాదంబరి పోషించుకున్న ముగ్ధప్రణయభావాన్నీ అచ్ఛోదసరస్తీరంలో తన ప్రియునికోసం సంవత్సరాలతరబడి నిరీక్షిస్తూ, విరహబాధా పీడితురాలైన మహాశ్వేతయొక్క కరుణరసభరితమైన పాతివ్రత్యాన్నీ, ఒకదానిప్రక్క ఒకటి చిత్రించి, చాలాచక్కగా చూపించాడు బాణభట్టు. ఇతడు తన భావనాబలంతో సృష్టించి, మోయలేనన్ని అలంకారాలతో అలంకరించిన పిల్లలు ఈ కన్యకలు. వీరిద్వారా బాణుడు ప్రేమ విషయంలో తనకున్న ఆదర్శాత్మకమైన భావాలన్నీ స్పష్టంగా ప్రకటించాడు. నాయికలుగా వాళ్ళిద్దరూ ఒక అద్భుతమైన కోవకు చెందినవారు. ఐనప్పటికీ వాళ్ళకి భిన్నభిన్నమైన వ్యక్తిత్వం లేకపోలేదు. వాళ్ళలో ఉన్న ఈ వైయక్తిక వైశిష్ట్యాన్నికూడా అతి సూక్ష్మంగా చిత్రించాడు బాణుడు."
(S. K. De, 'The Prose Kavyas', Kane Festschrift. Poona, P. 139.)

కాదంబరీ చరిత్ర చిత్రణంలో బాణుడు చూపిన నైపుణ్యాన్ని ప్రశంసిస్తూ పీటర్సన్ వ్రాసిన వాక్యాలు ఉదాహరణ యోగ్యాలైనవి:—

"ప్రధానంగా కాదంబరిని చిత్రించడంలో, బాణుడు తనకున్న సూక్ష్మదృష్టి వైభవాన్నీ, మానసిక కల్పనా పరిపుష్టినీ, సానుభూతి చూపగల హృదయ వైశాల్యాన్నీ పూర్తిగా వినియో

గించాడు. ఆమె చూపులు తొలిసారిగా చంద్రాపీడుడిపై పడి ఆతనిమీద నిలిచింది మొదలు—లజ్జానురాగాలూ, ఆశా నిరాశలూ, జననీ జనకుల విషయంలో తన కర్తవ్యమూ, క్రొత్తగా అంకురించిన ఈ ఉత్కంఠా, ప్రపంచం నిందిస్తుందేమో అనే భయమూ, తన ప్రేమకి ఈ ప్రపంచాన్నంతనీ బలి ఇచ్చినా నష్టంలేదనే ఒకనిర్ణయమూ – ఒక దానితో ఒకటి పోటీపడుతూ బయలుదేరుతూన్న ఈ విరుద్ధభావాలలో సతమతమైపోతూన్న ఆ కన్యాహృదయముయొక్క చిత్రం పాఠకుణ్ణి పూర్తిగా ఆకర్షిస్తుంది. "కాదంబరీ రసం ఆస్వాదించి ఈ ప్రపంచం అంతా మత్తెక్కి ఉంది "(కాదమ్బరీరసభరేణ సమస్త ఏవమత్తో న కించి దపి చేతయతే జనోఽయమ్." కాదంబరి ఉ. భా. శ్లో. 7). కాదంబరిని ఇంత ఆలస్యంగా ప్రవేశపెట్టడం కావ్యకథానిర్మాణంలోని ఒక దోషం. ఐతే, ఒకమాటు ప్రవేశించిన తరువాత చివరివరకూ కూడా, కథ ఎన్ని మళుపులు తిరిగినా, అన్నింటిలోనూ ఆమె తన ప్రధానస్థానం నిలబెట్టుకుంది."

కాదంబరీ చిత్రణం కంటె మహాశ్వేతా చిత్రణమే చాలా బాగున్నదని కొందరు విమర్శకులు భావించవచ్చు. నిజమే; మహాశ్వేత ప్రథమస్థానం కోసం కాదంబరితో పోటీపడుతున్నట్లు కనబడుతుంది. ఆమె తేజస్సునూ, పవిత్రత్వాన్నీ బాణుడు ఎంత విస్తృతంగా వర్ణించాడంటే — ఆమెయొక్క ముద్ర మన మనఃఫలకం మీదనుంచి ఎన్నటికీ చెరిగిపోకుండా ఉండేటట్లు వర్ణించాడు. నిష్కలంకములూ, అతిపవిత్రములూ అయిన ప్రకృతిలోని పదార్థాలన్నింటినీ ఉపమానాలుగా చూపించి, ఉజ్జ్వలమైన ఆమె శరీరాన్నీ, ఉజ్జ్వలతరమైన ఆమె చరిత్రాన్నీ కూడా చక్కగా చిత్రించాడు కవి. ఈ వర్ణనకంతకీ ముకుటాయమైన విశేషణం 'మహాశ్వేత' (తెల్లవాటిలో కల్లా గొప్పది) అనేది. పుండరీకుని మరణానికి ఆమె అనుభవించిన తీవ్రమైన శోకాన్నీ, ఆమె గడపిన నిష్కలంక పవిత్ర తాపస జీవితాన్నీ బాణుడు అతి సుకుమారంగా వర్ణించాడు.

కాదంబరీ మహాశ్వేతలు, సంస్కృత వాఙ్మయం మనకు అందచేసిన అమర మూర్తుల ప్రతినిధులు. వారి ప్రియులు మూడు జన్మలెత్తినా, సుదీర్ఘ కాలం స్థిరంగా నిలచిన వారిప్రేమవంటి ప్రేమ ప్రపంచ వాఙ్మయంలో ఎక్కడా మనకు లభించదు. వారిప్రేమ ఎంత నిష్కలంకమైనదో అంత ప్రగాఢమైనది; ఎంత పవిత్రమైనదో అంత తీవ్రమైనది. దేవతల ఆశీర్వాదాన్నీ, మహామునుల ఆమోదాన్నీ సంపాదించుకున్న ప్రేమ ఇది. మృత్యు శల్యాన్నికూడా అనాయాసంగా పెరికివేయకలిగిన ప్రేమ. ఇది హృదయోల్లాస జనకం మాత్రమే కాదు. మానసికోన్నతి సంపాదకం కూడా. ఇలాంటి అద్భుతప్రేమ చిత్రణం బాణుని అనంత ప్రతిభా సంపదకు ఒక నిదర్శనం.

పురుష పాత్రలుకూడా ఆదర్శవ్యక్తులే. చంద్రాపీడుడు యుద్ధరంగంలో ఎంతటి మహావీరుడో ప్రేమ విషయంలోకూడా అంతటి అసాధారణ లాలిత్యం గల ఆదర్శభూతుడైన నాయకుడు. అతని సహచరుడైన వైశంపాయనుడు ప్రేమోన్మాదానికీ, వివేకరహితంగా ప్రవర్తించిన ప్రేమ ఎలాంటి ఆపదలు తెచ్చిపెడుతుందో తెలుసుకోవడానికీ, చక్కని ఉదాహరణం. పుండరీకుడి మిత్రుడు కపింజలుడు, స్నేహంకోసం ఎంతటి త్యాగమైనా చేయడానికి సిద్ధంగా ఉండే ఆదర్శమిత్రుడికి ఉదాహరణం. శుకనాసుడు ఒక ఆదర్శ మంత్రి. ఒక్క వాక్యంలో చెప్పాలంటే నిర్మలమైన ఈ అద్భుత గాథలో చిత్రించిన పురుషుల్లోకాని, స్త్రీలల్లోకాని, లవలేశమైనా, నీచత్వంగాని దుష్టత్వంగాని ఉన్నవ్యక్తి ఎవ్వరూ లేరు. వాళ్ళ జీవితపరమలక్ష్యం స్నేహానురాగాలు. వీటికోసమే వాళ్లు జీవించిందికూడా. ఈ స్నేహానురాగాలు అనేవి ఎన్ని కష్టాలుపడైనా సాధించవలసిన ఉత్తమాదర్శాలు అనే ఉపదేశాన్ని ఈ కావ్యం మానవుడికి, ధ్వనిమూలంగా అందచేస్తూన్నది.

కథకన్నా, పాత్రలకన్నా కూడా గొప్పది బాణుడు ఈ కావ్యంలో ప్రారంభంనుంచి చివరివరకూ చూపించిన కవితాశక్తి. మానవ హృదయాంతరాళాల్లో ఉండే నిగూఢ భావస్రోతస్సులు బాగా తెలిసినవాడు బాణుడు. వాటిని భావనాబలంతో అందంగా స్పష్టంగా విశదపర్చి చూపించకలిగిన శక్తికూడా ఇతనికి ఉంది. ఇది నవలల్లోనూ నాటకాల్లోనూ కనబడే సామాన్యమైన ప్రేమ కాదు. ఇతర సంస్కృత మహాకావ్యాల్లో కనబడే ప్రేమకూడా కాదు. ఇది దేశకాలావధుల్నీ, మృత్యు ప్రతీఘాతాన్నీ కూడా

అతిక్రమించకలిగిన ప్రేమ. క్షణక్షణానికీ పరిణతి చెందుతూ ఉండే వివిధావస్థలలో, వివిధ ఛ్చాయలలో కనబడేదీ, తీవ్రమూ, సుకుమారమూ అయిన అనురాగాన్ని విరహదుఃఖ మరణాలచేత నిష్కలంకమైనదాన్నిగానూ, అత్యున్నతమైనదాన్నిగానూ చేసి, నిశ్చలమైన ఆశా విశ్వాసాలతో సముల్లసింపచేసి, స్థిరమైన అత్యున్నతాదర్శంగా చూపించడం జరిగింది. ఇలాంటి లోకోత్తర ప్రేమ చిత్రణం చేయడంలో, బాణుడికి భాషాపరిపుష్టి, అలంకార బహులమైన రచనా విధానమూ కూడా మంచి అనుగుణమైన సాధనాలుగా ఉపయోగించాయి.

కాదంబరిని చూడగానే చంద్రాపీడుడికి కలిగిన ప్రేమను బాణుడు వర్ణించిన విధానం శృంగార రస చిత్రణ విషయంలో అత్యుత్తమమైన ఉదాహరణ అని సంస్కృతాలంకారిక మూర్ధన్యుడైన ఆనందవర్ధనుడు అన్నాడు. ఆ భాగానికి అనువాదం ఇది:—

"ఆ కాదంబరీ ముఖచంద్రలక్ష్మిని చూడగానే రాజకుమారుని హృదయం సాగరజలంవలె ఉల్లసించింది. అతడు ఇలా అనుకున్నాడు. "బ్రహ్మదేవుడు నా ఇతరేంద్రియాల్ని కూడా నేత్రాలుగా మారుస్తే ఎంత బాగుండేది! ఏ విధమైన అభ్యంతరమూ లేకుండా ఈమెను ఈ విధంగా చూడకలిగినందుకు నా నేత్రాలు ఎంత తపస్సు చేశాయో! రమణీయ వస్తువులన్నిటికీ ఏకైక నివాసంగా ఈమెను సృష్టించాడు బ్రహ్మ. ఎంత ఆశ్చర్యం! ఈ రూపాతిశయపరమాణువుల్ని అతడు ఎక్కడ ప్రోగుచేశాడో! బ్రహ్మ ఈమెను సృష్టిస్తూన్నప్పుడు కరతల స్పర్శ క్లేశానికి నేత్రద్వంద్వం నుంచి రాలిన కన్నీటి బిందువులనుంచే ఈ ప్రపంచంలోని పద్మాలు మొదలైనవి పుట్టి ఉండాలి..." కాదంబరిని చూడగానే కంగారుపడినా, చంద్రాపీడుడు కాదంబరీలోచన ప్రభాధవళితుడై, ఆ సమయంలో పర్వతంలా నిలబడ్డాడు. అతన్ని చూడగానే కాదంబరికి కూడా ఒళ్ళు గగుర్పొడిచింది. అలంకారాలు గలగలలాడాయి. ఆమె కూర్చున్న చోటునుంచి లేచింది. స్వేదోద్గమం

కుసుమాయుధుని మూలాన్నే కలిగింది; కాని తొందరగా లేవడం ఒక వంక అయింది. కంపంచేత అడుగులు తడబడ్డాయి; నింద మాత్రం నూపురాల ధ్వనికి చుట్టుప్రక్కలనుంచి వచ్చిన హంసల నెత్తిమీద కొట్టుకుపోయింది. నిఃశ్వాసాలు దీర్ఘంగా బయలుదేరడంతో ఉత్తరీయాంశుకం కదిలింది; కాని వింజామరల గాలి కారణం అన్నట్లు కనిపించింది. హృదయంలో ప్రవేశించిన చంద్రాపీడుణ్ణి స్పృశించడంకోసమే అరిచేయి హృదయాన్ని తాకింది; ఐతే వక్షాన్ని కప్పుకోవడం కోసం అన్నట్లు అభినయించడం జరిగింది.''

అప్పుడే అంకురిస్తూన్న ముగ్ధనాయికా ప్రణయ చిహ్నాల్ని హృదయంగమంగా చిత్రించడానికి, కవి, ఇక్కడ, వరసగా కొన్ని అపహ్నుత్యలంకారాలు ఉపయోగించాడు. ఏర్చి కూర్చిన పదాలతో, రసానుగుణమైన లయబద్ధ గమనంతో, బాణుని గద్య అజ్ఞాతధామాల్లోంచి మందమందంగా ప్రవహిస్తూన్న మధుర సంగీతధ్వనివలె మనకు అపూర్వానుభూతుల్ని అందచేస్తుంది.

ఆనందానుభూతి కలిగించడమే కాకుండా, లోకజ్ఞాన సంపాదనమూ, పుణ్యసంపాదనమూకూడా కావ్యప్రయోజనాలుగా పరిగణింపబడతాయి. ఈ విషయాలకికూడా కాదంబరిలో ప్రాధాన్యం ఇవ్వడం ప్రశంసార్హం. నీతి వాక్యాలవలె ఉండే లఘువాక్యాలు, దాదాపు, పేరా విడిచి పేరాలో, మనకు లభిసాయి. ఇలాంటి వాక్యాలు ఏరి చదివినట్లైతే జీవిత పరమార్థాన్ని గూర్చి బాణునికి ఉన్న అభిప్రాయం స్పష్టం అవుతుంది. ఇవి అక్కడక్కడ ఏరిన కొన్ని వాక్యాలు :—

హర్ష చరితం :

1. ఆప్తమిత్రుల వియోగం అతిభయంకరమైనది. అంపం కోతవలె హృదయంలో చీలిక ఏర్పరుస్తుంది.
2. మహాత్ముల వినయసంపద అక్షయమైనది.
3. త్యాగబుద్ధికి ఉన్న శక్తి చాలా గొప్పది; ఇది మనఃక్లేశాలన్నీ ఉపశమింప చేస్తుంది.

4. మూఢాత్ముల మనస్సులు సత్యానికి ఎదుట నిలబడటానికి సంకోచిస్తాయి.
5. అనిత్యత్వం అనేది చాలా వేగంగా ప్రవహించే నది.
6. కోపావిష్టుడు కళ్లున్నా గ్రుడ్డివాడే.
7. సుకుమారమైన హృదయాన్ని చిన్నదెబ్బ ఐనా గాయపరుస్తుంది.
8. అల్పుల బుద్ధికి దూరదృష్టి ఉండదు.
9. వినయం అనేది సత్పురుషుల హృదయాల్ని బంధించే, లోహమయం కాని, శృంఖల.
10. బలవంతునికి వినయమే నిజమైన అలంకారం. రత్నాదులన్నీ బరువు చేటు.
11. ప్రేమకు ప్రయోజనాపేక్ష ఉండదు.
12. క్షమించ కలగడం సకలతపస్సులకీ మూలం.
13. స్వామిభక్తుడు ఎంతటి సాహసానికైనా వెనుదీయడు.
14. ముందు మెరుపు వచ్చి తరవాత పిడుగుపడ్డట్లుగా, దైవం ముందు అనుకూలంగా ఉన్నట్లు కనిపించి తరవాత దెబ్బ తీస్తుంది.
15. స్నేహబంధం సంకెళ్ళకంటె కూడా దృఢమైనది.
16. ఆత్మాభిమానం కలవాళ్ళకి జానిపతనం దుర్భరమైనది.
17. వీరులు కీర్తినే శాశ్వతమైన శరీరంగా భావిస్తారు.
18. మధురభాషణం అనేది సత్పురుషులకు జన్మసిద్ధము.
19. 'దుఃఖం' అనేది పీడించుకొని తినే పిశాచానికి మరొక పేరు.
20. మహాపురుషులు రెండుమాట్లు మాట్లాడరు.

కాదంబరి:—

1. మహాత్ముల ప్రభావం మన ఊహలకి అందనిది.
2 తాను అనుభవించినదాన్ని గూర్చి తనకే సందేహం ఏమిటి?
3. శుద్ధమైన స్ఫటికంలో సూర్యకిరణాలు ప్రవేశించినట్లుగా పెద్దల ఉపదేశాలు నిర్మలమైన మనస్సుల్లో అనాయాసంగా ప్రవేశిస్తాయి.

4. మునీశ్వరుల విషయంలో భక్తి ఊరికే పోదు.
5. ఎవడుచేసిన కర్మఫలం వాడే అనుభవించాలి.
6. చందనపు కట్టలోనుంచి పుడితేమాత్రం అగ్ని కాల్చకుండా ఉంటుందా?
7. దైవం చంచలస్వభావం కలది.
8. మహాత్ముల సంగం దుఃఖంతో క్రుంగిపోయినవారికికూడా ఊరట కలిగిస్తుంది.
9. ధైర్యవంతులు మాత్రమే దుఃఖాన్ని దాటకలుగుతారు.
10. ఎంత గొప్పవాడైనా విధి నిర్ణయాన్ని మార్చలేడు.
11. ఐశ్వర్యం సత్పురుషుల కనుసన్నల్లో మెసులుతుంది
12. దైవం బలవత్తర మైనదే.
13. తన ప్రాణాలు ఒడ్డైనా మిత్రుని ప్రాణాలు రక్షించాలి.
14. మన్మథుడు ముందుగా లజ్జని దహిస్తాడు; తరవాత హృదయాన్ని.
15. ప్రపంచంలో మానవుల ప్రవృత్తి రకరకాలుగా ఉంటుంది.
16. లోకులు, అతిగా మాట్లాడేవాళ్ళ మాటలు నమ్మరు.
17. మానహీనమైన జీవనంకంటె మరణం మేలు.
18. సుఖాలైనా దుఃఖాలైనా వరసగా వస్తూంటాయి.
19. యౌవనం మలినంకాకుండా ఉండడం చాలా అరుదు.
20. స్వల్ప పరిచయంకూడా గాఢమైత్రికి దారితీయవచ్చు

ఈ వాక్యాల్ని వాటి సందర్భాలనుంచి వేరుచేసి చదువుతే ఏవో కాపీ పుస్తకాల్లో ఉండే మామూలు వాక్యాలవలె కనబడవచ్చు. వీటి అర్థగాంభీర్యమూ, వైశిష్ట్యమూ తెలియాలంటే ఈ వాక్యాలు వాడిన ప్రకరణాలు చదవాలి. బాణుడు చేసిన నీతిబోధకు ఉదాహరణగా విద్యాభ్యాసం పూర్తి చేసుకుని వచ్చిన చంద్రాపీడుడికి, మంత్రి, శుకనాసుడు చేసిన ఉపదేశం చూపించివచ్చు.

''నిజంగా, యౌవనంవల్ల కలిగే తమస్సు చాల దట్టమైనది. దీన్ని సూర్యకిరణాలు భేదించజాలవు; రత్నకాంతులు ఛేదించజాలవు; దీపకాంతులు తొలగింపజాలవు. లక్ష్మీమదం

చాలా దారుణమైనది. ముసలితనంలో కూడా ఇది శాంతించదు. ఐశ్వర్యం అనే తిమిరరోగంవల్ల పుట్టిన అంధత్వం ఏ అంజనానికీ తగ్గేది కాదు. గర్వం అనే తీవ్రజ్వరంవల్ల ఏర్పడిన వేడి తగ్గించడానికి ఏ శిశిరోపచారాలూ పనికి రావు. భోగాలనే విషం తినడం చేత వచ్చిన మోహాన్ని తొలగించడానికి ఔషధాలు కాని, మంత్రాలు కాని లేవు...గురూపదేశం అనేది నీళ్లులేని స్నానం; అన్ని మలాల్నీ పోగొట్టుతుంది. ఇది జుట్టు నెరవడం వంటి వైరూప్యాన్ని కలిగించనిదీ, ముసలితనం కానిదీ అయిన వృద్ధత్వం. కొవ్వు పెంచకుండా గురుత్వం కలిగిస్తుంది. ఇది సువర్ణమయం కాని అమూల్యకర్ణాభరణం. దీపం కాని వెలుతురు. ఉలికిపాటు కలిగించని మేల్కొలుపు. రాజులికి గురూపదేశం ఎంతైనా అవసరం. ఎందుచేతనంటే వాళ్ళకి ఉపదేశంచేసే వాళ్లు చాలా తక్కువగా ఉంటారు.''

మధురమైన రసభావాదుల్ని అభివ్యక్తీకరించడంలో బాణుడికి ఎంత నేర్పు ఉన్నదో, ప్రకృతికి సంబంధించిన వైవిధ్యాన్ని చిత్రించడంలోకూడా అంత చాతుర్యం ఉంది. వనవృక్షాదుల్నీ, నదీ సరోవరాదుల్నీ, సూర్యోదయాస్తమయ సమయాల సౌందర్యాన్నీ, సూర్యచంద్ర నక్షత్రాదుల్నీ, పశుపక్ష్యాది జంతువుల్నీ, దేవతల్నీ, దేవతాస్త్రీలనీ, అతి విస్తృతంగా అత్యున్నత స్థాయిలో బాణుడివలె వర్ణించగల కవి కాళిదాసుతప్ప, మరెవరూ లౌకిక సంస్కృత వాఙ్మయంలో లేరని చెప్పవచ్చు. కొందరు పండితకవుల చేతుల్లో ఈ వర్ణనలన్నీ చాలావరకు ఒకే పద్ధతిలో నియమబద్ధాలై పోయాయి. కాని బాణభట్టు ప్రతీ ఒక్క వర్ణనలోనూ ఒక క్రొత్త భావకత్వాన్ని ప్రకటించాడు. కాళిదాసు ఒక చిన్న సమాసంలోకాని, వాక్యంలో కాని కుదించి చెప్పేవిషయాన్నే వర్ణించాలంటే బాణునికి ఒక పేజీ కావాలి. ఐతే, ఇందుకోసం ఎంతో మానసిక శ్రమ చేస్తున్నాడని కాని, చుట్టుతిరుగుళ్లు తిరుగుతున్నాడని కాని మనకు అనిపించదు. చెట్టుకాని, పక్షికాని, మృగం కాని — బాణుడి దృష్టిలో పడని సూక్ష్మప్రవృత్తి గల విశేషం గలది ఏదీ ఈ ప్రపంచంలో లేదు.

బాణుడుచేసిన అచ్ఛోదసరోవర్ణనం నుంచి ఒక ఉదాహరణం:—

"చంద్రాపీడుడు నీటికోసం నాల్గువైపులా చూస్తూ కొంత సేపు అటూ ఇటూ తిరిగాడు. చివరికి, అంతక్రితమే ఏదో పద్మ సరస్సులో స్నానంచేసి బయటికి వచ్చిన పర్వత ప్రాంతంలో సంచరించే వనగజయూథం అటువైపు వెళ్ళడంచేత, వాటి కాళ్ళతోవచ్చిన బురదతో తడిసిన ఒక మార్గం ఆతని కంట పడింది. దాన్నిపట్టి ఆ ప్రాంతంలో జలం లభిస్తుందని ఊహించు కొని చంద్రాపీడుడు కైలాస పర్వత పార్శ్వం గుండా కొంత దూరం ముందుకు వెళ్ళాడు. అక్కడ అత్యధిక సంఖ్యలో ఉన్న సరళ-సాల-సల్లకీ వృక్షాలు దగ్గరదగ్గరగానే ఉన్నా, కొమ్మలు చాలా తక్కువగా ఉండడంచేత దూరదూరంగా ఉన్నట్లు కని పిస్తున్నాయి. ఆ వృక్షాలన్నీ చాలా ఎత్తుగా పెరిగి పైన గొడుగు లల్లా విస్తరించి ఉన్నాయి. వాటిని చూడాలంటే తల పైకెత్తి చూడాలి. ఆ ప్రాంతం అంతా పసుపు పచ్చని ఇసగ దట్టంగా ఉంది. మట్టి శిలామయంగా ఉండడంచేత గడ్డీ మొక్కలూ కూడా చాలా పల్చగా ఉన్నాయి.

చివరికి, కైలాసానికి ఉత్తరప్రాంతంలో, అతనికి బాగా ఎత్తైన ఒక వృక్ష సముదాయం కనిపించింది. అది, జలభారంతో వంగిన మేఘ సముదాయమా అన్నట్లు, ఒకచోట పోగుపడిన కృష్ణపక్షాంధకారమా అన్నట్లు ఉంది. జలతరంగాల మీదనుంచి వస్తూ చందన స్పర్శవలె చల్లగా ఉన్న మందమారుతం పుష్ప సుగంధాన్ని నలుమూలలా వ్యాపింపచేస్తూ ఆతనిని కౌగలించు కొంటున్నదా అన్నట్లు అనిపించింది. కమల మధుపానం చేసి మత్తెక్కిన కలహంసలు మధుర కూజితాలతో ఆహ్వానిస్తు న్నాయా అన్నట్లు ఉన్నాయి. అతడాతరుషండంలోనికి ప్రవేశించి

దాని మధ్య అచ్ఛోదసరస్సు చూచాడు. అది, త్రైలోక్య లక్ష్మి యొక్క మణిదర్పణమూ, భూదేవి యొక్క స్ఫాటికమణిగృహమూ, సముద్రజలం ఎక్కువై పోయినపుడు తప్పించుకుపోయి ప్రవహించే మార్గమూ, దిక్కుల్ని పిండి తీసిన నీరూ, జలాకారంలో ఆకాశం యొక్క అవతారమూ, కైలాసపర్వతద్రవమూ, కరిగిపోయిన హిమాలయమూ, నీరుగా మారిన వెన్నెలా, జలరూపం దాల్చిన ఈశ్వరాట్టహాసమూ, సరోరూపంలో ఉన్న త్రిభువన పుణ్య రాశియూ అన్నట్లు ఉంది. అతి స్వచ్ఛంగా ఉండడంచేత, దీన్ని మునీశ్వరుల మనస్సులతోటీ, సజ్జనుల గుణాలతోటీ, హరిణ లోచన కాంతులతోటీ, ముక్తాఫల కిరణాలతోటీ, నిర్మించారా అని అనిపిస్తూన్నది.''

భావావేశ పూరితమైన బాణుని ప్రతిభ భూమినుంచి స్వర్గం దాకా ఏవిధంగా విహరిస్తుందో చూపించడానికి ఇది ఒక చక్కని ఉదాహరణం. సంస్కృత గద్య వాఙ్మయ చరిత్రలో సూక్ష్మ నిరీక్షణ శక్తిలోనూ, చిత్రణ వైశిష్ట్యంలోనూ బాణుడికి బాణుడే సాటి. ఆకాశపథంలో విహరించే అతని ఊహలు మన అభిరుచికి అనువుగా ఉండకపోవచ్చు. ఐతే, ఇవి బాణుని కాలంలోని వాళ్ళ అభిరుచికి అనుగుణంగా ఉండేవి. మనం ఈనాడు ఊహా గానాలనీ, అభూత కల్పనలనీ అనుకునే వాటినే ఆ రోజుల్లో కవుల ప్రతిభకు గీటురాయి అని అనుకునేవారు.

ప్రాచీన పాశ్చాత్య సాహిత్య విమర్శకులవలెనే, భారతీయాలంకారికులు కూడా వర్ణ్యవస్తువును స్పష్టంగా చిత్రించకలిగిన భావనాశక్తికి ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. ఇంగ్లాండులో బెన్ జాన్సన్ ద్వారా ఎక్కువ పొగడ్తలు పొందిన 'కవితా చిత్రనిర్మాణం' అంటే ఇదే. 'కవిత్వం అంటే మాటలాడే ఆలేఖ్యం; ఆలేఖ్యం అంటే మూకకవిత్వం' అని ప్లూటార్కుని గూర్చి చెప్పినది ఎంతైనా బాగుంది. ఎందుచేతనంటే, క్రొత్త విషయాలు కనిపెట్టడం, భావన చేయడం, ఎన్నో పద్ధతులు ఏర్పాటు చేసుకోవడం, కనిపెట్టిన వాటిని అన్నింటినీ ప్రకృతికి అనుగుణంగా ఉండేటట్లు మలుచుకోవడం, ఇవన్నీ ఈ

రెండింటిలోనూ సమంగానే ఉంటాయి. ఐనాకూడా, ఈ రెండింటిలో పెన్సిలు కంటె కలమే ఉత్తమమైనది. ఎందుచేతనంటే పెన్సిలు ఇంద్రియాలను మాత్రమే ప్రభావితం చేయకలిగితే కలం బుద్ధిని ప్రభావితం చేస్తుంది.” (G. Sainsbury, Loci Critici. Ginn and Company, Boston, 1903. P. 114) బాణుని సాహిత్య కళ విషయంలో ఇది నూటికి నూరుపాళ్లూ నిజమే. ఇతని కళలో ఉన్న చిత్రవిచిత్రాలైన ఆలేఖ్యాల్ని పాఠకుని ఎదుట నిలిపే శక్తిని ఎంతగానో ప్రశంసిస్తూ ఆధునిక యుగంలో ఉత్తమ రచయితా, విమర్శకుడు అయిన రవీంద్రనాథ టాగూరు, కాదంబరిలో కలంతో వ్రాసిన ఆలేఖ్యాలు బొమ్మల కొలువులో ఉన్నట్లు ఉంటాయని అన్నాడు (‘ప్రాచీన సాహిత్య’లో చేర్చిన ఒక వ్యాసం). దీన్ని ఎన్నో అంతస్తులున్న ప్రాసాదంతో, లేదా వివిధ పక్షాలుగల పురావస్తుశాలతో పోల్చవచ్చు. బాణుని అద్భుత ప్రతిభాస్పర్శ పొందిన వర్ణనలన్నీ సజీవంగా కనిపిస్తాయి. కాదంబరీ ప్రారంభంలో చిలుక తాను పుట్టిన అరణ్యాన్ని వర్ణించిన ఘట్టం ఉదాహరణగా చూపించవచ్చు :

“వింధ్యారణ్యమనే అరణ్యం ఉంది. ఇది ప్రాక్పశ్చిమ సముద్రాలదాకా వ్యాపించి, భూమికి మేఖలవలె మధ్య భాగాలంకారంగా ఉంది. ఇక్కడ సమృద్ధిగా ఉన్న మహావృక్షాలన్నీ వనగజాల మదజలంతో పెరుగుతూ ఉంటాయి. ఆకాశాన్ని అంటే వీటి శిఖరాలమీద వికసించిన తెల్లని పుష్పగుచ్ఛాలు నక్షత్రాలతో పోటీపడుతూ ఉంటాయి. అక్కడ మత్తెక్కి మధురంగా ధ్వని చేస్తూన్న కురరపక్షులు మిరియం మొక్కల చిగుళ్లు కొరుకుతూ ఉంటాయి. తమాల వృక్షశాఖల్ని గున్న ఏనుగులు తొక్కుతుంటే వాటి సువాసనలు అంతటా వ్యాపిస్తూంటాయి. మధుమదంచేత ఎరుపెక్కిన కేరళ యువతీ కపోలాలవలె అతి సుకుమారంగా పెరిగి, సంచరిస్తూన్న వనదేవతల పాదాల పారాయణ అంటుకుని ఎఱ్ఱబడ్డాయా అన్నట్లున్న చిగుళ్ళ సముదాయం ఆ వనాన్నంతా కప్పి ఉంది. అక్కడ ఉన్న లతాభవనాల

ఆకులన్నీ చిలుకలు కొరికిన దానిమ్మ పండ్ల రసంచేత తడిసి ఉంటాయి. చపల స్వభావంగల వానరాలు కంపిల్ల వృక్షాన్ని ఊపుతూండడంచేత వాటి చిగుళ్ళూ పళ్ళూకూడా ఆ లతా భవనాల మధ్య, నేలమీద పడి ఉంటాయి. అవిచ్ఛిన్నంగా పుష్పాడి రాల్తూ ఉండడంచేత పరాగం కప్పినట్లు ఉంటుంది ఆ భూమి. ఆ లతాభవనాల్లో పాంథులు లవంగ పల్లవాలతో ఏర్పాటు చేసుకున్న శయ్యలు ఉంటాయి. వాటి చుట్టూ మధ్య వయస్సులో ఉన్న కేతకీ-కరీర కేసర వృక్షాలు ఉంటాయి. పోక చెట్లు చుట్టూ అల్లుకుని పాకిన తాంబూలీలతలతో ఆ లతాగృహాలు వనలక్ష్మి నివాసగృహాలా అన్నట్లు ఉంటాయి.''

తీరికగా కూర్చొని ఆస్వాదించాలని అనుకునేవారికి ఇది రాజార్హమైన విందు. బాణుని కున్న రూపగంధాద్యనుభూతి ఎంత తీవ్రమైనదంటే దాన్నంతనీ ఆతడు బీరుపోకుండా మనకు అందచేయగలడు.

బాణుడు చేసిన సూర్యాస్తమయాది వర్ణన కూడా ఇలాగే ఒక విశిష్ట రీతిలో ఉంటుంది. ఎంతో సామాన్యమైన దనుకునే విషయంకూడా ఇతని చేతుల్లో చాలా చక్కగానూ, నిత్యానందంగానూ పరిణమిస్తుంది. ఇదే ఇతని ఉజ్జ్వలభావనలో ఉన్న వైశిష్ట్యం.

''తనకు అర్ఘ్యప్రదానం చేస్తూన్న మునిజనులు భూమి మీద సమర్పించిన రక్తచందనాన్ని సూర్యుడు తీసుకొని, శరీరానికి పూసుకున్నట్లుగా ఉన్నాడు. ఊర్ధ్వముఖులై, సూర్యబింబం మీద దృష్టి నిలిపి తపస్సు చేస్తూన్న ఊష్మపఋషులు తేజః ప్రసారాన్నంతనీ త్రాగివేయడం చేతనా అన్నట్లు సూర్యకాంతి తగ్గుముఖం పట్టింది. ఉదయిస్తూన్న సప్తర్షి సముదాయానికి తగులుతామేమో అన్న భయంచేతనా అన్నట్లు (కిరణాలు) ముడుచుకొని, పారావతచరణాలవలె పాటల వర్ణంతో ఉన్న

సూర్యుడు ఆకాశతలం నుంచి క్రిందికి వ్రేలాడుతున్నాడు. పశ్చిమ సముద్రంలో ప్రతిబింబించిన, ఎఱ్ఱని కాంతి సముదాయంగల ఆ సూర్యబింబం జలశయనం మీద ఉన్న మహావిష్ణువు యొక్క, మధుధారాస్రావియైన నాభికమలంవలె ఉంది. సాయంకాల సమయంలో రవి కిరణాలు, పక్షులవలె, భూతలాన్ని త్యజించి, కమలినీ వనాలు కూడా విడిచి, ఆశ్రయాల్లోని వృక్షశిఖరాల మీదా, పర్వతాగ్రాలమీదా, నిలిచాయి. ఎఱ్ఱని నీరు ఎండలు పడిన ఆశ్రమ వృక్షాలు చూస్తే, మునీశ్వరులు వాటికి ఎఱ్ఱని నార చీరలు కట్టారా అన్నట్లు ఉంది. భగవంతుడైన సహస్రకిరణుడు అస్తమించగానే, ఎఱ్ఱని సంధ్య పొగడాల తీగవలె పశ్చిమ సముద్ర ప్రాంతంనుంచి పైకి లేచింది.''

ఇక్కడ మనకు కనిపించేది మామూలు సూర్యుడు కాదు — విశ్రాంతి తీసికోవడం కోసం పశ్చిమాభిముఖంగా ప్రయాణం చేస్తూ సమస్తమైన వృక్ష మృగాది ప్రపంచానికి, ఎఱ్ఱని కాంతి పూసి అతిమనోహరంగా తయారుచేసే అత్యద్భుత ప్రభా భాస్వరుడైన సూర్యభగవానుడు. బాణుడి భాషను సరిగా అనువదించడం చాలా కష్టమైన పని. దానిలో ఒక విధమైన సంగీత లయ, హుందాతనమూ ఉన్నాయి. వాటిని అనువాదంలోకి తీసుకురావాలంటే శక్యంకాని పని. ఎందుచేతనంటే, సూర్యుణ్ణి చెప్పడానికి సంస్కృతభాషలో వెయ్యి పర్యాయపదాలుకూడా వాడవచ్చు. ప్రతీ విశేషణాన్నీకూడా 'నళినీ ప్రాణనాథుడు', 'సహస్రరశ్మి', 'దివాకరుడు'. ఇత్యాది విధంగా సమాసాల్లో ప్రయోగించవచ్చు. చెవికి ఇంపుగా ఉండడం అనే విషయాన్నికూడా దృష్టిలో ఉంచుకొని, ఇలాంటి విశేషణాల్లోనుంచి, బాగా ఉచితంగా ఉండే విశేషణాన్ని ఎన్నుకొనే అద్భుత ప్రతిభ బాణుడికి ఉంది. సర్వాంగీణమైన బాణుని సాహిత్యకళా వైశిష్ట్యాన్ని చెప్పడానికి తగిన ఒక్క పదం, లాంగినస్ ఉపయోగించిన అర్థంలో 'సబ్లైమ్' (సమున్నతి) అనే పదం. ''సముచిత పద ప్రయోగ విషయంలో సాధించిన సంసిద్ధికి 'సమున్నతి' అని పేరు. కొందరు గొప్ప రచయితలు ప్రథమస్థానాన్ని సంపాదించుకుని శాశ్వతమైన కీర్తి

పొందించకలిగారంటే ఈ సమున్నతి ద్వారానే. మరి దేనిని పట్టీ కాదు.'' సంస్కృత వాఙ్మయంలో, సమున్నత గద్యరచనా ప్రౌఢి విషయంలో, బాణుడితో పోటీపడగలిగిన కవి మరొకడెవరూ లేడు.

పైకి అద్భుతగాథామాత్రంగా కనిపించే ఈ కాదంబరిలో ఆధ్యాత్మిక తత్త్వంకూడా ప్రతీకరూపంలో నిగూఢంగా ఉన్నదని అంటూ వాసుదేవ శరణ అగ్రవాల్ ఒక హిందీ గ్రంథంలో ప్రతిపాదించారు. శూద్రకుడు, తన ఆత్మ స్వరూపాన్ని పూర్తిగా మరిచిపోయిన ఒక అజ్ఞానికి ప్రతీక. వైశం పాయనుడుగా పుట్టిన పుండరీకుడు, కామావేశంచేత సహస్రార చక్రంనుంచి పతనాన్ని పొందిన ఆత్మ చైతన్యానికీ, మహాశ్వేత నిర్మల చైతన్యానికి ప్రతీకలు. కామావేశం పక్కదారి పట్టినప్పుడు మానవుణ్ణి అంధుణ్ణిగాచేస్తుంది. దాన్నే సరియైన మార్గంలో నడిపినట్లైతే అది మానవుణ్ణి ఉద్ధరిస్తుంది. అట్టి కామావేశానికి ప్రతీక కాదంబరి. అప్సరసలు మాతృత్వానికీ, గంధర్వులు సృష్టి కార్యక్రమానికే ప్రతీకలు. వేదాలలోంచీ, బౌద్ధ వాఙ్మయంనుంచీ ఎన్నో ప్రమాణాలు చూపిస్తూ, ఆయన, ఈ కావ్యంలో ఆధ్యాత్మిక తత్త్వ బోధ నిగూఢంగా ఉన్నదని నిరూపించడానికి ప్రయత్నించారు. ఈ వ్యాఖ్యానం పైకి చూడడానికి చమత్కారంగానే ఉన్నా, ప్రామాణికము అని అంగీకరించడానికి అంతగా వీలు కనబడదు. ఈ కావ్యం ద్వారా ఒక ఆధ్యా త్మిక బోధ చేయాలనే అభిప్రాయం నిజంగా బాణుడికి ఉంటే, డాంటే 'ది డివైన్ కామెడీ'' అనే కావ్యంతో చేసినట్లుగా ఇతడుకూడా తన కావ్యంతో కొన్ని సూచికలు ఉంచేవాడు. కాని అలాంటిది ఒక్కటికూడా మనకు లభిం చడం లేదు. అందుచేత ఈ వ్యాఖ్యానం అంతా ఉపనిషత్తుల్లోనూ, బౌద్ధ మతంలోనూ ఉండే కొన్ని రహస్య తత్త్వాల్ని సమన్వయించి కూర్చడం కోసం చేసే పాండితీ పూర్ణమైన ప్రయత్నమే తప్ప, దీనికి మూలగ్రంథంలో ఆధారాలేవీ కనబడడంలేదు. అందుచేత దీన్నిగూర్చి చర్చించవలసిన పని లేదు. ఇలాంటి ఆధ్యాత్మికప్రతీక వాదాన్వేషణం కాదంబరిలోనే కాదు; ఆదర్శ భూతమైన ప్రేమను చిత్రించే ఏరచనలోనైనా చేయవచ్చు.

సాహిత్య రంగంలో బాణుని కీయవలసిన స్థానాన్నిగూర్చి చెపుతూ మహామహోపాధ్యాయ పి. వి. కాణే వ్రాసినది సంతులితంగానూ, వివేచనా సమంచితంగానూ ఉంది:—

"పాత్ర చిత్రణం విషయంలో బాణుడు గొప్ప నేర్పు, వివేకమూ చూపిస్తాడు. కాదంబరిలో ఉన్న వ్యక్తులందరూ, మొదటినుంచి చివరిదాకా, మామూలుగా లోకంలో ఉండే వ్యక్తులు లాగానే కనిపిస్తారు. సాధువూ, యువకుడూ అయిన హారీతుడూ, ఉదారుడూ, స్నేహశీలుడూ అయిన తారాపీడుడూ, ఎల్లప్పుడూ రాజును గూర్చే ఆలోచిస్తూ ఉండే విశ్వాసపాత్రుడైన మంత్రి శుకనాసుడూ, సుకుమార స్వభావంగల రాణి విలాసవతి, నీడవలె చంద్రాపీడుణ్ణి ఎల్లప్పుడూ వెన్నంటి తిరుగుతూ ఉండే స్వామిభక్తురాలైన పత్రలేఖా, ఎంతో ప్రేమ ఉన్నా కఠినంగా కూడా ప్రవర్తించ కలిగిన కపింజలుడూ, శరీరంలోనే కాకుండా మనస్సులో కూడా మాలిన్యం లేనిదీ, నాయికకు ప్రతిద్వంద్విగా నిలవతగినదీ అయిన మహాశ్వేతా—ఈ పాత్రలన్నీ పాఠకుని హృదయం మీాద చెరగని ముద్ర వేయకలిగినవే. ఐతే, బాణభట్టు నాయికా నాయకుల్ని అత్యద్భుతంగా చిత్రించడంలో తన కౌశలాన్నంతనీ చూపించాడు. కాని నాయకుని కంటె నాయికనే బాగా చిత్రించ కలిగాడు అని షేక్‌స్పియర్ విషయంలో చెప్పిన మాట బాణుడి విషయంలో కూడా సరిపోతుందని చెప్పవచ్చు."

కొన్నిచోట్ల ప్రకృత కథకి అనుగుణం కాకుండా, అతి దీర్ఘంగా సాగించిన వర్ణనల్ని గూర్చి కొందరు బాణుణ్ణి విమర్శించడంకూడా ఉంది. ఐతే, ఈ విమర్శ అంతా, నేటి నవలల్ని దృష్టిలో ఉంచుకొని కాదంబరికి విలువ కట్టడం కోసం ప్రయత్నించే పొరబాటువల్ల వచ్చినది. జీవితాన్ని యథార్థంగా చిత్రించడం నేటి కవుల లక్ష్యం అయితే, బాణుని కాలంలో సత్యజీవితాన్ని పూర్తిగా విడిచిపెట్టి, భావనాకల్పితమైన జీవితాన్ని చిత్రించడం కథా లక్షణంగా ఉండేవి. సాహిత్య కళకు అవసరమైన ఎన్నో విషయాలను నియమబద్ధంగా నిర్ణయించి, శక్యమైనంతవరకు వాటి నన్నింటినీ తమ

రచనల్లో పొందుపరచడానికి ప్రయత్నం చేసేవారు ఆనాటి మహాకవులు. అందుచేత దీర్ఘవర్ణనలన్నీ అద్భుతగాథల్లో ఉండే కళాపక్షాన్ని పరిపుష్టం చేయడం కోసం ప్రవేశపెట్టినవే. భాష విషయంలోకూడా రసదృష్టితో, ప్రత్యేకమైన శ్రద్ధ చూపించడం జరుగుతుంది ఈలాంటి రచనల్లో. ప్రొఫెసర్ సి. కున్హన్‌రాజా చెప్పినట్లు —

"కేవలం అద్భుత గాథలకి అలంకారంగా ఉండడంకోసమే అలాటి వర్ణనలు ప్రవేశ పెట్టడం జరుగుతుంది. వీటిని యుక్తమైన ప్రదేశాల్లో తగు ప్రమాణంలోనే ప్రవేశపెడతారు. పాఠకుడు కథను అనుసరించడంలో ఇవి ఏ మాత్రమూ అడ్డం తగలవు. పాఠకుని ఎదట ఉన్న కథకి ఈ వర్ణనలన్నీ అందం చేకూరుస్తాయి. వర్ణనల ద్వారా ఇలాంటి వైవిధ్యం తీసుకురాకపోతే, కేవల కథా కథనంవల్ల కొంత విసుపు కలగడానికి కూడా అవకాశం ఉంది. కథ ముందుకు సాగిపోతూ ఉంటుంటే వర్ణనలు ఆ కథా గమన వేగాన్ని కొంచెం తగ్గించి, కథలో జరుగుతూన్న వివిధ సంఘటనల్ని పూర్తిగా ఆకళించుకోవడానికి తగిన అవకాశం సమకూరుస్తాయి. ఈ విధంగా కథా గమనంలో అతివేగమూ ఉండదు, అతిమాంద్యమూ ఉండదు. కథ ఒడుదుడుకులు లేకుండా మెల్లిగా సాగుతుంది." (కాదంబరి. భారతీయ విద్యాభవన్, 1963. ఇంట్రడక్షన్ పే. 21).

6

# బాణుని (రీతి) శైలి

సంస్కృత గద్యరచనలో అత్యుత్తమమైన రీతిని నడిపించడంలో బాణభట్టుది అందెవేసిన చెయ్యి. ఈ విషయంలో నాటినుండి రవీంద్రనాథ టాగూరువరకూ ఉన్న భారతీయ సాహిత్య విమర్శకుల్లో ఏకాభిప్రాయం ఉంది. ఐతే కాదంబరిలోఉన్న భాషావర్ణనా సమృద్ధులు చూడగానే సాధారణ పాశ్చాత్య విమర్శకుల మనస్సుల్లో మొట్టమొదట కలిగిన భావం ఒక విధమైన విసుగుదల; చివరికి, సానుభూతితో పరిశీలించే శక్తిగల పీటర్సన్ కూడా ఇలా అంటాడు:—

"ఈ కావ్యంలో ఉన్న ఎన్నో ప్రదేశాల్లో, కొన్ని పదాలకి ఉన్న నిగూఢార్థాన్ని కాకుండా బాహ్యార్థాన్ని మాత్రమే గ్రహిస్తే, ఆ వాక్యాలన్నీ విసుగు కలిగింపచేస్తాయి. ఐతే, ఆ నిగూఢార్థాన్ని గ్రహించాలంటే పాఠకుడు చాలా శ్రమపడవలసి ఉంటుంది. అనాయాసంగానే దొర్లినాయని చెప్పుకుని ఆనందించినా, నిజానికి ప్రయత్నపూర్వకంగా శ్లిష్టపదాలు కూర్చడం సాహిత్య సౌందర్యానికి చాలా ప్రతిబంధకంగా ఉంటుంది. ఆతనికి ప్రాచీనులూ, అర్వాచీనులూ అయిన కొందరు కవులు అంతగా ఆనందకరం కాని ఈలాంటి సాహిత్యరీతిలో, ఏవిధంగా భాషలోని మారుమూల పదాలు ప్రయోగించే మార్గాన్ని అనుసరించారో, బాణుడుకూడా అదే విధంగా అనుసరించాడు. దాని ఫలితం ఏమిటంటే — మంచి మంచి స్థలాల్లో అతని వెనుకనే అర్థం వాడిపోతుంది. పదాల స్వాభావికమైన అర్థాన్ని స్వీకరించడానికి వీలు

లేదు. మంచి వ్యాఖ్యానంయొక్క సహాయం లేకపోతే సామాన్య పాఠకుడికి రెండో అర్థం తెలియదు.'.

ఈ సందర్భంలో, పీటర్సన్, "జర్నల్ అఫ్ ది ఓరియంటల్ సొసైటీ" లో, 1853 వ సంవత్సరంలో, కాదంబరిని గూర్చి వెబర్ వ్రాసిన వాక్యాలు ఉదాహరించాడు :—

"ఏదో ఒక చిన్న అర్థభేదాన్ని పురస్కరించుకొని చేసే పౌనరుక్త్యాలూ, ఒక పదాన్ని అనేక విశేషణాల భారంతో క్రుంగదీయడమూ, వీటిని పట్టిచూస్తే కాదంబరికంటె దశకుమార చరితమే మేలు అనిపిస్తుంది. నిరర్థకమైన శబ్దాడంబరం మధ్య కథ అతికష్టంగా ముందుకు సాగుతుంటే పాఠకుడి కుతూహలం పూర్తిగా నశించడానికి అవకాశం ఉంది. కొంతవరకూ దశ కుమార చరితంలోకూడా కనబడే ఒక అలవాటుని బాణభట్టు చాలాదూరం తీసుకుపోయాడు — క్రియ రెండో పేజీలోనో, మూడో పేజీలోనో, నాల్గోపేజీలోనో, కాదు కాదు — ఆరవ పేజీలో ఉంటుంది. ఈ మధ్యభాగం అంతా విశేషణాలతోటీ విశేషణాల విశేషణాలతోటీ నిండి ఉంటుంది. ఈ విశేషణాలు కూడా సాధారణంగా, పొడుగులో ఒక పంక్తికి మించిన సమాసాల రూపంలో ఉంటాయి. సంక్షేపంగా చెప్పాలంటే, బాణుని గద్యం భారతదేశంలోని ఒక అరణ్యం. కిందికి పెరిగిన కొమ్మలూ, దుబ్బు మొక్కలూ కొట్టుకొంటూ మార్గం ఏర్పరచుకుంటేనే కాని పాంథుడు ఏమాత్రమూ ముందుకు సాగలేదు. ఇంత శ్రమ పడుతూ ముందుకు సాగుతున్నా, తెలియని పదాల రూపంలో వచ్చి మీదపడే భయంకరారణ్య మృగాల బారినుంచి తప్పించు కోవడం కష్టం."

ఈ విధంగా వెబర్ అభిప్రాయాన్ని ఉదహరించి, పీటర్సన్ ఇంకా ఇలా వ్రాశాడు. వెబర్ మాటల్లో కొంత అతిశయోక్తి ఉంటే ఉండవచ్చు.

కాని మొత్తంమీద ఇది చాలావరకూ నిజమే. ఐతే, బాణుణ్ణి వెనకవేసుకు వచ్చేవాళ్లు ఇవన్నీ బాణుని రచనలో ఉన్న విశిష్టగుణాలనీ, అలంకారాలనీ, సమర్థించడం కోసం ప్రయత్నించవచ్చు. ఐతే ఇవన్నీ అలంకారాలు కావు. "అందమైన ముఖంమీద అసహ్యంగా కనిపించే మచ్చలు; వికారంగా ఉండే కంతులు."

ఇవన్నీ ఒక్కొక్కరికుండే అభిరుచులమీదా, భాష విషయంలో వారి కుండే అధికారంమీదా, భావుకతా శక్తి మీదా, మొత్తంపైన వారికుండే సామర్థ్యంమీదా ఆధారపడి ఉంటాయి. గడచిన నూరు సంవత్సరాలుగా విశ్వ విద్యాలయాల్లో పాఠ్యగ్రంథాలుగా బాణుని కావ్యాలు చదవవలసి వచ్చిన డిగ్రీ తరగతులకు చెందిన భారతీయ విద్యార్థులందరూకూడా, పరీక్షాగృహాల్లో బాణుని వాక్యాలు ఆంగ్లంలోనికి అనువదించవలసి వచ్చినప్పుడు ఈ విధం గానే అనుకొని ఉండవచ్చు. వాళ్లుకూడా బాణుణ్ణి ఇంతకంటె కఠినమైన మాటల్లో తిట్టి ఉండవచ్చు. వాస్తవానికి ఇవన్నీ అసలు విషయం మరచిపోయి మాటలాడే మాటలు. మనం పోప్ చెప్పిన మాటను మళ్లీ ఇంకొకసారి గుర్తుకు తెచ్చుకోవాలి:—

"కవుల్లో నిజమైన ప్రతిభ ఏవిధంగా చాలా అరుదుగా ఉంటుందో, అదేవిధంగా విమర్శకుల్లో సహృదయత్వంకూడా అరుదుగానే ఉంటుంది. కావ్యాలు రచించేవారూ, కావ్యాలు విమర్శించేవారుకూడా సమంగానే పరమే శ్వరుణ్ణుంచి వెలుతురు సంపాదించుకోవాలి. అరకొర జ్ఞానం అపాయానికి దారితీస్తుంది. పీరియా జల నీరు త్రాగుతే కడుపుపట్టేటంతా తాగాలి, లేకపోతే దాని రుచి చూడ్డం మానేయాలి .. ఒక రచయిత ఒక ఉత్తమ రచనను ఏ భావుకతాస్థాయిలో రచించాడో, అదే స్థాయిలో ఉత్తమ విమర్శకుడనే వాడు దాన్ని చదవాలి. మొత్తం విషయాన్నంతా ఆకళించుకోవాలి. మానవ స్వభావం చిన్న చిన్న తప్పులు పట్టుకోవడం కోసం ప్రయత్నిస్తూ ఉంటుంది. అప్పుడు ఆ చందంతో బుద్ధికి ఒక విధమైన వెప్పదనం లభిస్తుంది. ఐతే విమర్శ కుల్లో ఈ విధమైన ప్రవృత్తి మంచిది కాదు."

ఒక ఉత్తమ కావ్య రచయిత విషయంలో చూపించవలసిన సాను భూతితో మొత్తం కావ్యాన్నంతని పరిశీలించ కలిగిన ఓపిక అటు ప్రొఫెసర్ వెబర్‌వంటి వాళ్ళకి కాని, ఇటు డిగ్రీ విద్యార్థులకి కాని లేదు. ఈ సమగ్ర

పర్యవేక్షణ కావ్యరసాస్వాద దృష్టితో జరగాలి. అంతేనే కాని, తామున్న ప్రపంచానికి సంబంధించిన వైయక్తికానుభూతుల మీదకాని, ఇతర ప్రయోజనాల మీదగాని ఆధారపడి జరగకూడదు. పాశ్చాత్య పండితుల్లో కూడా ఇలాంటి ఓర్పు కలవారూ, దురాగ్రహం లేనివారూ కొందరు లేక పోలేదు. అలాంటి వాళ్లు బాణుని అసాధారణ ప్రతిభా ప్రభావాల్ని ఎంతగానో పశంసించారు. ఫ్రెంచి విమర్శకుడైన లాకోటి ఈవిధంగా వ్రాశాడు:-

"ఈ వాక్యానికున్న సౌందర్యం అంతా సౌకుమార్యంతోటీ, విషాదంతోటీ, భావిజన్మకు సంబంధించిన ఆశతోటీ నిండి ఉంది." **(Quoted by H. R. Karmik and V. D. Gangal, Kadambari, Bombay, 1939, introduction, P. XXIX.)**

'భారతీయ వాఙ్మయ చరిత్ర' అనే గ్రంథంలో వింటర్‌నిట్జ్ పండితుడు, వెబర్ చేసిన తీవ్ర విమర్శకు కొంత సమాధానం చెప్పాడు:-

"ఇక్కడ ఒక్క విషయం చెప్పవలసి ఉంది. సుదీర్ఘ వాక్యాల రూపంలోనూ కొన్ని అజ్ఞాతపదాల రూపంలోనూ కనబడే క్రూరమృగాన్ని ఒకదానికొకటి దూరంగా ఉండేటట్లుచేస్తూ సులభశైలిలో వ్రాసిన చిన్నచిన్న వాక్యాలు, మధ్య మధ్య, ఒక సునిర్ణీతక్రమంలో చేర్చడం జరిగింది. ఈ నవల చదివేటప్పుడు మనకు విసుగు కలిగితే కలగవచ్చు. ఐతే సంస్కృత భాషతో మంచి పరిచయం ఉన్న భారతీయ పాఠకుడికి ఇది ఆనందకరంగానే ఉంటుందనడంలో సందేహించవలసిన పనిలేదు."

బాగోగులు చక్కగా పరిశీలించి చేసిన ఈ నిర్ణయాన్ని కొంచెం విశదీకరించవలసి ఉంది. అందుచేత ముందుగా, అసహజత్వం లేకుండా హృదయావర్జకంగా ఉండే బాణుని రచనా విధానానికి ఒక ఉదాహరణం చూసి, తరువాత బాణుని శైలినిగూర్చి రవీంద్రనాథ టాగూరు చెప్పిన వాక్యాలు గుర్తుకు తెచ్చుకుందాం.

సరళంగానూ, విస్పష్టంగానూ, నడిచే బాణుడి శైలికి ఉదాహరణగా కాదంబరి చంద్రాపీడుడికి ప్రేమవార్త పంపిన ఘట్టాన్ని చూపించవచ్చు:-

"నీకు నామీద ఎంత అధికమైన ప్రేమ ఉన్నదో నాకు తెలుసు. ఐనా, సుకుమార శిరీష పుష్పంవలె మృదువైన హృదయం గల స్త్రీలకి, అందులోనూ బాల్యంలో ఉన్న కుమారీ జనానికి, ప్రేమసందేశం పంపడానికి తగినంత ప్రాగల్భ్యం ఉండదుకదా? స్వయంగా ప్రేమ సందేశం పంపడానికి పూనుకునే స్త్రీలు నిజంగా సాహసవతులే అని చెప్పాలి. ప్రేమసందేశం పంపే సాహసం చేస్తున్నందుకు చాలా సిగ్గుపడుతున్నాను. 'నీవు నాకు ప్రియుడవు' అని చెపితే పౌనరుక్త్యదోషం వస్తుంది. "నీకు నామీద ప్రేమ ఉన్నదా లేదా?" అని ప్రశ్నించడం మూఢత్వం అవుతుంది. "నీమీద నాకెంతో ప్రేమ ఉన్నది" అని చెప్పడం వేశ్యాలాపం అవుతుంది. 'నీవు లేకపోతే జీవించను' అని చెప్పడం అనుభవ విరుద్ధం. (ఎందుచేతనంటే ఈ మాటలు చెప్పేటప్పుడు జీవించే ఉన్నాను కదా?) "నన్ను మన్మథుడు పీడిస్తున్నాడు" అని చెపితే నా లోపాన్ని నేనే చెప్పుకున్నట్లు అవుతుంది. "మన్మథుడు నన్ను నీకు ఇచ్చేసినాడు" అని చెప్పడం స్వయంగా నిన్ను చేరడానికి ఉపాయం అవుతుంది. "నిన్ను బలాత్కారంగా వశపరచుకొంటు న్నాను" అని చెప్పడం కులటలు చూపించే ధార్ష్ట్యం అవుతుంది. "నీవు తప్పకుండా రావాలి" అని ఆదేశిస్తే అది సౌభాగ్యగర్వం అవుతుంది. "నేనే వస్తాను" అని చెపితే అది స్త్రీ చాపల్యం అవు తుంది, "ఈ సేవకురాలికి ఇతరులెవరిమీదా అనురాగం లేదు" అని చెపితే తన భక్తిని తానే చెప్పుకున్న తేలికతనం అవుతుంది. "నీవు నిరాకరిస్తావేమో అన్న భయంచేత సందేశం పంపడం లేదు" అని చెపితే ఎరుగనివానికి నేర్పినట్లు అవుతుంది. "నీ విరహంతో దారుణ దుఃఖాన్ని అనుభవిస్తున్నాను" అని చెప్పి నట్లైతే అతి ప్రణయం చూపించినట్లు అవుతుంది. "నాకు నీమీద

ఎంత ప్రేమఉందో నేను మరణించిన తరువాత తెలుస్తుంది'' అని చెప్పడం అసంభావ్యము.''

సూక్ష్మమైన భావచ్ఛాయలను ఈవిధంగా, సరళంగానూ, విస్పష్టంగానూ, ప్రకటించే విధానం చూస్తే ఏకాలానికి సంబంధించిన సహృదయుల హృదయాలైనా పులకరించక మానవు. ఇది, అడిసన్, "అలౌకిక రచనా విధానం'' అని పేరు పెట్టిన విధానానికి చక్కని ఉదాహరణం. చూడగానే విసుగు కలిగించేటట్టుగా ఉండే బాణుని రచనా విధానంలో ఉన్న సౌందర్యాన్ని మనం ఆస్వాదించాలంటే, అడిసన్ చెప్పిన ఈ అలౌకిక రచనా విధాన లక్షణాలు పరిశీలించాలి:

"ఒక విధమైన రచనా విధానంలో రచయిత ప్రకృతిని పూర్తిగా కనుమరచి, తాను సృష్టించిన పాత్రలద్వారానూ, వారి పనులద్వారానూ, పాఠకుల భావనను ఉత్తేజితం చేసి వారిని ఆనందింప చేస్తాడు. ఈ పాత్రలెవ్వరికీ నిజమైన అస్తిత్వం ఉండదు. భూతాలూ, పిశాచాలూ, మాంత్రికులూ, గారడీవాళ్లూ, రాక్షసులూ, దయ్యాలూ – వీళ్ళందరూ ఈకోవకి చెందినవారే. కవియొక్క భావనాశక్తిమీద ఆధారపడిన ఇతర విధానాలన్నింటి కంటేకూడా ఈ అలౌకిక రచనావిధానం, నిజంగా, చాలా కష్టమైన విషయం. ఎందుచేతనంటే ఆతడు అనుసరించడానికి తగిన ఉదాహరణాత్మక రచనలేవీ అతనికి లభించవు. అంతా స్వయంగా కల్పించుకోవలసిందే. ఈ రకమైన రచన చేయాలంటే ఒక విధమైన భావనాశక్తి ఉండాలి కవికి. అలౌకిక విషయాలమీద విశ్వాసముఉన్న విశిష్టమైన ఈలాంటి సహజభావనాశక్తి లేని కవి ఇలాంటి రచనచేసి చరితార్థుడు కాజాలడు. అతనికి కాల్పనిక కథలతోటీ, దాదుల్లోనూ ముసలమ్మల్లోనూ ప్రచారంలో ఉండే సంప్రదాయాలతోటీ పరిచయం ఉండాలి. అప్పుడే, మనలో నిగూఢంగా ఉన్న ఊహాశక్తిని ఉద్బుద్ధంచేసి, మనలో సహజంగా ఉండే అభిరుచులకు అనుగుణంగా వ్రాయ కలుగుతాడు ... .. ఈ వర్ణనలన్నీ అపరిచితులైన అపూర్వవ్యక్తులికి సంబంధించినవి అవడంచేత పాఠకుల భావనకి ఆనందం కలిగిస్తాయి. ఇలాంటి రచనలు చదువుతూంటే చిన్నతనంలో విన్న కథలన్నీ గుర్తుకు వస్తూ ఉంటాయి. విదేశీయుల ఆచారవ్యవహారాలను చూస్తూఉంటేనే మనకు ఆనందం కలుగుతూ ఉంటుంది. అటువంటప్పుడు మనల్ని ఒక క్రొత్త

ప్రపంచంలోనికి తీసుకువెళ్ళి, క్రొత్త రకం వ్యక్తుల్ని చూపిస్తూంటే ఎంత ఆనందం కలుగుతుందో చెప్పాలా? భావనాశక్తి లేనివాళ్లూ, తాత్త్వికదృష్టి ఎక్కువగా ఉన్నవాళ్లూ ఇలాంటి భావాల్ని అంతగా మెచ్చుకోరు ... .... ఈ ప్రకారంగా కవిత ఎన్నెన్ని విధాలుగా భావనోత్తేజనం కలిగిస్తూ ఉంటుందో మనం చూడవచ్చు. కవిత. ప్రాకృతిక పరిధిలో మాత్రమే సంచరించకుండా, దాన్నికూడా దాటి, క్రొత్త ప్రపంచాన్ని సృష్టించుకుంటుంది. వాస్తవమైన అస్తిత్వం లేనివాళ్ళని చూపిస్తుంది. ఆత్మకు సంబంధించిన ధర్మాలకి కూడా ఒక ఆకారం కల్పించి, వాటి గుణదోషాలతో పాటు, మనకంటి ఎదుట నిలబెడుతుంది.''

అడిసన్ వ్యక్తీకరించిన ఈ అభిప్రాయాలు చదువుతూంటే భారతీయునికి తన దేశంలోని ఆలంకారికులైన ఆనందవర్ధనుడో, కుంతకుడో వ్రాసిన విషయం చదువుతున్నామా అని అనిపిస్తుంది. అడిసన్ అన్న విలక్షణ భావనాశక్తినే కుంతకుడు వక్రోక్తి అని అన్నాడు; ఆనందవర్ధనుడు 'ధ్వని' అన్నాడు. అర్థరూపమైన రసము; లేదా స్వభావము – అనగా మానవ స్వభావము, లేదా ప్రకృతి – అలంకార్యమనీ, శబ్దమే అలంకారమని వీరిద్దరూ అంగీకరించారు. అన్యూనాతిరిక్తంగా ఉండే ఈ శబ్దార్థాల చక్కని కలయిక ఏర్పరచకలిగినదే నిజమైన ప్రతిభ. అలాంటి ప్రతిభకు బాణుడు అత్యుత్తమమైన ఉదాహరణం.

ఆధునిక యుగానికి చెందిన ఒక భావనాశక్తిగల భారతీయ సహృదయుని విషయంలో బాణుని ప్రభావం ఎలా ఉంటుందో తెలుసుకోవడానికి రవీంద్రనాథ టాగూరు చేసిన బాణప్రశంస పరిశీలిద్దాం. కీ. శే టి. యన్. వెంకన్నయ్యగారు 'ప్రాచీనసాహిత్య' (మైసూర్ 1927) అనే వ్యాససంకలన గ్రంథంలో కన్నడభాషలోనికి అనువదించిన రవీంద్రనాథటాగూరు వ్యాసం నుంచి ఈ క్రింది విషయాలు సంగ్రహింపబడ్డాయి.

''సంస్కృత భాషలో వివిధ ధ్వని సమ్మేళనమూ, దాని చేత ఏర్పడిన ఒక విధమైన మాధుర్యమూ, సహజమైన హృదయంగమత్వమూ ఉన్నాయి. ఇవి ఇతర భాషల్లో వేటిలోనూ లేవు. ఈ భాషను నైపుణ్యంతో ఉపయోగించినప్పుడు అనుభవ

గోచరమయ్యే నిగూఢధ్వని సమ్మేలన ప్రభావమూ, గంభీరమూ, వర్ణనాతీతమూ అయిన చమత్కారమూ, ఎంత అద్భుతంగా ఉంటాయనగా, ప్రతిభాశాలియైన పండితకవి ఈ దేవభాషను చక్కగా మలచుకొని, విజ్ఞులైన శ్రోతల్ని మంత్రముగ్ధులుగా చేసివేయాలనే అభిలాషను అణచుకోజాలడు. అందుచేత, కథాగమనానికి అనుకూలంగా ఉండే చిన్న చిన్న వాక్యాలతో రచన సాగించవలసిన సందర్భాల్లోకూడా, ఈ భాషకు సహజంగా ఉండే శిల్పానురూపత్వ గుణాన్ని పూర్తిగా ఉపయోగించుకోవాలనే కోరికను అణచుకోవడం చాలా కష్టం అయిపోతుంది కవికి. ఈ కోరిక, మధ్యలో లేచినిలబడి కవిని ముందుకు సాగనివ్వదు. నిజమే! నెమలి పింఛాలతో నిర్మించిన వింజామరలనుంచి మంచి గాలిరాదు. ఐతేనేమి? వాటికి ఉన్న అందాన్నిపట్టి, రాజాస్థానాల్లో వాటిని ఉపయోగిస్తూ ఉంటారు. వాటివల్ల ప్రయోజనం ఏమిటయ్యా అంటే అవి ఉండడమే ప్రయోజనం. రాజాస్థానాల కోసం రచించిన సంస్కృత మహాకావ్యాలుకూడా ఈ కోవకే చెందుతాయి. కథా కథనం వాటి ప్రధానలక్ష్యం కాదు. భాషా సంపదా, మనోహరములైన ఉపమానాలూ, వర్ణనాశక్తీ — వీటిని అన్నింటినీ ప్రదర్శించి, విజ్ఞులైన సభ్యుల్ని మెప్పించడమే వీటి ప్రధాన లక్ష్యం. సంస్కృత భాషలో మనకి లభించే ఈ జాతికి చెందిన రెండు మూడు కావ్యాల్లో కాదంబరి అత్యుత్తమమైనది. ఇది సుందరమైన రచన మాత్రమే కాదు; సమృద్ధంగా అలంకృతమైన రచన. గద్యం అనేది దైనందిన వ్యవహారానికి ఉపయోగించుకొనే సాధనం. దీన్ని సాధారణంగా వాదవివాదాలకీ, ఐతిహాసిక కథాకథనానికీ ఉపయోగించడం జరుగుతుంది. అందుచేత దీనికి అలంకారాలు చాలా తక్కువగా ఉంటాయి.

సాధారణంగా దాని అవయవాలమీద అలంకార ప్రదర్శనకి అవకాశం ఉండదు. కాని సంస్కృత గద్యను స్వాభావికాలైన పై ప్రయోజనాల కోసం మాత్రమే ఉపయోగించడం జరగలేదు. అందుచేత అప్పుడప్పుడు దీన్ని అత్యధికంగా అలంకరించడం జరుగుతూ ఉంటుంది. స్థూలకాయురాలైన వేశ్యవలె ఇది సమాసాలతో లావెక్కి మామూలుగా నడవలేని పరిస్థితిలో ఉంటుంది. ఇది ముందుకు కదలాలంటే, పండితులైన గొప్ప వ్యాఖ్యాకారులు దీన్ని పలక్కీ ఎక్కించి తమ భుజాలమీద మోయాలి. అసలు, కదలిక లేకపోయినా పరవాలేదు, ఇది, మిరుమిట్లు కొలిపే అలంకారాలతో ప్రకాశిస్తూ ఉంటే, అదేచాలు. అందుచేతనే, కథ చెప్పాలనే అభిప్రాయం ఉన్నాకూడా, బాణుడు, దాన్ని కొంత వరకూ ముందుకు సాగనిచ్చి, తద్వారా సంస్కృత భాషకి ఉండే రాచఠీవికి కొరత తేవడానికి ఇష్టపడలేదు. పరివారసమేతుడైన సమ్రాట్టు నడచినట్లుగా మందగమనంతో నడిపించాడు. తత్ఫలితంగా కథ అవ్యక్తంగానే ఉండి సమ్రాట్టు వెనక ఛత్రవాహకుడు వలె అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తుంది. భాషకున్న రాచఠీవికి ఈ కథద్వారా కొంత లాభం చేకూరింది. అందుచేతనే దానికి ఈమాత్రమైనా స్థానం ఇవ్వడం జరిగింది. ఐతే, ఎవ్వరూ కూడా కథకోసమే దీనివైపు దృష్టి మరల్చడం అనేది ఉండదు.''

ఆలంకారిక భాషలో రవీంద్రనాథటాగూరు చేసిన ఈ విమర్శ నిందాగర్భంగా ఉన్నదని చెప్పడానికి ఏమాత్రమూ అవకాశంలేదు. ఐతే, ప్రాచీన పండితుల అభిరుచికి భిన్నంగా మార్పుచెందిన నవీనాభిరుచిమాత్రం ఈ మాటల్లో ధ్వనిస్తూన్నది. కాదంబరిలో ఉన్న సమగ్ర కథా సంవిధానాన్ని గూర్చి టాగూరుకి స్వీయాభిప్రాయాలు కొన్ని ఉన్నా, ఇందులో ఉన్న వర్ణనలనన్నింటినీ వేరువేరుగా గ్రహించి, వాటి సమగ్ర సౌందర్యాన్ని పరిశీలించడంలో ఈయన తన సహృదయత్వాన్ని ప్రకటించాడు. అందుచేత

కాదంబరిని గూర్చి మొత్తంమీద ఆయన ప్రకటించిన అభిప్రాయంతో పాటు, కాదంబరిలో అనేక స్థలాల్లో కనబడే ఈ చిన్న చిన్న అద్భుత వర్ణనా భాగాల విషయంలో ఆయన ప్రకటించిన అభిప్రాయాల్నికూడా మనం కలపవలసి ఉంటుంది. పాశ్చాత్య పండితులు ఉపేక్షించిన ఈ అంశాన్ని గూర్చి టాగూరు ప్రకటించిన అభిప్రాయాలలో ఒకటి రెండు పరిశీలిద్దాం.

"వేరు వేరు చిత్రాలకి వేరు వేరు విధంగా ప్రాణంపోసి వాటిని మన ఎదుట నిలబెట్టడమే కాదంబరి కున్న గొప్పతనం. ఒకే మూసలోపోసి తీసిన నాణాలు కావు అవన్నీ. ఆశ్చర్యం గొల్పే వైవిధ్యం ఉంది ఈ చిత్రాల్లో. ఒక సూర్యోదయ వర్ణన ఈ విధంగా ప్రారంభం అవుతుంది :-"మరీచి మాలాలంకృతుడైన సూర్యభగవానుడు ఇంకా ఆకాశంమీద పైకి రాలేదు. అప్పుడే వికసిస్తూన్న పాటలీపుష్ప కాంతివలె ఉంది ఆ సూర్యుని కాంతి." రంగులతో చిత్రించారా అన్నట్లు ఉన్న ఆ అందమైన చిత్రాన్ని పాఠకుల మనస్సు ఎదుట ఉంచి, అతనిచేత, ఆ ప్రాతఃకాల సూర్యకాంతిలో చల్లగా వీచుతున్న సుగంధి మందమారుతాన్ని అనుభవింపచేయడమే ఈ వర్ణనయొక్క ముఖ్యప్రయోజనం. దీని తరువాత ఆ వర్ణన ఇంకా ఈ విధంగా సాగుతుంది :— "ఒక నాడు, మరీచి మాలాలంకృతుడైన సూర్యభగవానుడు నవనలిన దళాలను వికసింపచేస్తూ ఉదయించి, కొంచెం ఎరుపు తగ్గుతుండగా ... ..." ఎంత మనోహరమైన పదాల కూర్పు! దీన్ని అనువదించాలంటే మనం — "సూర్యుని రంగు ఇంకా కొంచెం ఎఱ్ఱగా ఉంది" అని అనువదించాలి. ఐతే, మూలంలో ఉపయోగించిన, మధురములైన సంస్కృత విశేషణాలు ప్రాతఃకాల మందమారుతాన్ని అందమైన రంగులతోటీ, సుగంధంతోటీ శీతలస్పర్శతోటీ నింపుతూ, అవన్నీ ఒక్కసారిగా మన హృదయాన్ని స్పృశించేటట్లు చేస్తున్నాయి."

బాణుని రచనలు చదివి ఆనందించాలని అనుకొనేవారికి భావనాశక్తీ, సహృదయత్వమూ, మధ్య మధ్య లభించే ప్రతీ ఆనందాన్నీ అనుభవిస్తూ మెల్లగా ముందుకు సాగడానికి తగిన తీరికా ఉండాలి. కథా గమనంలోని మాంద్యాన్ని చూసి విసుగుచెందకూడదు. ఈ కావ్యంలో ఉన్న లయ బద్ధ గమనాన్నీ, సంగీత మాధుర్యాన్నీ చూపించాలంటే మూలంలోని కొన్ని భాగాలు ఉదహరించవలసి వస్తుంది. ఐతే, వాటిని మామూలు పాఠకులు ఆస్వాదించలేకపోవచ్చు. అందుచేత ఈఅల్పగ్రంథంలో అలాంటి ప్రయత్నం చేయలేదు. సంస్కృత భాషా పరిచయం ఉన్న పాఠకుడు, రవీంద్రనాథ టాగూరు చూపిన పద్ధతి అనుసరిస్తే, ఎక్కువ వ్యాఖ్యానాపేక్ష లేకుండా ఈ కావ్యంలో ఉన్న సౌందర్యాన్ని స్వయంగానే గ్రహించవచ్చు.

సంస్కృత వాఙ్మయాభివృద్ధి విషయంలో బాణుని ప్రభావం అసాధారణమూ, అత్యద్భుతము అయినది. ఈ ప్రభావం గద్యకావ్యంమీదనే కాకుండా (ఉదా. దండియొక్క దశకుమార చరితం) గద్య పద్యాత్మకమైన చంపూ కావ్యంమీదకూడా ప్రసరించింది. రూపకవాఙ్మయంలో భట్ట నారాయణుడు బాణుని ముకుటతాడితకంచేత ప్రభావితుడై ఉండవచ్చు. చంపూ కావ్యాలు రచించినా, ఐతిహాసిక కావ్యాలు రచించినా తరువాతి కవులందరికీ, అద్భుతమైన బాణుని శైలిని అనుకరించడం ఒక వేలం వెర్రిగా తయారయింది. భవభూతి భట్టనారాయణాది నాటక రచయితలూ, బిల్హణ సోమేశ్వరాద్యైతిహాసిక కావ్యరచయితలూ, సోమదేవ భోజదేవాది చంపూ కావ్య రచయితలూ, ఈ అనుకరణోన్మాదానికి చక్కని ఉదాహరణలు. సంస్కృత కవులమీదనే కాకుండా 'గౌడవహో' అనే ప్రాకృతకావ్యం రచించిన వాక్పతిరాజుమీదా, అంతకంటెకూడా దూరమైన కన్నడ తెలుగు భాషా కావ్యరచయితలమీదా కూడా బాణుని ప్రభావం ప్రసరించడం ఆశ్చర్యకరం. కన్నడ కావ్యంలో ప్రథమ కవియైన పంపని రచనలో బాణుణ్ణి స్మరింపచేసే ఘట్టాలెన్నో ఉన్నాయి. కావ్యప్రారంభంలో కాళిదాసుతోపాటు బాణుణ్ణికూడా ప్రశంసించడం ప్రాచీన కన్నడ కవుల్లో సంప్రదాయం అయిపోయింది. కవి రాజ

మార్గ అనే మొట్టమొదటి అలంకార శాస్త్రగ్రంథం రచించిన నృపతుంగ అమోఘవర్ష మహారాజు మొట్టమొదటిసారిగా ఈ సంప్రదాయం ప్రారంభించాడు. భారతదేశంలో ప్రాచీనమహాకవికి ఇచ్చే గొప్ప గౌరవం ఇదే. భారతదేశం అంతటా కవులకుకూడా కవిగా పరిగణింపబడడమూ, ఇతన్ని అనుకరించడంకోసం ప్రయత్నించిన వాళ్లెవరూ ఈతనిని అతిక్రమింపజాలకపోవడమూ, ఇవే బాణుని అనన్యాదృశప్రతిభకు తార్కాణాలు. అచిరకాలంలోనే బాణునికి సంబంధించిన అనేక కథలు బయలుదేరి ఆతని కీర్తిప్రతిష్ఠలు అంతటా వ్యాపించాయి. ఎంతోమంది ఈతనిని గూర్చి వందలకొలది ప్రశంసా వాక్యాలు పలికారు. వాటితో రెండు మూడు ఉదాహరణలు :—

"సుబన్ధుర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః
వక్రోక్తిమార్గనిపుణాశ్చతుర్థో విద్యతే నవా.",

(కవిరాజ రచిత రాఘవపాణ్డవీయము 1-14)

"అల సుబంధుడు బాణభట్టాఖ్యసుకవి
సకలవిదితుండు కవిరాజసుకవివరుడు
చారువక్రోక్తిమార్గసంచారచణులు
కలయ నాల్గవవాడీలఁ గలడొ లేడొ."

"శ్లేషే కేచన శబ్దగుమ్ఫవిషయే కేచిద్రసే చాపరేఽ
లంకారే కతిచిత్సదర్థవిషయే చాన్యే కథావర్ణనే.
ఆసర్వత్ర గభీరధీరకవితావిన్ధ్యాటవీచాతురీ
సఞ్చారీ కవికుమ్భికుమ్భభిదురో బాణస్తు పఞ్చాననః.

(శ్రీ చంద్రదేవుని రచనగా పద్యసంకలనాల్లో ఉన్నది.)

"కొందరు శ్లేషమందు పదగుంభనమందును గొందరున్ రసం
బందునఁ గొందరర్థవిషయంబునఁ గొంద రలంకృతిస్థితిన్
గొందరు సత్కథాగ్రథితిఁ గొందరు నొప్పు కవిత్వదుర్గమా
మందఘనాటవీ విహృతి మాన్యమృగేంద్రుడు బాణుడొక్కడే."

ఈనాడుకూడా మనం బాణునిలో దృష్టి పరిపూర్ణత్వాన్ని చూడవచ్చు.

ఇది లోకోత్తర గాథనీ, మహాకావ్యానికి ఉండవలసిన పరినిష్ఠితత్వాన్నీ ఒక చోట కలపకలిగింది. మానవుడు భౌతిక విషయాల వెంటపడి గంభీరభావాలకీ ఆశలకీ మధ్య ఇంకా అఖాతం ఏర్పరచుకొనని దృష్టిపరిపూర్ణత్వం అది. తాను ఏర్పరచుకున్న ఆదర్శాలూ సత్యమూ కలిసి ఒక శాశ్వతమైన ఆకారాన్ని ధరించేవరకూ అతని మనస్సూ, హృదయమూ, ఆత్మాకూడా కలిసి పని చేశాయా అన్నట్లు అనిపిస్తుంది. సంస్కృత వాఙ్మయంలోని ఇతర మహాకవుల్లోవలెనే బాణునిలోకూడా పవిత్రతాసాహిత్యాల సాహిత్యం (మేళనం) గోచరిస్తుంది. ప్రకృతికీ సంప్రదాయాలకీ దూరంకాని మానవుడు కనిపిస్తాడు. ఇలాంటి కలయికని దృష్టిలో పెట్టుకొని వ్రాయడంచేతనే ఈ కావ్యంలో సూర్యుడూ, నక్షత్రాలూ, ఆకాశమూ మొదలైన ప్రకృతి ప్రతీకల అద్భుత చిత్రణం కనిపిస్తుంది. మానసిక - యాంత్రిక శక్తులకీ, కలా - విజ్ఞాన శాస్త్రాలకీ, కాల్పనిక పురాణేతిహాసాలకీ మధ్య విభేధాలు లేకుండా విశ్వాత్మకుడైన పరిపూర్ణ మానవుణ్ణి చూడాలంటే ఆధునికులుకూడా బాణుని రచనలు చదవాలి.

యత్కృపాలేశ సంసర్గాదనువా ఽకృతో మయా
తస్యైవ జానకీజానేః పదయోరయ మర్ప్యతే.

# సుసంచిత గ్రంథ సూచిక

## సంస్కృతంలో ప్రకాశితములైన గ్రంథాలు

దేవీశతకమ్. కావ్యమాలాప్రచురణము.
నిర్ణయసాగర్ ప్రెస్సు, బొంబాయి, 1999.
హర్షచరితమ్, నిర్ణయసాగర్ ప్రెస్సు, బొంబాయి 1946.

కాదంబరి, పి. పీటర్సన్ సంపాదించినది. మొదటి భాగము సంస్కృత గ్రంథమాల. నెం. XXIV (మూడవ ప్రకాశనము) 1900.

## ప్రామాణికాలైన ఆంగ్లానువాదాలు

హర్షచరితమ్: E. W. కోవెల్, F. W. థామస్‌ల అనువాదము. రాయల్ ఏసియాటిక్ సొసైటీ, లండన్ 1897.

కాదంబరి: శ్రీమతి సి. యం. రిడ్డింగ్ మధ్య మధ్య విడిచిపెడుతూ చేసిన అనువాదము. రాయల్ ఏసియాటిక్ సొసైటీ, లండన్ 1896.

## విమర్శనాత్మక రచనలు – సాధారణ గ్రంథాలు

వాసుదేవశరణ అగ్రవాల్: కాదంబరి, చౌఖాంబా విద్యాభవన్, వారాణాసి 1958 (హిందీ).

S. K. డే: హిస్టరీ ఆఫ్ సాన్‌స్క్రిట్ లిటరేచర్ (సంస్కృత వాఙ్మయ చరిత్ర) కలకత్తా 1947.

P. V. కాణే: కాదంబరికి వ్రాసిన ఉపోద్ఘాతము (బొంబాయి 1920 మరియు 1921) హర్షచరితమునకు వ్రాసిన ఉపోద్ఘాతము (బొంబాయి 1918).

R. D. కర్మార్కర్: బాణ. కర్ణాటక యూనివర్శిటీ, ధార్వార్. 1964.

A. B. కీథ్ : ఎ హిస్టరీ ఆఫ్ సాన్‌స్క్రిట్ లిటరేచర్ (సంస్కృత వాఙ్మయ చరిత్ర) లండన్ 1923.

C. కున్‌హన్ రాజా: కాదంబరి-భారతీయ విద్యాభవన్, బొంబాయి 1963.

శ్రీమతి నీతాశర్మ : బాణభట్ట, ఎ లిటరరీ స్టడీ (బాణభట్టు - ఒక సాహిత్య శాస్త్రీయాధ్యయనము) మున్షీరామ్ మనోహర్ లాల్, ఢిల్లీ 1968.

పి. పీటర్సన్ : కాదంబరి ఉపోద్ఘాతము, టిప్పణి. బొంబాయి 1883.

రవీంద్రనాథటాగూర్ : ప్రాచీన సాహిత్య (బెంగాలీ) T. S. వెంకన్నయ్య చేసిన కన్నడానువాదము. మైసూరు 1956,